పదసాహిత్య పరిమళం

(పదసాహిత్య వ్యాస సంపుటి)

రచయిత :

ఆచార్య ఎస్. గంగప్ప, ఎం. ఏ., పిహెచ్., డి.,

తెలుగు, ప్రాచ్యభాషా విభాగం,

నాగార్జున విశ్వవిద్యాలయం,

నాగార్జుననగర్ - 522 510, గుంటూరు జిల్లా.



ప్రథమ ముద్రణ : డిశంబర్ 1994

ప్రతులు : 1000

వెల : 50/-

ముఖపత్ర చిత్రణ :

ప్రతులకు :

శ్రీమతి ఎస్. పార్వతమ్మ

శశీ ప్రచురణలు

'సుధర్మ'

సి/73, శ్రీనివాసనగర్ కాలనీ

గుంటూరు - 522 006

ఫోన్ నెం. 231 805

This book is Published with the Financial Assistance of Tirumala Tirupati Devasthanams under their Scheme "AID TO PUBLISH RELIGIOUS BOOKS"

ముద్రణ : శ్రీ లక్ష్మీగణపతి ప్రింటర్స్, బ్రాడీపేట, గుంటూరు.

# విషయసూచిక

# ప్రస్తావన

నిరంతరం నేను చేస్తున్న సాహిత్య పరిశోధనలో ఒక అంశమే 'పద సాహిత్య పరిమళం' అనే ఈ పదసాహిత్య వ్యాస సంపుటి. 1982 నుంచి దశాబ్దికిపైగా 'అన్నమాచార్య, ప్రముఖ వాగ్గేయకారులు - తులనాత్మక అధ్యయనం' (A Comparative Study of Annamacharya with Famous Saint-Singers) 1992 గ్రంథరచన, ప్రచురణ సమయంలో నేనుచేసిన పరిశోధనలో ఒక అంశమిది. వాస్తవానికిది 1993 సం॥నికి తెలుగు విశ్వవిద్యాలయం సాహితీ పురస్కారం పొందిన పైగ్రంథానికి అనుబంధగ్రంథం. కారణాలు స్పష్టమే. అన్నమాచార్యుడు కేంద్రబిందువుగా ఇతర వాగ్గేయకారులైన జయదేవాదులతో తులనాత్మకంగా పరిశీలించిన వ్యాసాలివి. వీటిన్నిటా పరిశోధన, తులనాత్మక విమర్శ, విశ్లేషణ ముప్పిరిగొన్నాయి.

ఇందులోని వ్యాసాలు కొన్ని సాహిత్య చర్చాగోష్ఠుల్లో, సదస్సుల్లో సమర్పించిన పత్రాలు; మరికొన్ని ప్రత్యేక సంచికలకోసం రచించినవి; ఇంక కొన్ని రేడియో ప్రసంగాలు; అన్నీకలిసి పదసాహిత్య పరిమళం! చాలావరకు ఇవి ఇంతకుముందే ప్రకటితాలు.

రసగ్రహణ పారీణులైన విద్యార్థులు, పరిశోధక విద్యార్థులతోపాటు సాహిత్యాభిమానులు సైతం 'పదసాహిత్య పరిమళం' ఆఘ్రాణించి ఆనందిస్తారని ఆశిస్తున్నాను.

గ్రంథప్రచురణ సమయంలో అన్నివిధాలా సహకరించిన మా అల్లుడు డా॥ గుమ్మా సాంబశివరావుకు, మా అబ్బాయి డా॥ ఎస్. మురళీమోహన్‌కీ, పరిశోధక విద్యార్థిని కుమారి బి. శారదాసుందరికి ఆశీరభినందనలు.

గ్రంథముద్రణార్థం ఆర్థికసహాయం చేసిన తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణ మండలికి నా కృతజ్ఞతలు.

ముచ్చటగా ముద్రించి ఇచ్చిన శ్రీ లక్ష్మీగణపతి ప్రింటర్స్ అధినేత శ్రీ బి. వి. ఎస్. శాస్త్రికి అభినందనలు.

సుధర్మ ఎస్. గంగప్ప

30-12-1994



కృతి స్వీకర్త

## అంకితం

సాహిత్యాభినివేశమూర్తులు
పరిశోధనా ప్రత్యయపూర్ణులు
శస్త్రచికిత్సా నిపుణులు
మహా మానవతావాదులు

జాషువా కమనీయకవితకీ
రాయల రమణీయ రసికతకీ
చెవికోసుకొనే రసజ్ఞులు
సభాపురోతా మర్మజ్ఞులు

డా॥ సదాశివరావు మహోదయులకు
అర్వా పరోపకార పరాయణులకు
మదీయ సదా పరిశోధనఫలం
సంపుటి 'పదసాహిత్య పరిమళం'
మీకు చంద్రునికో నూలిపోగు విధం
గౌరవ పురస్సరంగా సమర్పణం !

ఆచార్య ఎస్. గంగప్ప

# పద సాహిత్యం

"ముదివిటులు విధవ లంజలు
పద కవితలు మూరు బాస బాపనవారల్
చదువని పండిత వర్యులు
కదనాస్థిర వీరవరులు కడిదిపురమునన్"

[చాటుపద్య మణిమంజరి 1, పు. 130]

ఇది తెలుగు కవులలో ప్రసిద్ధుడైన శ్రీనాథునిదని ప్రతీతి కాని ఇది నమ్మశక్యం గాని సంగతి. శ్రీనాథుడు ఒక చెంప ఉద్దండ పండిత ప్రకాండుల ప్రశంసాపాత్ర మైన శృంగార నైషధాది మహా కావ్యకర్త అయినట్లే మరోవైపు పామర ప్రజల మన్ననలకు నోచుకొన్న పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు కథల్ని రచించి ఉండడం సర్వ పండిత లోకానికి సువిదితమే. పరంపరగా మన పండితవర్యులు పద సాహిత్యానికి ప్రాధాన్యం ఇవ్వలేదన్న మాటమాత్రం అక్షర సత్యం; చారిత్రక సత్యం.

సంస్కృత సమాస భూయిష్ఠమై, శబ్దాడంబర సంయుతమైనది పండితుల భాష. సరళమూ, సులలితమూ, సులభగ్రాహ్యమూ అయినది పామర భాష. దీన్నే మనం లక్షణానుగుణంగా మరో విధంగా చెప్పవచ్చు: గ్రాంధిక భాష, గ్రామ్యభాష అనవచ్చు. కానీ ఈ గ్రాంథిక భాషకంటే గ్రామ్యభాషే మొదటిదన్న విషయం మనం మరవకూడదు. పామరుల వాడుక భాషయే కాలాంతరంలో సంస్కరించబడి, వ్యాకరించబడి లక్షణబద్ధమై గ్రాంథిక భాష అయింది; అంటే పండితభాష అయింది. "ప్రయోగ శరణం వ్యాకరణమ్" అనే సూత్రమే దీనికి చక్కటి తార్కాణం.

ఇలాగే సాహిత్య విషయంలోను మనం గమనించగలం తెలుగు సాహిత్యాన్నంతటినీ పండిత సాహిత్యమూ, పామర సాహిత్యమూ - అని స్థూలంగా రెండు విధాలుగా విభజించవచ్చు. దీన్నే ప్రౌఢ సాహిత్యమూ, జానపద సాహిత్యమూనని పేర్కొనవచ్చు. ఇంతకంటే శిష్ట సాహిత్యమూ, శిష్టేతర సాహిత్యమూ - అని చెప్పటం సముచితం. ఈ శిష్ట సాహిత్యంకంటే, శిష్టేతర సాహిత్యమే ఆదిలో

ఆవిర్భవించి, వికాసం పొందింది. ఆ వెనుకే శిష్ట సాహిత్యం ఉద్భవించి, తన బలాన్ని, ప్రాభవాన్ని స్థిరపరచుకొంది. నిజమే 'ముందొచ్చిన చెవులకంటే వెను కొచ్చిన కొమ్ములువాడి' అన్న సామెత ఉంది కదా! అనాదిగా వస్తూన్న సహజమూ, స్వాభావికమూ, నిసర్గ మనోజ్ఞమూ అయిన జానపద కవితను మనపూర్వులు సేకరించి రాపాడలేదు. రాజాదరణకు పాత్రమైన శిష్ట సాహిత్యం అధికారం చలాయిస్తూ వచ్చింది. జానపద సాహిత్యమంతా ఆడి, పాడుకోవడానికి పనికివచ్చే పద కవితలు. పండితులకు మాత్రమే పరిమితమైన శిష్ట సాహిత్యమంతా పద్యకవితలు. జానపద సాహిత్యం జనసామాన్యంలోనూ, పండిత సాహిత్యం పండిత పరిషత్తుల లోను కొనసాగుతూనే వచ్చాయి. దీన్నే మనం మరోవిధంగా చెప్పవచ్చు. తెలుగు సాహిత్యపు మాగాణంలో శిష్టేతర కవితా ప్రవాహం మూడుపాయలుగా ప్రవహిస్తూ వస్తూంది. మొదటిది కేవలం జానపద కవిత; దానిపుట్టుక అనాది; లిఖితం కాలేదు; కేవలం మౌఖికం. రెండోది పాల్కురికి సోమనాథునితో ప్రారంభమైన ద్విపద కవిత; దీనికి మళ్ళీ జానపదులలో వ్యాప్తిలో ఉన్న ఏలలు, జోలలు, కథలూ, గాథలూ మొదలైనవే ఆధారం. కాకపోతే ద్విపదని మాత్రమే పాల్కురికి గ్రహించాడు. గ్రహించడమే గాదు; దానికి కావ్య ప్రతిపత్తిని తెచ్చాడు. అంటే పండితులు గౌరవించేట్టు చేశాడు.

"తేట తెనుంగున ద్విపదరచింతు
..................................
ఒప్పదు ద్విపద గావ్యోక్తి నావలవ,
దారూఢ గద్య పద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠ రచన
మానుగా సర్వ సామాన్యంబు గామి
జాను తెనుగు విశేషము ప్రసన్నతకు
నట్టులు గాక కావ్య ప్రౌఢి పేర్మి
నెట్టన రచియింప నేర్చిన జాలు
నుపమింప గద్య పద్యోదాత్త కృతులు
ద్విపదయు సమము భావింప........
..................................
పరకవుల్గొనియాడ వర్ణన కెక్క-
ధర జెప్పగృతియు నుద్యత్కృతిగాక"[1]

- అని చెప్పడమే గాదు; ఆనాడు పండిత లోకంలో తెలుగు పలుకులంటే గౌరవాదరాలు లేవని తెలుస్తూంది. ఆ పండితుల్ని ఒప్పించడానికి పాల్కురికి పాటుపడినట్టు తెలుస్తుంది.

"ఉరుతర గద్య పద్యోక్తులకంటె
సరసమై పరగిన జానుదెనుంగు
చర్చింపగా సర్వసామాన్యమగుట
గూర్చెద ద్విపదలు గోర్కి దైవార
దెలుగు మాటలనంగ వలదు; వేదముల
కొలదియ కాఁ జూడుఁ డిలనెట్లు లనిన
బాటి తూమునకును బాటి యానేని
బాటింప నోలయు బాటియకాదే"[2]

- "తెలుగు మాటలనంగ వలదు; వేదముల కొలదియుగా జూడుతు" అని పాల్కురికి పట్టుపట్టి ఒప్పించాడు. అందుకే ఆ తరువాత తెలుగు సాహిత్యంలో ద్విపద రచనలకు అత్యంతాదరం లభించింది. ఒక శాఖగా శోభాయమానంగా వెలుగొందుతూ వచ్చింది.

ఇక మూడోది తాళ్ళపాక అన్నమాచార్యునితో ఆరంభమైన సంకీర్తన సాహిత్యం. ఇది తెలుగులోని పద సాహిత్యం. అనాదినుంచి వస్తూ, ఆనాటి సామాన్య ప్రజలలో ప్రచారంలో ఉండిన జానపద గేయరీతుల్ని గ్రహించి, అనేక పదాలను శిష్ట కవితలో ఒక భాగంగా వెలయించి, పద్య కవితా పీఠం పక్కనే పద కవితకు కైతం సరి పీఠం సమర్పించిన ఘనత అన్నమాచార్యునికి దక్కింది; పై పెచ్చు 'సంకీర్తన లక్షణం' సంస్కృత భాషలో రచించి దీనికి విశిష్టతని, గౌరవ ప్రతిపత్తుల్ని తీసుకొని వచ్చిన ఘనత ఇతనిదే. ఇది గమనించదగ్గది; గర్వించదగ్గది. ఈ పద సాహిత్యంలో కొనసాగిన పరిశోధనను పరిశీలించడమే ఈ వ్యాస ప్రధానోద్దేశం.

ఈ పద సాహిత్యం దేశి కవితా విభూతిలోని భాగం. దేశి అయిన తెలుగు కవిత నాలుగు విధాలని, అందులో మధుర కవితా రీతిలో చేరినది పదకవిత అని లాక్షణికోక్తి ఉంది. "తెలుగు కవిత యాశు, మధుర, చిత్ర, విస్తరములని నాల్గు తెఱగుల గలదని లాక్షణికులలిరి........అందు మధుర కవితయనగా పాటలు మొదల

లగునవి. లక్షణ దీపికలో నీవిషయమిట్లు చెప్పబడినది. మధుర కవిత్వంబన్నది నాటకాలంకారంబులు, కళికోత్కళికలు, విభక్త్యర్థి ప్రతోదాహరణము, సప్త తాళ నటనలు, నట్టొట్లు, గీత ప్రబంధములు, గతుర్భద్రికాష్ట భద్రికలు, బిరుదావళి, నామావళి, భోగావళి, రంగఘోష, చతురతర సంపుటనలు, యక్ష గానంబున వెలయు పదంబులు, దరువులు, ఏలలు, ధవళంబులు, మంగళహారతులు, శోభనంబులు, ఉయ్యాల జోలలు, జక్కుల రేకు పదంబులు, చందమామ సుద్దులు, అష్టకంబులు, ఏక పదంబులు, ద్విపద, త్రిపద, చతుష్ట పదాష్టపదులు లోనివి యాదిగా గల్గునవి."[3]

ప్రపంచములోని ఏ సాహిత్యాన్ని పరిశీలించినా, పద పద్య కవితల్లో పద కవిత్వమే ముందావిర్భవించిందన్న విషయం సర్వ ప్రాచ్య, పాశ్చాత్య విపశ్చిద్వరులు అంగీకరించారు. ప్రాక్తన మానవుడు సుఖదుఃఖాది అనుభూతుల్ని పొందినపుడు తదనుగుణంగా ఆడి, పాడుకోవడంలోనే ఈ పద కవిత పుట్టింది. ఈ పద కవితావిర్భావాన్ని గూర్చి R. G. Moulton పండితుని అభిప్రాయము ఉల్లేఖించదగ్గది. "The Improvised lyrical song, Communal or individual, a popular or artistic is probably the simplest and most spontanious form of lyric expression........The true song is primarly the instinctive out-burst of emotion or emotional thought in language which by aptness of word and rythm echoes suggests the underlying emotion and melody of line and harmony of stanza is adopted to such modulations of the singing voice as naturally distinguish emotional utterance .. ....The song is therefore more than any other lyric king a musical cry."[4]

"That the popular or traditional ballad is folk poetry, i. e. poetry that has originated usually in oral from, among a homogeneous, non literary people and has been handed down among them by word of mouth, is generally conceded."[5]

"మనదేశంలో చాల ప్రాతపాటలు వేద సూక్తములు. మనుష్య జాతికి అవి మొదటి రచనలు అని యూహింపవలసినవి. వాటి గానమందు తాళము లేదు అను నది మనమిక్కడ గమనింపవలసిన సత్యము ...నేటికినీ తెలుగులో పరమ ప్రాచీన పద్ధతియని చెప్పదగిన పల్లెపాటలు, కపిలె పాటలు మొదలగునవి - కొన్ని తాళ

నియమము లేకుండనే పాడబడుచున్నవి. ఈ రాగ తాళములు రెంటిని కలిపి హృదయంగములైన భావములను వెలువరుచు భాషను అలంకరించుటయే పదరచనకు పరిపూర్ణ స్వరూపము. దాని పూర్ణానుభవమును మనకప్పుడే; సతాళముగనో, వితాళముగనో కావ్య కళారసానుభవమును ప్రాచీన మనుష్యజాతి పాట రూపముననే అనుభవించి రసించినదని పండితులూహింతురు. మన పద్యములన్నియు పదముల పరిణామములే అని భావించుటకు పెద్ద సూక్ష్మదృష్టి అక్కరలేదు"[6] అని శ్రీరాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారి మాటలు చక్కటి నిదర్శనాలు. కాబట్టి ఈ పదకవితే కాలాంతరములో సంస్కరించబడి పద్యకావ్యంగా, ప్రౌఢకావ్యంగా, పండిత కావ్యంగా అంగీకరించబడి గౌరవాదరాలకు పాత్రమైంది. పదకవిత చాలాకాలం వరకు పండితామోద ముద్రను పొందకపోయినా, రాజగౌరవ పాత్రం కాకపోయినా దాని దారిన అది నడుస్తూనే వచ్చింది; అభివృద్ధి చెందుతూనే వచ్చింది. సామాన్య ప్రజల మన్ననలకు మాననీయమవుతూనే వచ్చింది. చివరికి రాజ గౌరవాదరాలకు నోచుకొంది; పండితులు సైతం సమాదరించడం జరిగింది.

తెలుగులో సైతం ఆరంభంలో చక్కటి పదాలుండేవనీ, పామర ప్రజలు వాటిని పాడి ఆనందించేవారనీ చెప్పానికి తగిన ఆధారాలున్నాయి. పాల్కురికి సోమనాధుని మాటలే ఇందుకు చక్కటి తార్కాణం :

"మదినుబ్బ సంసార మాయా స్తవంబు
పదములు, పర్వత పదము, లానంద
పదములు, శంకర పదముల్, నివాళి
పదములు, వాలేశు పదములు, గొబ్బి
పదములు, వెన్నెల పదములు, సెజ్జ
వర్ణన మణిగణ వర్ణన పదము
లర్ణవ ఘోషణ ఘూర్ణిల్లుచుండ"[7]

భక్తులు శ్రీశైల పర్వతారోహణ సమయంలో పాడినట్లు పేర్కొన్నాడు సోమనాథుడు. కానీ పైని వర్ణితమైన పదాల స్వరూప స్వభావాలేమిటో తెలుసుకొనే అవకాశం మనకు లభించలేదు. కారణం అలాంటి పాటలకు మన సాహిత్యంలో స్థానం లేకపోవడమే ఇలాగే నన్నెచోడుని కాలంలో ఊయల పాటలు, గౌడు గీతాలు ఉండేవని తెలుస్తూంది[8] ఇంతకంటే పూర్వం ఎలాంటి దేశి రచనలుండేవో కొంతవరకు తెలుసుకోవచ్చు. ప్రాఙ్నన్నయ యుగంలోని శాసనాల్లోని తరువోజ

సీసం, మధ్యాక్కర మొదలైన దేశీచ్ఛందస్సులు వాడబడ్డాయి.ఇవి నిబద్ధ చ్ఛందస్సులలో ఉండడంవల్ల శాసనాల్లోనికి ఎక్కాయి. కానీ అనిబద్ధాలై పండితులచేత ఈసడించబడ్డ సామాన్య జన సముదాయపు పాటలు పరిగణనలోనికి రాలేకపోయాయి. అవి కేవలం మౌఖికం కావడంవల్ల వాటికి స్థిరత్వం లేకపోవడంతో నశించిపోయాయి. అయితే మానవుడు జన్మించి సహజ సంతోష దుఃఖాల అనుభూతిని పొందినప్పటినుంచీ పూర్వోక్తమైనట్లు పదాలు కోకొల్లలుగా వెలిసే ఉంటాయి. పామర ప్రజల రచనలే పట్టుగొమ్మలై వాటి కాధారంగా ఉండేవని మనం భావించడంలో తప్పులేదు. 'నన్నయ నాటికి తెనుగున నెలకొన్న రచనములు పాటలు, పదాలు, ఏలలు, జోలలు, అర్ధ చంద్రికలు మొదలగు గేయ రచనములును, అక్షర గణములతో గాక, మాత్ర గణములలో నిబద్ధములగు అక్కరలు, రగడలు, సీసములు, గీతములు, మంజరి, తరువోజ, ద్విపద మొదలగు పద్య రచనములునై యుండును.'[9] నాచన సోమనాథుడు ఉత్తర హరివంశంతోపాటు 'వసంత విలాసం' అనే ప్రబంధం రచించినట్లు తెలుస్తూంది. అందులో జాజర పాట ప్రసక్తి ఉంది.

"వీణాగానం వెన్నెల తేట
రాణమీరగా రమణుల పాట
పేరు చెప్పిన పిన బ్రాహ్మణవీట
జాణలు మెత్తురు జాజర పాట"

- ఇలాంటి లేట తెలుగు పద కవితల్ని విని ఆనందించే అదృష్టం ఆంధ్రులకు కలుగలేదు అవి లభింపకపోవడం వల్ల.

ఏది ఏమైనా సంకీర్తన సాహిత్యం కృష్ణమాచార్యులతోనే ఆరంభమైంది అయన సింహగిరి వచనాలు కొన్ని లభించాయి. ఇతని తరువాత పేర్కొనదగ్గవారు యాగంటివారు. వారి పదాలు, వచనాలు పామర ప్రజల్లో బహుళ ప్రచారంలో ఉండేవి. తదనంతర కాలంలో వీరబ్రహ్మంగారు, వారి శిష్యుడు దూదేకుల సిద్దయ్యల తత్వాలు ప్రసిద్ధిలోకి వచ్చిన సంగతి మనమెరిగినదే.

తెలుగు పద సాహిత్యానికి 15వ శ. వసంతకాలం. ఆనాడు వేనకు వేలు పదాలు రచించబడ్డాయి. తెలుగు పదకవితకు ఆద్యుడు అనవద్యుడు అన్నమాచార్యుడు; సంకీర్తనాచార్య, పదకవితాపితామహ బిరుదాంకితుడు. ఇతడి పుత్ర పౌత్రులు సైతం పదకవితా రచనచేసి, పదకవితకు రచనా సేవగావించినవారు. ఆ

వెనుక సంగీత సాహిత్యాలకు సమాన గౌరవంతోపాటు, అభినయాన్ని జోడించి పదరచన చేసి, పదమంటే శృంగార పదమన్న ప్రసిద్ధిని తెచ్చిన పదకవితా చక్రవర్తి క్షేత్రయ్య. ఆ వెనుక పేర్కొనదగ్గ వాగ్గేయకారుడు సారంగపాణి. పదరచన చేసి భజన గోష్ఠులకు భద్రత కూర్చిన మహానుభావులు భక్త రామదాసు, మునిపల్లె సుబ్రహ్మణ్య కవి. నాదోపాసనతో ముక్తి పొందిన మహా భక్తాగ్రేసరుడు త్యాగరాజస్వామి. రామదాసు కీర్తనలు, త్యాగరాజస్వామి కృతులు తెలుగు పద సాహిత్యానికి పుష్టిని తుష్టిని చేకూర్చిన సంగతి అందరికీ తెలిసిందే. ఇలాగే ఇంకా ఎందరో మహానుభావులు పదసాహిత్య సేవ చేసినవారు.

తెలుగులోని పదసాహిత్యంలో జరిగిన పరిశోధనా పద్ధతిని పరిశీలిద్దాం. తదితర సాహిత్య ప్రక్రియల్లోకంటే పద సాహిత్యంలో జరిగిన పరిశోధన తక్కువనే అంశం అందరూ అంగీకరించేదే. ఇంకా జరగవలసిందే ఎక్కువ. ఇప్పుడిప్పుడు పద కవితలపై మోజు పుట్టి విశ్వవిద్యాలయాల్లో పరిశోధన ప్రారంభమైంది. ఇది ముదావహమైన విషయం.

తెలుగు పదసాహిత్యానికి పట్టుగొమ్మ తాళ్ళపాక అన్నమాచార్యుడు (1408-1503). ఇతడు రచించిన పదాలు 32 వేలు. ఇవి ఆధ్యాత్మ పదాలు, శృంగార పదాలు అని రెండు విధాలు. వీటికానాడు సంకీర్తనలనియేవాడుక. అందుకే అన్నమాచార్యుడు సంకీర్తన రచన చేయడమేగాక, సంకీర్తన లక్షణాన్ని సైతం సంస్కృతంలో సవరించి ఉండడం విశేషం; ఇప్పుడిది అలభ్యం. అయినా అన్నమాచార్యుని మనుమడు చిన తిరుమలాచార్యుడు తెలుగులో పద్యాత్మకంగా అనువదించాడు. అందులోని పద నిర్వచనం ఇలా ఉంది.

"భరతాదులు గ్రంథంబుల
విరచించిన లక్షణములు వేంకట భూమీ
ధర వర కీర్తన లక్ష్యము
లురు పదకవితా పితామహుండేర్పఱచెన్"[10]

"పదమగు సుప్తి జ్ఞప్తము
పదమవయవ, మయ్యవియును బదమనబరగున్
దుదినీ తెలుంగులన్నియు
బదకవితా మార్గ సార్వభౌముడు దెలిపెన్"[11]

"పదములు శృంగార వధూ
మృదు మధుర మనోజ్ఞ వాక్యమిశ్రములైనన్
విదితార్థగ్రామ్యోక్తులు
పదిలముగా బొంకమెఱిఁగి పలుకగ జెల్లున్"

"పల్లవ నారీ మ్లేచ్ఛో
ద్యల్లాస మనోజ్ఞ బంధురోక్తులు చవియై,
చెల్లును గ్రామ్యములైనను
హల్లీసకముఖ్య నాటకాధిక ఫణితిన్"

"వైరాగ్య వృద్ధికర గం
భీర పదశ్రేణి వొసగవెనుపుచు నగ్రా
మ్యారమ్య విష్ణుచరితో
దారములై యున్న జాలు ధవళిన్వేలయున్"[12]

దీనానికొక్కటిగా 32 వేలు పదాలు శ్రీ వేంకటేశ్వర ముద్రతో అన్నమాచార్యుడు రచించాడు. అలాగే అతని పుత్రుడు పెద తిరుమలాచార్యుడు, మనుమడు చిన తిరుమలాచార్యుడు రచించారు. వెనుక వాటిని భద్రపరచడం కోసం రాగిరేకుల మీద చెక్కించడం పెద తిరుమలాచార్యుడే ఆరంభించాడు. తరువాత చిన తిరుమలాచార్యుడు ఆ పనిని పూర్తిచేసి సుమారు 1545 ప్రాంతంలో ముగించి సంకీర్తన భాండారాన్ని స్థాపించి ఉండవచ్చునని తెలుస్తుంది.[13] 1915 లోనే ఆంధ్రసాహిత్య పరిషత్తువారు కొన్నిటిని తమ పత్రికలో ప్రకటించారు. కానీ 1935నుంచి మాత్రమే వీటి ప్రకటన కార్యక్రమం ఆరంభమైంది. సంపుటం 1, తాళ్ళపాకవారి లఘు కృతులు, సం. 2, తాళ్ళపాకవారి అధ్యాత్మ సంకీర్తనలు, సం. 3, తాళ్ళపాకవారి శృంగార సంకీర్తనలు - ఈ మూడింటి పరిష్కర్తలు శ్రీ విజయ రాఘవాచార్యులు, జి. ఆదినారాయణ నాయుడుగారు, సం. 4 తాళ్ళపాకవారి శృంగార సంకీర్తనలు, సం. 5 తాళ్ళపాకవారి అధ్యాత్మ సంకీర్తనములు : వీటి పరిష్కర్తలు : శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు, వే. వి. శ్రీనివాసాచార్యులుగారు, సం. 12, 13, 14, 15, 18 అన్నమాచార్యుల శృంగార సంకీర్తనలు, సం. 16 చిన తిరుమలాచార్యుని శృంగారధ్యాత్మ సంకీర్తనలు - పరిష్కర్తలు : శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు వే. వి. శ్రీనివాసాచార్యులుగారు. సం. 13 అన్నమాచార్యుని శృంగార సంకీ

ర్తనలు, సం. 21 పెద తిరుమలాచార్యుల శృంగార సంకీర్తనలు - పరిష్కర్తలు : డా॥ పి. టి. జగన్నాధరావుగారు. సం. 19, 20, 22 అన్నమాచార్యుని శృంగార సంకీర్తనలు-పరిష్కర్తలు : శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు, శ్రీ గౌరి పెద్ది రామసుబ్బ శర్మగారు. ఆ తరువాత సం. 23, 24, 25, 26, 27, 28, 29, 30, 31 అన్నమాచార్య శృంగార సంకీర్తనలు-పరిష్కర్తలు : శ్రీ గౌరి పెద్ది రామ సుబ్బశర్మగారు. సం. 32 అన్నమాచార్య శృంగార సంకీర్తనలు - గౌరి పెద్దివారు పరిష్కరించి దివంగతులు కాగా, శ్రీ కామిశెట్టి శ్రీనివాసులు ప్రకటించారు. పూర్వమే ముద్రితమైన అన్నమాచార్యుని అధ్యాత్మ సంకీర్తనల్ని కలిపి సం. 1,2, 3 లుగా శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు పరిష్కరించి ప్రకటించారు. శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ (ఐ.ఎ.యస్) గారు తిరుమల తిరుపతి దేవస్థానం నిర్వహణాధి కారిగా ఉండగా అన్నమాచార్యుల కళాపీఠమనీ, అన్నమాచార్య ప్రాజెక్టు అనీ ప్రత్యేకంగా స్థాపించి, ప్రత్యేకాధికారులను నియమించి అన్నమాచార్య సంకీర్తనల ప్రచారానికి మిక్కిలి దోహదం చేశారు. 1981 మే నెలలో అన్నమాచార్యజయంతి సందర్భంగా అన్నమాచార్యుని సంకీర్తనలపై గోష్ఠులు, సదస్సులు ఏర్పాటుచేసి, పలువురు పండితులను సత్కరించడం జరిగింది. 1981 సం॥లో బ్రహ్మోత్సవాల్ని పురస్కరించుకొని విజయవాడ ఆకాశవాణివారు గోష్ఠి నిర్వహించి పండితులచే అనేక ప్రసంగాలు చేయించి ప్రసారం చేశారు వారంరోజులు. తిరుమల తిరుపతి దేవస్థానంవారు అన్నమాచార్యుని పదాల పరిష్కరణ కొనసాగింప చేస్తు న్నారు. అంతేగాక శ్రీ వేంకటేశ్వర, తెలుగు విశ్వ విద్యాలయాల్లో అన్నమాచార్య పీఠాలు నెలకొల్పబడ్డాయి. శ్రీ వేంకటేశ్వర, నాగార్జున, శ్రీకృష్ణదేవరాయ, హైద్రా బాద్, ఉస్మానియా, ఆంధ్ర, మద్రాసు విశ్వ విద్యాలయాల్లో అన్నమాచార్యుని సంకీ ర్తనలపై, వివిధ దృక్కోణాలనుంచి పరిశీలించి, పరిశోధనలుకొనసాగిస్తున్నారు. ఈ వ్యాసకర్తవి అనేక వ్యాసాలు పత్రికల్లో వచ్చాయి; అంతేగాక "అన్నమాచార్య, ప్రముఖ వాగ్గేయకారులు-తులనాత్మక అధ్యయనం" అనే అంశాన్ని వ్యక్తిగతమైన పరిశోధనగా గ్రహించి కొనసాగించి 1992లో గ్రంథరూపంలో ప్రకటించాడు. దీనికి 1993 సం॥కు గాను తెలుగు విశ్వ విద్యాలయం సాహితీ పురస్కారం లభించింది.

అంతకుముందే డా॥ వేటూరి ఆనందమూర్తిగారు అన్నమాచార్యుని సంకీర్తనలను పరిశోధించి తాళ్ళపాక కవుల కృతులు - వివిధ సాహితీ ప్రక్రియలు (ప్రథమ భాగము) 1974, తాళ్ళపాక కవుల పద కవితలు - భాషా ప్రయోగ విశేషాలు (ద్వితీయ భాగము) 1976 ప్రకటించారు. శ్రీమతి కె రామలక్ష్మి తాళ్ళపాక వారి పలుకుబడి రచించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పక్షాన ప్రకటించారు. డా॥ ముట్నూరి సంగమేశంగారు 'అన్నమాచార్య సాహితీ కౌముది' (1981) రచించారు. అన్నమాచార్య సంకీర్తనల్లో ముఖ్యమైన వాటిని గ్రహించి స్వరకల్పన చేసి (ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ పక్షాన) శ్రీ మంచాళ జగన్నాధరావు గారు ప్రకటించారు. డా॥ కె. సర్వోత్తమరావు అన్నమయ్య హనుమత్సంకీర్తనలు, అన్నమయ్య - త్యాగయ్య, అన్నమయ్య - శ్రీపాదరాయలు మొదలైన రచనలు చేయడమేగాక, ఆయన డా॥ సి. గోవిందరాజుతో కలిసి 'అన్నమయ్య వాఙ్మయ సూచిక' తయారుచేసినట్లు తెలుస్తుంది. డా॥ టి. శ్రీనివాసులు అన్నమయ్య సంకీర్తనల్లోని సంగీతంమీద పరిశోధించి పిహెచ్.డి. డిగ్రీ పుచ్చుకొన్నాడు. డా॥ మేడసాని మోహన్ అన్నమయ్య భాషమీద పరిశోధించి పిహెచ్.డి. డిగ్రీ పొందారు. ఆచార్య శాస్త్రి సూర్యనారాయణగారు అన్నమయ్య సంకీర్తనల్లోని భాషపై పరిశోధించి గ్రంథం ప్రకటించారు.

ఇంకా రాగిరేకులమీది పదాలను పరిష్కరించి ప్రకటించవలసిన పని ఎంతైనా ఉంది. ఆ పనిలో నిమగ్నులై సమర్థంగా నిర్వహించినవారు శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మగారు.

అన్నమాచార్యుని తరువాత పేర్కొనదగ్గ పదకవితాచక్రవర్తి క్షేత్రయ్య (1590-1675). ఇతడు సుమారు 4,500 పదాలు రచించినట్లు తెలుస్తోంది. ఇవన్నీ మువ్వ గోపాలాంకితాలు; శృంగార రసభూయిష్ఠాలు. వీటిలో సంగీత సాహిత్యాలకు సమప్రాధాన్యం చేకూర్చడమేగాక అభినయం జోడించడం విశేషం. పదాభినయం క్షేత్రయ్యతోనే ఆరంభమైంది. ముందులేదని కాదు. బహుళ ప్రచారం వచ్చింది క్షేత్రయ్యతోనే అని అర్థం. మొట్టమొదట క్షేత్రయ్యను పరిచయం చేసినవారు సుబ్బరామ దీక్షితులు, పరిశోధించి వివరించినవారు విస్సా అప్పారావుగారు. వీరు విపులమైన పీఠికతో 330 పదాలను ఆంధ్రగాన కళా పరిషత్, రాజమండ్రివారి పక్షాన మిక్కిలి పరిశ్రమించి 1950లో ప్రకటించారు. ఇందుకు తేవప్పెరుమాళ్ళయ్య

(1862) గారు, ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమూ (1864), వివేక చంద్రోదయ ముద్రాక్షర శాలా (1874), భువనగిరి రంగయ్యశెట్టిగారూ (1877), వావిళ్ళవారూ (1916), సంగీత సర్వార్థ సంగ్రహము (1917)- ప్రకటించిన గ్రంథాలు చక్కగా ఉపకరించాయి. ఇంకా మద్రాసు అడయారు పుస్తక భాండాగారంలోని తాళపత్ర గ్రంథాలు, తిరుపతి దేవస్థానం, ఆంధ్ర సాహిత్య పరిషత్, ప్రాచ్యలిఖిత భాండాగారం, తంజావూరులోని సరస్వతీ మహల్ పుస్తక భాండాగారం మొదలైన చోట్ల లభించిన వ్రాత ప్రతులూ విస్సావారికి ఉపకరించినట్లు తెలుస్తుంది. ఈవిధంగా 330 పదాలు సేకరించినట్లు, అందులో సుమారు 90 పదాలు నూతనంగా సంపాదించగలిగామనీ పేర్కొన్నారు.[14] కానీ 1886 లో మైలాపూరు 'మాణిక్య మొదలారి' మాణిక్య మొదలారి ముద్రాక్షర శాలలో ముద్రితమైన 'మువ్వగోపాల పదంబులని పేర్కొనబడుచున్న క్షేత్రయ్య పదంబులు'ను విస్సావారు చూసినట్లు లేదు ఇందులో 260 క్షేత్రయ్య పదాలతోపాటు 13 త్యాగరాజు కృతులు ఉన్నాయి. ఈ ప్రతిలోని ఏను క్షేత్రయ్య పదాలు విస్సావారి ప్రతిలో చేరనే లేదు. వావిళ్ళవారు 1916 లో 200 క్షేత్రయ్య పదాలు ముద్రించి, 1950 లో పునర్ముద్రించి శ్రీమాన్ కందాళై అప్పన్ కృష్ణమాచార్యులు, తిమ్మావజ్ఝల కోదండరామయ్యగార్ల పరిష్కరణతో పైవాటికి 118 పదాలు కలిపి 1951లో ప్రకటించారు. విస్సావారి ప్రతిలో లేని 0 పదాలు అదనంగా చేర్చినట్లు పరిష్కర్తల అభిప్రాయం. 1952 లో డా॥ గిడుగు వేంకట సీతాపతిగారు స్వీయ, పరకీయ, సామాన్య నాయికా విభజనచేసి పదాలకు కొంత ఉపోద్ఘాతం రచించి 380 క్షేత్రయ్య పదాలు ప్రకటించడం విశేషం. శ్రీ శ్రీనివాస చక్రవర్తిగారు 1966లో శీర్షికలతో 100 పదాలను కూర్చి జయంతి ప్రచురణలు, విజయవాడవారు ప్రకటించారు.

1954 లో టి. వి. సుబ్బారావుగారి సంపాదకత్వంలో శ్రీ మంచాళ జగన్నాథరావుగారు స్వరాలు కూర్చగా 78 క్షేత్రయ్య పదాలను రాజమండ్రి ఆంధ్ర గాన కళాపరిషత్తు పక్షాన శ్రీ విస్సావారు ప్రకటించారు. 1968 లో నిర్మలా పబ్లిషర్సువారు బి. కుమారస్వామిగారు స్వరాలు కూర్చగా 20 క్షేత్రయ్య పదాలు ప్రకటించారు. ఇంతకంటే ముఖ్యంగా 140 పదాలకు శ్రీ మంచాళవారు స్వరాలు కూర్చగా 1973 లో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారు ప్రకటించడం విశేషం.

ఎందరో క్షేత్రయ్య పదాలను అభినయిస్తూ వుంటారు. కూచిపూడి నృత్యంలో క్షేత్రయ్య పదాభినయం ఒక భాగం. అభినయంలో ఆచార్యులైన శ్రీ నటరాజు రామకృష్ణగారు పరిశోధించి క్షేత్రయ్య పదాభినయం గ్రంథం ప్రకటించారు.

పూర్వోక్తమైనట్లు క్షేత్రయ్యను పరిచయం చేసినవారు సుబ్బరామ దీక్షితులు. ఆచార్య పి. సాంబమూర్తిగారు తమ 'ఇండియన్ మ్యూజిక్ సీరీస్'లో క్షేత్రయ్యను సందర్భోచితంగా ప్రస్తావించారు. క్షేత్రయ్యను గూర్చి పరిశోధించి వివరించినవారు విస్సావారు. తమ గ్రంథాల్లో ప్రస్తావించినవారు చాగంటి శేషయ్య, బాలాంత్రపు రజనీకాంతారావు, ఆరుద్రగార్లు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమివారు ఉపన్యాసాల సంపుటిని ప్రకటించారు. ప్రకటిత వ్యాసాల్లో విలువైంది శ్రీ రాళ్ళపల్లివారిది. ఈ రచయిత 1972-73 లో సమగ్రమైన చక్కటి విమర్శనాత్మక గ్రంథం "క్షేత్రయ్య పద సాహిత్యం" రచించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి అవార్డును అందుకొన్నారు. ఈ మధ్యనే శ్రీ బాలాంత్రపు రజనీ కాంతారావుగారు క్షేత్రయ్య అనే ఆంగ్ల గ్రంథం రచించారు.

భద్రాచల రామదాసు (1620-1680) కీర్తనలు పల్లెపట్టులలోని భజన కూటములలో, రామ మందిరాల్లో మనకు వినిపిస్తూ ఉంటాయి. వీటిలో కొన్నింటికి మాత్రం శ్రీ మంచాళ జగన్నాధరావుగారు స్వరాలు కూర్చగా ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వారు ప్రకటించారు. గుణిలీప్రతులలో రామదాసు కీర్తనలు కని పిస్తాయి. కానీ తత్సంబంధి పరిశోధన జరగనే లేదు.

క్షేత్రయ్యకు ముందూ, సమకాలికంగా, వెనుకా పదకవితలు కోకొల్లలు వెలి శాయి. పద కవితలకు పట్టుగొమ్మలైన యక్షగానాలు నాయక రాజుల కాలంలో అనేకం రచితమయ్యాయి. యక్షగానాల మీద ఆచార్య యస్వీ జోగారావుగారు పరి శోధించి 'ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర'ను ప్రకటించారు. విజయరాఘవ నాయకుడు, అతని ఆస్థాన కవయిత్రి రంగాజమ్మ చక్కటి యక్షగాన కర్తలు, పద కర్తలూను. అతని ఆస్థాన కవులలో కామరసు వేంకటపతి సోమయాజి, పురు షోత్తమ దీక్షితుడు, కోనేటి దీక్షితచంద్రుడు, పెద్దదాసు మొదలైన వారనేకులు ఈ పదకవిత అల్లినవారే.

పోతులూరి వీరబ్రహ్మంగారు, అతని శిష్యుడు దూదేకుల సిద్దయ్యలతత్త్వాలు అనేకం. శ్రీ రాళ్ళపల్లివారు 'వేమన' ఉపన్యాసాల సంపుటిలోను, శ్రీ బాలాంత్రపు

రజనీ కాంతరావుగారు తమ ఆంధ్ర వాగ్గేయకార చరిత్రలోను, డా॥ ఎన్. గోపి వేమనమీద సిద్ధాంత గ్రంథంలోను వీరబ్రహ్మంగారిని గూర్చి వ్రాసిన పేరాక డాక్టర్ కన్నెగంటి రాజమల్లాచారి సిద్ధాంతవ్యాసం పోతులూరి వీరబ్రహ్మంగారి జీవితం, రచనల పరిశీలన, డాక్టర్ వి.వి.ఎల్. నరసింహారావుగారి ఆంగ్లగ్రంథం "Swamy Sri Veera Bramhendra" వెలువడ్డాయి.

పదకర్తల్లో క్షేత్రయ్య తరువాత పేర్కొనదగ్గవాడు సారంగపాణి (1680-1750). చిత్తూరు మండలంలో వెలసిన కార్వేటి నగరం ఆస్థాన వాగ్గేయకారుడు. సారంగపాణి పదాలు మొదట కార్వేటి నగరం భారతీ లీలా సదన ముద్రాక్షరశాలలో 19 శ. ఆరంభంలో ముద్రితం; 1867లో చెన్నపురి విద్యా విలాస ముద్రాక్షరశాలలో ప్రకటితం. 1878 లో భువనగిరి రంగయ్యశెట్టిగారి జ్ఞాన సూర్యోదయ ముద్రాక్షర శాలలో ముద్రితం 1963 లో రాజమహేంద్రవరం సరస్వతీ పవర్ ప్రెస్‌లో శ్రీ పురిపండా అప్పలస్వామిగారి సంపాదకత్వంలో ప్రకటించబడ్డాయి. కానీ సారంగపాణి పదాల గూర్చిన కొన్ని వ్యాసాలుతప్ప పరిశోధన జరగలేదు. అయితే ఈ రచయిత సారంగపాణి జీవితమూ, పదాలకు సంబంధించిన అనేకాంశాలను పరిశోధించి 'సారంగపాణి పద సాహిత్యం' అనేగ్రంథం తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయంతో 1980లో ప్రకటించాడు. దేవస్థానంవారి ఆర్థిక సహాయం తోనే డా. మంగళగిరి ప్రమీలాదేవి, డా. టి.ఎస్. మురళీకృష్ణమ్మగార్లు చేసిన యీ గ్రంథానికి హిందీ అనువాదం ముద్రితం. 'సారంగపాణి పదములు' డా. జి. చలపతి ఈ మధ్యనే ప్రకటించారు.

తెలుగు పదకర్తలలో అజ్ఞాతులు అనేకులు. తెలియవచ్చినవారిలో ఘనం శీనయ్య, మేలట్టూరు కాశీనాథయ్య, ఆది అప్పయ్య, వీణ పెరుమాళ్ళయ్య, మాతృభూతయ్య, ఇనుపసెనగల వెంకట్రామయ్య, పల్లవి గోపాలయ్య, దొర సామయ్య, సభాపతయ్య మొదలైన వారెందరో! వారందరిని గూర్చి విస్తృతమైన పరిశోధన జరుగవలసి ఉంది. ఈనాటి వాగ్గేయకారుల్లో చెప్పుకోదగ్గవారిలో శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణగారు ముఖ్యులు.

అధ్యాత్మ రామాయణ సంకీర్తనలతో తెలుగువారి హృదయాలనుచూరగొన్న మునిపల్లె సుబ్రహ్మణ్య కవి (1730-1780) ఎన్నో పదాలు రచించాడు. ఇతనిచ్చి

జరగవలసిన పరిశోధన ఎంతైనా ఉంది. ఉన్నంతలో కుమారి డా. ప్రమీలాదేవి 'భారతీ కళాతరంగిణి'లోని వ్యాసం పేర్కొనదగ్గది.

త్యాగరాజస్వామి (1767-1847) నాదోపాసనలో ముక్తి పొందిన మహా వాగ్గేయకారసత్తముడు. శ్యామశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితులు, త్యాగరాజస్వామివార లను కర్ణాటక వాగ్గేయకారత్రయ మంటారు. అందులో సుప్రసిద్ధుడు త్యాగరాజ స్వామి. ధాతుమాతువుల్లో ధాతుకల్పనా దక్షుడితడు. అయినా అన్నమాచార్యుని కాలంలో సంకీర్తనగాను, క్షేత్రయ్య నాడు శృంగారం పదంగాను, రామదాసు, ముని పల్లె సుబ్రహ్మణ్య కవి అనే వాగ్గేయకారులలో కీర్తనగాను ప్రసిద్ధికెక్కి, పరిణతి గాంచి, త్యాగరాజస్వామి కాలంలో కృతిగా రూపొందింది. మాతువిరహితంగా ధాతువు ప్రధానమై ఉండటానికి వీలు లేకపోలేదు గాని దానికంత ప్రాముఖ్య మివ్వరు సంగీతజ్ఞులు. కాబట్టి త్యాగరాజస్వామి కృతులు రచించి సంగీతానికి అమిత మైన సేవ చేసినా, సాహిత్యకారుల్లోను ఆయనకు ఒక ప్రత్యేక స్థానముంది. త్యాగరాజ కృతులకు త్యాగబ్రహ్మోపనిషత్తు అనే ప్రసిద్ధి కలిగింది. ఈయన 2,400 కృతులు రచించగా 600 మాత్రమే స్వర సాహిత్యాలతో ఈనాడు ప్రచా రంలో ఉన్నాయి. 72 మేళకర్త రాగాలలోను కృతులు రచించాడు. ఇతని ఘన రాగ పంచరత్న కీర్తనలు ప్రసిద్ధమే. ఇంతేగాక ప్రహ్లాద భక్త విజయమూ, నౌకా చరిత్రమూ, సీతారామ విజయమూ అనే మూడు సంగీత రూపకాలను రచించాడు. వీటిని ప్రబంధాలని అంటారు. ఈ మహా వాగ్గేయకారసత్తమునిపై జరగవలసినంత పరిశోధన జరగలేదు. విస్సా అప్పారావుగారి సంపాదకత్వంలో కల్లూరి వీరభద్ర రావుగారు పరిష్కరించగా రాజమండ్రి ఆంధ్ర గాన కళాపరిషత్తు పక్షాన త్యాగరాజ కీర్తనలు 1948లో ప్రకటితమయ్యాయి. తరువాత వీరి సంపాదకత్వంలో 1975లో మొదటి సంపుటమూ 1978లో రెండో సంపుటమూ వచ్చాయి. టి. వి. సుబ్బారావు గారి సంపాదకత్వంలో 1951లో స్వర సహితంగా కొన్ని త్యాగరాజ కృతులు ముద్రించబడ్డాయి. బందరులో శ్రీ భావరాజు నరసింహారావుగారు సంకలనం చేసి 1981లో మూడు సంపుటాలుగా త్యాగరాజ కృతులను ప్రకటించారు. 1979 లో తిరుపతి అనంత పద్మనాభరావుగారు సద్గురు త్యాగరాజు అన్నదీ, 1981 లో తిరు మూరు సుధాకరరెడ్డి నాదయోగి త్యాగయ్య అనే పేరుతోనూ, డా॥ కె. పురుషోత్త మన్ త్యాగయ్య అనే చిన్న పుస్తకాన్ని రచించారు. కానీ వీటన్నిటిలోను శ్రీ కె. వి. పురుషోత్తమన్‌గారు ఆంగ్లంలో ప్రకటించిన "త్యాగోపనిషత్తు" ఉత్తమ

గ్రంథం. త్యాగరాజస్వామి హృదయావిష్కరణ గావించిన గ్రంథం పరిశోధ నాత్మకమైంది మద్రాసు విశ్వవిద్యాలయంనుంచి డా॥ ఎస్. శమంతకమణిగారు - "త్యాగరాజు కవిత్వము - విమర్శనాత్మక పరిశీలనము" అనే సిద్ధాంత వ్యాసం ప్రకటించారు.

పద సాహిత్యాన్ని గురించి చెప్పేటప్పుడు ప్రాత స్మరణీయుడు సుబ్బరామ దీక్షితులు. ఆయన రచించిన సంగీత సంప్రదాయ ప్రదర్శిని (1904) రెండు సంపుటాలుగా ప్రకటితం. అందులో ఆంధ్ర వాగ్గేయకారుల చరిత్ర ఉంది. తరువాత పేర్కొనదగ్గ ముఖ్య గ్రంథం శ్రీ బాలాంత్రపు రజనీకాంతారావుగారి 'ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము'; ఇది మద్రాసు ఆంధ్ర భాషా సంఘంవారి బహుమతికి నోచుకొన్న పరిశోధనాత్మక గ్రంథం. డా॥ మంగళగిరి ప్రమీలాదేవి తెలుగు వాగ్గేయకారుల గూర్చి అనేక వ్యాసాలు పలు పత్రికల్లో ప్రకటించడమేగాక, భారతీ కళా తరంగిణి (1981) అనే పేరుతో పుస్తకం సైతం ప్రకటించారు. ఆంధ్ర సారస్వత పరిషత్తువారు 'తెలుగులో పదకవిత'ను ప్రకటించారు. 1980-81 సంవత్సరానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డుకు నోచుకొన్నది ఈ వ్యాసకర్త కృతమైన 'తెలుగులో పదకవిత'. 'తెలుగు వాగ్గేయకారులు' అనే ఈ రచయిత రచన ప్రకటించబడింది. త్వరలో ఈ రచయిత 'పదసాహిత్య పరిమళం' గ్రంథం రాబోతూంది. కళాప్రపూర్ణ ఉటుకూరి లక్ష్మీకాంతమ్మగారు "ఆంధ్రుల కీర్తన వాఙ్మయ కళాసేవ" గ్రంథం ప్రకటించారు. డా॥ లీలావతమ్మ 'అన్నమయ్య పద కవితా పై జయంతి' అనే వ్యాస సంపుటిని ప్రకటించింది.

పద సాహిత్యంలో ప్రప్రథములైన అన్నమాచార్యుని సంకీర్తనలు ఈనాడు అన్ని విశ్వ విద్యాలయాలోన్ని ఆచార్యుల్ని, అధ్యాపకుల్ని, పరిశోధక విద్యార్థుల్ని ఆకర్షించాయి. ఈ విషయం సైతం పూర్వోక్తం. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో డా॥ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి పర్యవేక్షణలో తాళ్ళపాక కవులమీద పరిశోధన జరిగింది. శ్రీ సత్యసాయి మహిళా కళాశాల ప్రిన్సిపాల్ డా॥ జె. హేమలత పర్యవేక్షణలో పెద్ద తిరుమలాచార్యుని పదాలపై పరిశోధన జరిగింది. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో డా॥ కె.సర్వోత్తమరావు పర్యవేక్షణలో అన్నమాచార్య సంకీర్తనల్లోని అలంకారాలు, జానపద రీతులు మొదలైన అంశాలపై పరిశోధన జరిగింది. శ్రీకృష్ణదేవరాయ విశ్వ విద్యాలయంలో డా॥ తుమ్మపూడి కోటే

శ్వరరావుగారి పర్యవేక్షణలో అన్నమాచార్య శృంగార సంకీర్తనలమీదా, ఆధ్యాత్మ సంకీర్తనలమీదా పరిశోధన జరిగింది. నాగార్జున విశ్వ విద్యాలయంలో ఈ రచయిత పర్యవేక్షణలో అన్నమాచార్య సంకీర్తనలలోని వర్ణనలు, (డా॥ గుమ్మా సాంబశివ రావు), అన్నమాచార్య సంకీర్తనలు-జానపద గేయ సంగీత ఛందోరీతులు (డా॥ మంగళగిరి ప్రమీలాదేవి) పరిశోధించి పిహెచ్.డి. పట్టాలు పొందారు. డా॥ సాంబ శివరావు సిద్ధాంత వ్యాసం ప్రకటితం. డా॥ ప్రమీలాదేవి త్వరలో ప్రకటించ బోతూంది. ఈ వ్యాసకర్త అనేక ప్రముఖ పత్రికల్లో అన్నమాచార్య సంకీర్తనలపై పలు వ్యాసాలు ప్రకటించడమే గాక, 1983లో ప్రారంభించిన "అన్నమాచార్య, ప్రముఖ వాగ్గేయకారులు - తులనాత్మక అధ్యయనం" అంశంపై వ్యక్తిగత పరిశో ధన కొనసాగించి 1992లో గ్రంథరూపంలో ప్రకటించాడు. దానికి 1993 సం॥కు గాను తెలుగు విశ్వ విద్యాలయం సాహితీ పురస్కారం లభించింది. ఆ పరిశోధన లోని ఒక భాగమైన 'అన్నమాచార్య సంకీర్తన సుధ' ముద్రణలో ఉంది. 'అన్న మాచార్య సంస్కృత సంకీర్తనలు, జయదేవుని గీత గోవిందం; తులనాత్మక అధ్య యనం' అనే అంశంపై పరిశోధన పూర్తి కావచ్చింది; గ్రంథరూపంలో త్వరలో రాబోతుంది. ఇంతకుముందే 'పదకవితా పితామహుడు' అనేనాటకం అన్నమాచార్య జీవిత చరిత్ర నాధారంగా ఈ రచయిత ప్రకటించాడు. ఈ విధంగా ఈ రచయిత పదసాహిత్యానికి సంబంధించి పరిశోధన రంగంలో విశేష కృషిచేసి అనేక రచనలు ప్రకటించడంద్వారా పదసాహిత్య పక్షపాతాన్ని ప్రకటించుకొన్నాడు.[15]

ఇలాగే ఇంకా ఎందరో పద సాహిత్యంపై పరిశోధన చేస్తూ ఉండవచ్చు. అయినా ఈ రచయిత విన్నంత, కన్నంత, తెలియవచ్చినంత వివరించడం జరి గింది; అలాంటి మహానుభావులు ఎవరైనా విస్మరించబడి ఉంటే తెలిపితే సరిదిద్దుకో గలడు. పద సాహిత్యంమీద మమకారంతో కృషిచేసి అందులోని నిజమైన కవితని భాషలోని సొగసును, నుడికారాన్ని, పలుకుబడిని స్పష్టంచేసి, అదే ప్రజాకవిత అని భావి పరిశోధకులు నిరూపిస్తారని ఈ రచయిత నికార్సయిన ఆకాంక్ష!

సూచికలు :

- పండితారాధ్య చరిత్ర : పు. 18-20 : పరిష్కర్త డా॥ చిలుకూరి నారాయణ రావు-1939.
- 2. బసవ పురాణము : పరిష్కర్త : బండారు తమ్మయ్య-1952
- 3. వేటూరి ప్రభాకరశాస్త్రి : సింహావలోకనము-పు. 42
- R. G. Moulton : Methods and Materials of Literary Criticism P. 13, 14.
- : The Modern Study of Litereture : An Introduction to Literary Theory and Interpretation-P. 605.
- రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ : క్షేత్రయ్య పద కవిత్వము : సాహిత్యోపన్యాసములు-3, క్షేత్రయ్య పదసాహిత్యము - పు. 12, 13.
- పండితారాధ్య చరిత్ర : పు. 513.
- కుమార సంభవము : 4-89, 6-45
- శ్రీపాద గోపాలకృష్ణమూర్తి : దేశి సారస్వత విభూతి-కిన్నెర (డిశెంబర్ - 1953). పు. 557.
- శ్రీ చిన తిరుమలాచార్యుడు : సంకీర్తన లక్షణము : Vol. I. The Minor works of Tallapakam poets : Ed. by V. Vijaya Raghavacharya and Audinarayana Naidu-1935. పద్యాలు : 13, 24, 56, 58, 59.
- 12. పైదే.
- డా॥ వేటూరి ఆనందమూర్తి : తాళ్ళపాక పద కవితలు-భాషా ప్రయోగ విశేషాలు (ద్వితీయ భాగము), పు. 56, 57.
- విస్సా అప్పారావుగారు : క్షేత్రయ్య పదములు, పు. 9.
- పదసాహిత్య పరిశోధన, గ్రంథ ప్రకటనలో విశేష కృషిచేసిన ఈ రచయితను అక్టోబర్ 1994 తెలుగు విద్యార్థి సంచికలో ప్రకటించిన 'అన్నమయ్యపై జరిగిన పరిశోధన-జరగవలసిన పరిశీలన' అనే వ్యాసంలో డా॥ సి. గోవిందరాజు విస్మరించడం శోచనీయం.

# అన్నమాచార్య సంకీర్తన కవిత

తెలుగు సాహిత్యంలో పదకవితకు గౌరవం సంపాదించిన ఘనత తాళ్ళపాక అన్నమాచార్యునికి దక్కింది. అంతకంటె పూర్వం ఈ పదసాహిత్యం ఉన్నప్పటికీ, దీనికొక విశిష్టత చేకూరింది అన్నమాచార్యుని కాలమందే అని చెప్పడం సముచితం.

## 1.1 అన్నమాచార్యుడు

తెలుగు పదకవితకు 15వ శతాబ్దం వసంతకాలం. ఆనాడు వేనకు వేలు పదాలు రచింపబడ్డాయి. తెలుగు పదకవితలకు ఆద్యుడు, అనవద్యుడు అన్నమాచార్యుడు. పదకవితాపితామహ బిరుదాంకితుడు. ఇతడు 1424లో జన్మించి 1503న దివ్యధామం పొందినట్లు తెలుస్తుంది.[1] కాని ఇతని జననం 1408 అనడమే సమంజసము. కడపవద్దగల తాళ్ళపాక ఇతని స్వగ్రామం. తిరుమలలో వెలసిన వేంకటేశ్వరునిమీద భక్తితో అనేక పదాలు చెప్పి ఆడి పాడి ముక్తి పొందినవాడు అన్నమయ్య. ఇతని పదకవిత తెలుగు తల్లికి మణిభూషణ నికరం. ఇతడు రచించిన సంకీర్తనలు 32000. ఇందులో ఉప లభ్యమైనవి 15000. అన్నమాచార్యుని కుమారుడు పెద తిరుమలాచార్యుడు, మనుమడు చిన తిరుమలాచార్యుడు వాటిని రాగిరేకులమీద వ్రాయించి భద్రపరచడం విశేషం. ఇవి అధ్యాత్మ సంకీర్తనలనీ, శృంగార సంకీర్తనలనీ రెండు విధాలు. ఇవి వేంకటేశ్వరునకు అంకితాలు. సంకీర్తనల్ని పదాలు అనికూడా అంటారు.

అన్నమాచార్యునికి గల పద కవితా పితామహుడు, సంకీర్తనాచార్యుడు అనే బిరుదులు అక్షరాల సార్థకం. జయదేవుని గీత గోవిందమూ, ఇటు ఆళ్వారుల పాశురాల మహిమా, మరొకప్రక్క 'దాసర కూటముల' మహిమాన్విత వైశిష్ట్యమూ, ఇంకోప్రక్క తెలుగులోని కృష్ణమాచార్యులు మొదలైనవారి సంకీర్తనలూ అన్నమయ్య పదరచన కుపకరించాయి. "తాను స్మార్త బ్రాహ్మణుడైనను, విశిష్టాద్వైత మత సామర్థ్యమునకు, నర్చనావతార వైభవమునకు, శరణాగతి మాధుర్యమునకు శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యమునకు లోబడి యహోబిల మఠాధీశ్వరుడైన ఆదివణ్

శఠకోపయతి శిష్యుడై, వైష్ణవ మతమును స్వీకరించినాడు. పరాంకుశయతి ప్రభృతులు ద్రవిడ వేదాంతమును వెలయించినట్లుగా నాళ్వార్ల సంప్రదాయమును చక్కగా ననువర్తించి యుపనిషదర్థ ప్రతిపాదనములతో స్వానుభవ నివేదనములతో సరసవనిభాషతో, సరస సంగీత కళావిలాసములతో, సర్వసులభముగా సంకీర్తనాత్మకముగా నాంధ్ర వేదాంతము నవతరింపజేసినాడు."[2] ఆళ్వారుల దివ్య ప్రబంధములలో 4000 పదాలుండగా, అన్నమాచార్యుదొక్కడే రచించిన ఆంధ్రవేదంలో 32,000 పదాలున్నాయి[3] "తెలుగు కన్నడ వాఙ్మయములలో 15 వ శతాబ్దిలో ఈ పదరచన విస్తారముగా సాగినది. తెలుగులో ఇప్పటికి మనకు తెలిసినంతలో తాళ్ళపాక అన్నమాచార్యులు ప్రాచీన పదకవి కదా! అతని కాలమందే అతడున్న సాళ్వ నరసింహరాయని ఆస్థానమందే ఉన్న శ్రీపాద రాయస్వామి కన్నడ పదకర్తలలో ఇప్పటికీ ప్రాచీనుడు. ఆయన శిష్యుడు శ్రీ వ్యాసరాయస్వామి. అతని శిష్యుడు శ్రీ పురందర విట్ఠలుడు. శ్రీపాదరాయలది వైష్ణవ పరంపర."[4] "అన్నమయ్య చిన్ననాటినుండి ఆడిన మాటెల్ల నమృత వాక్యముగ, పాడిన పాటెల్ల పరమ గానముగ నమరినవాడట! ఈ యుత్ప్రేక్ష ఎట్లున్నను శ్రీపాదరాయల పదముల రచనోత్సాహమును కల్పించి యుండుకు"[5] అనే రాళ్ళపల్లి, పుట్టపర్తివారల మాటలు ఆళ్వారుల ప్రభావంతో పాటు 'దాసర కూటముల' ప్రభావం అన్నమయ్యపై కలదని నిరూపిస్తున్నాయి. ఇంతేగాక అన్నమయ్యను పురందరదాసు తిరుపతిలో దర్శించినట్లు తెలియవస్తుంది.[6] "అన్నమాచార్యుని వార్ధక్యమున పురందరదాసులవారు చాల చిన్నవారై దర్శించి యుందురు."[7] కాని కర్ణాటక హరిదాస సాహిత్యమును గూర్చి వ్రాసిన ఆర్.ఎస్. పంచముఖిగారు అన్నమయ్య పురందరుల సమాగమాన్ని సందేహించారనీ, అది సముచితం కాదని డాక్టర్ వేటూరి ఆనందమూర్తిగారు వక్కాణించారు.[8] అన్నమయ్య మనుమడు చిన్నన్న చెప్పాడు గనుక ఇందు అనుమానానికి తావులేదు.[9] ఇట్లు మహా భక్తాగ్రేసరుడై పద కవితకు పట్టంగట్టి తెలుగున పదకవితా పితామహుడై ప్రసిద్ధి పొందిన మహానుభావుడు అన్నమయ్య.

## 2.0 అన్నమాచార్యుని సంకీర్తనలు

తెలుగు సాహిత్య మాగాణంలో శిష్టేతర కవితా ప్రవాహం మూడు పాయలుగా ప్రవహిస్తుంది. మొదటిది కేవలం జానపద కవిత. దాని పుట్టుక అనాది. లిఖితం కాలేదు, రెండోది పాల్కురికి సోమనాథునితో ప్రారంభమైన ద్విపదకవిత,

మూడోది అన్నమయ్యతో ఆరంభమయిన సంకీర్తన కవిత. అన్నమయ్య భక్తి పరవశుడై ఆడిపాడిన పదాలే ఆధ్యాత్మ శృంగార సంకీర్తనలు. ఇందులో అన్నమయ్య ధాతు మాతువులకు అంటే సంగీత సాహిత్యాలలో సాహిత్యానికి ప్రాధాన్యం ఇచ్చినట్లు స్పష్టం. పైగా అన్నమయ్య ఈ పదరచనలో చాలవరకు జానపద గేయాలలోని పదరీతులను గ్రహించి వుండడం ఒక విశేషం. అన్నమయ్యకు పూర్వం వాడుకలోనున్న జాజరలు, చందమామ పదాలు, తుమ్మెద పదాలు, లాలలు జోలలు, తందనాలు మొదలగునవి ఆయన రచనలలో ఉన్నాయి. ఇంతేగాక మేలు కొలుపులు, ఉయ్యాల పాటలు, సువ్వి పాటలు, కూగూగు పాటలు మొదలైన పాటలు కూడ ఆయన రచనలలో కన్పిస్తాయి,

## 2.1 సంకీర్తన కవితా వైభవం:

అన్నమయ్య తన పదరచనలో సంగీత సాహిత్యాలలో సాహిత్యానికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చాడన్న విషయం విద్వద్వరేణ్యులు ఎరిగినదే. అందుకే ఏ పదం గ్రహించినా అన్నమయ్య పదరచనా వైభవం మనకు గోచరిస్తుంది. రసభావాలకు రాగతాళాలకు సముచిత రీతిని చక్కటి పదప్రయోగం చేసి, సహృదయ హృదయాలను అలరించడానికి రచితమైన అలుమేలుమంగ దివ్య లాస్యాన్ని ఎంతో అద్భుతంగా అన్నమయ్య రచించాడు.

అలరుల గురియగ-నాడెనదే
అలకల గులుకుల-నలమేలుమంగ ॥అలరు॥

అరవిరి సొబగుల-నతివలు మెచ్చగ
అరతెర మరుగున-నాడెనదే
వరుస పూర్వదు-వాళపు తిరుపుల
హరిగరగింపుచు-నలమేలుమంగ 1॥అలరు॥

మట్టపు మలపుల-మట్టెల కెలపుల
తట్టెడి నడపుల-దాటెనదే
పెట్టిన వజ్రపు-పెండెపు దళుకులు
అట్టిటు చిమ్ముచు-నలమేలుమంగ ॥అలరు॥

చిందుల పాటల-సిరిపొలయాటల
అందెల మ్రోతల-నాడెనదే
కందువ తిరువెం-కటపతి మెచ్చగ
అందపు తిరుపుల-నలమేలుమంగ ॥అలరు॥

(X11-24)

ఇందులో అలుమేలుమంగ చేసిన లాస్యం క్రమ పరిణతిలో వర్ణితం అల కల కులుకులతో, అలరులు కురిసేట్లు అలుమేలుమంగ ఆడినదట. ఇది పల్లవిలో ఎత్తుకున్న విషయం. ఈ విషయాన్ని క్రమవికాసంతో చరణాల్లో విస్తరింపచేశాడు అన్నమయ్య. శ్రీ వేంకటేశ్వరుడు కరిగిపోయేట్లుగా, అతివలు మెచ్చుకొనేట్లుగా అరవిచ్చిన పూల సొబగులతో అరతెర మరుగున ఆడింది అలమేలు మంగమ్మ. ఇది మొదటి చరణంలోని విషయం. తాను ధరించిన 'వజ్రపు పెండెపు తలుకులు అట్టిటు' ప్రసరింపజేస్తూ మట్టెల మ్రోతలతో, తట్టెడి నడకలతో ఆడిన సంగతి రెండో చరణంలో స్పష్టం. చివరి చరణంలో శ్రీ వేంకటేశ్వరుడు మెచ్చేట్లుగా చిందుల పాటలతో సిరిపొల యాటలతో, అందెల మోతలతో అందంగా ఆనందంగా ఆడింది అలమేలుమంగ అని వివరించాడు. ఇందులో ఎలాంటి దూరాన్వయం కాని, అర్థ కాఠిన్యంకాని లేనిరీతిలో ఎంతో సొగసుగా, రసభావ వ్యంజకంగా సరళమైన భాషలో రచించి తరించాడు అన్నమయ్య. ఇందుకు సహృదయ హృదయాలే సాక్షి. పూర్వోక్తమయినట్లు అన్నమయ్య పాటల్లో జానపద గేయాల్లోని అనేక రీతులు ఉన్నవని స్పష్టమవుతుంది. ఆ రీతుల్లో ఒకటైన 'చాంగు భళా' అనే ఈ క్రింది పాటను పాడి రాగంలో, ఆదితాళంలో అన్నమయ్య మనోహరంగా రచించాడు.

చక్కని తల్లికి-చాంగు భళా తన
చక్కెర మోవికి-చాంగుభళా ॥చక్కని॥
కులికెడి మురిపెపు-కుమ్మరింపు తన
సళుపు జూపులకు-చాంగు భళా
పలుకుల సొలపుల-బతితో గసరెడి
చలముల యలుకకు-చాంగుభళా ॥చక్కని॥

కిన్నెరతో పతి-కెలననిలుచు తన
చన్నుమెఱుగులకు-చాంగుభళా

ఉన్నతి బతిపై-నొరగి నిలుచు తన
సన్నపు నడిమికి-చాంగుభళా ॥చక్క-ని॥

జందెపు ముత్యపు-సరుల హారముల
చందన గంధికి-చాంగుభళా
విందయి వేంకట-విభుబెనచిన తన
సందిదండలకు-చాంగుభళా ॥చక్క-ని॥

(X11-107)

ఇందులోకూడా అలుమేలుమంగా సౌందర్యంతోపాటు పలుకులు, చూపులు, చేష్టలు అనన్య సాధారణంగా వర్ణించి తగించాడు అన్నమయ్య. ప్రతి పదం సార్థక మయి ఇందు ప్రయుక్తమయి రస గ్రహణ పారీణులందరికీ కవిత్వపు విందు చేస్తున్నాయి.

'ఉన్నతి బతిపై నొరగి నిలుచుతన
సన్నపు నడిమికి-చాంగుభళా'

అని చెప్పడంలో ఉన్నతుడైన శ్రీ వేంకటేశ్వరునికి తగిన రీతిలో సన్నపు నడుము సౌందర్యంతో అలుమేలుమంగ ఆనందాన్ని కూర్చింది. ఈ మాటలు సార్థకాలై ఒప్పుతున్నాయి. ఇలాగ మనోజ్ఞ పదరచనకు ఎన్ని పదాలైన ఉదాహర ణగా చూపవచ్చు.

## 2.2 ఉక్తి చమత్కృతి :

అన్నమయ్య పదకవితలో ఉక్తి చమత్కృతికూడ మనోజ్ఞమై మహదానం దాన్ని చేకూరుస్తుంది. నాయిక అయిన పద్మావతీదేవిని చెలికత్తెలు పరాచికాలు ఆడడం ఈ క్రింది పదంలోని ఇతివృత్తం. ఆ మాటల్లో చమత్కారం రసనిష్యంది అయి ఆనందాపాదిమై ఉండడం స్పష్టమవుతుంది.

ఏమొకొ చిగురుటధరమున-యెడనెడ గస్తురినిండెను
భామిని విభునకు వ్రాసిన-పత్రిక కాదుగదా ॥ఏమొకొ॥

కలికి చకోరాక్షికి గడ-కన్నులు కెంపైతోచిన
ఛెలువం బిప్పుడిదేమో-చింతింపరె చెలులు

నలువున బ్రాపేళ్వరుపై-నాటిన యాకొన చూపులు
నిలువున బెరుగకగనంటిన-నెత్తురు కాదుగదా ॥ఏమొకొ॥

పదతికి చనుగవ మెఱుగులు-పైపై పయ్యెద వెలుపల
కదుమించిన విధమేమో-కనుగొనరే చెలులు
ఉడుగని వేడుకతో-ప్రియుడొత్తిన నఖశశిరేఖలు
వెడలగ వేసవికాలపు-వెన్నెల కాదుగదా ॥ఏమొకొ॥

ముద్దియ చెక్కుల కెలకుల-ముత్యపు జల్లుల చేర్పులు
వొద్దికలాగు లివేమో-వూహింపరె చెలులు
గద్దరి తిరువేంకటపతి-కామిని వదనాంబుజమున
అద్దిన సురతపు జెమటల-అందము కాదుగదా ॥ఏమొకొ॥

(X11-82)

పల్లవిలో చరణాల్లో కార్యకారణ సంబంధంతో చెలులు ఒక భావాన్ని ప్రశ్నార్థకంగా ఊహించి అందుకు కారణం ఇది ఏమొ అని తలచడంలో చక్కటి సమన్వయము కుదిరి చమత్కారం స్పష్టమవుతుంది. ఉదాహరణకు పల్లవిలోని "ఏమొకొ చిగురుటధరమున-యెడనెడ కస్తురి నిండెను" అని ప్రశ్నించుకొని అందుకు సమాధానంగా "భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదుగదా" అని భావించ డంలో ఈ చమత్కారం గోచరిస్తుంది. ఇలాగే తక్కిన చరణాల్లోనూ.

## 2.3 భావచిత్రాలు :

అన్నమయ్య పదాల్లో చక్కటి పద చిత్రాలు, భావచిత్రాలు గోచరిస్తాయి. ఈ క్రిందిది దంపుళ్ళపాట. కన్నెలు తమ మనసులను కుదురులుచేసి అందులో వల పులను నింపి కనుచూపులనే రోకండ్లతో దంపుళ్ళు సాగించారు. అనల్ప కల్పనా శిల్పం సైతం ఇందులో గోచరిస్తుంది.

సువ్వి సువ్వి సువ్వి సువ్వని
సుదతులు దంచెద రోలాల ॥సువ్వి॥

వనితలు మనసులు కుందెన చేసిటు
వలపులు తగనించోలాల

కనుచూపులనెడి రోకండ్లను
కన్నెలు దంచెర రోలాల ॥సువ్వి॥

బంగరు చెఱగుల-పట్టుపుట్టములు
కొంగులు దూలగ నోలాల
అంగన లందరు-నతి వేడుకతో
సంగడి దంచెర రోలాల ॥సువ్వి॥

కురులు దూలగ మంచి గుబ్బచనులపై
సరులు దూలాడగనోలాల
అరవిరి బాగుల-నలివలు ముద్దులు
గురియుచు దంచెర రోలాల ॥సువ్వి॥

ఘల్లు ఘల్లుమను-కంకణ రవమున
పల్లవ పాణుల నోలాల
అల్లన నడుముల-అసియాడుచు నతు
లొల్లనె దంచెర రోలాల ॥సువ్వి॥

కప్పుర గంధులు-కమ్మని పువ్వుల
చప్పరములలో నోలాల
తెప్పలుగా రతిదేలుచు గోనే
టప్పని బాడెద రోలాల ॥సువ్వి॥

(X11-352)

ఈ దంపుళ్ళ పాటలు, సువ్విపాటలు అన్నవి జానపద గేయ రీతుల్లోనివే. పల్లవి మొదలు చరణాలన్నింట భావ చిత్రాలు దృగ్గోచరమై అమితానందాన్ని చేకూరుస్తున్నాయి.

"సువ్వి సువ్వి సువ్వి సువ్వని
సుదతులు దంచెల రోలాల"

అన్న పల్లవిలోనే చక్కటి భావచిత్రం మనకగుపిస్తుంది. ఇలానే ప్రతి చరణంలోను చక్కటి భావచిత్రం గోచరించి సహృదయ హృదయాల్ని అలరిస్తుంది. ఇలాగే శ్రీకృష్ణ లీలల్ని వర్ణించే అన్ని పదాల్లోను చక్కటి భావ చిత్రాలని చిత్రించి అన్నమయ్య పరవశుడై మనల్ని సైతం పరవశింప చేస్తాడు.

## 3.0 శృంగారం, భక్తి, వైరాగ్యాలు:

అన్నమాచార్యుని పదాలు రెండు విధాలు. శృంగార సంకీర్తనలు, ఆధ్యాత్మ సంకీర్తనలు. అన్నమయ్య సంస్కృతంలో రచించిన సంకీర్తనలక్షణం తెలుగులోనికి అనువదించాడు అతని మనుమడు చిన తిరుమలాచార్యుడు. అందులో చెప్పినట్లు "శృంగార వధూ మృదు మధుర మనోజ్ఞ వాక్యమిశ్రమములై" ఉంటాయి శృంగార పదాలు. కాని అధ్యాత్మ పదాలు అంటే వైరాగ్య పదాలు-

"వైరాగ్య వృద్ధికరగం
భీర పదశ్రేణి వొసగ వెనుపుచు నగ్రా
మ్యారమ్య విష్ణుచరితో

ధారములై" ఉండాలన్నది నిర్వచనం. ఈ లక్షణానుగుణంగానే అన్నమయ్య పదరచన చేసినట్లు స్పష్టమవుతుంది.

## 3.1 శృంగారం :

శృంగార పదాలు అత్యంత మనోజ్ఞమై సరసమై ఉన్నట్లు పరిశీలనవల్ల వ్యక్తమవుతుంది. ఒక చక్కటి ఉదాహరణ :

విరహపు రాజనిదె-విడిదికి రాగా
సిరులజేనిదె-సింగారములా ||పల్లవి||

నెలత నుదిటిపై-నీలపు గురులనె
తొలుతనె కట్టెను-తోరణము
మొలత చెమటలనె-ముత్యపు ముగ్గుల
అలరిచె మదను-డదె చెలిమేన ||విర||

దట్టముగా జింతా లపనే వడి
బెట్టి జప్పరము-పెన గొనగ
పెట్టిన మైతావులు-పరిమళములు
కట్టించెను చెం-గట వలరాజు ||విర||

విందగు వేంకట-విభుని ప్రేమచే
దొందగ చెట్టెను-బోనాలు
ఇందువదనకి-యిందిరా విభుని
కందువేర నలుకలు చలిచేసె ॥విర॥

(IV-71)

ప్రేమాకృష్టయైన నాయిక వేంకట విభుని కలిసిన రీతి ఇందు వర్ణితం. ఇది సహృదయ హృదయ రంజకమని వేరుగా చెప్పవలసిన పనిలేదు. ఇందులో సంభోగ శృగారం వర్ణితం. కాని విరహ వ్యథాభరిత అయిన నాయిక స్థితిని ఎంతో మనోజ్ఞంగా మధురంగా ఈ క్రింది పదంలో చిత్రించాడు అన్నమయ్య.

పొద్దిక నెన్నడు వొదుమనొ-పోయిన చెలిరాదాయను
నిద్దుర గంటికి దోపదు-నిమిషంబొక యేడు ॥పొద్దిక॥

కన్నుల నవ్వెడి నవ్వులు-గబ్బితనంబుల మాటలు
సన్నని యొయ్యారంబులు-నొచ్చిన చూపులును
విన్న దనంబుల మఱపులు-వేడుకమీరిన యలపులు
సన్నపు జెమటలు దలచిన-ఝల్లనె నా మనసు ॥పొద్దిక॥

ఆగిన రెప్పలనీరుసు-సగ్గలమగు పన్నిటను
చోగియు దోగని భావము-దోచిన పయ్యెదయు
కాగిన దేహపు సెకలును-కప్పిన పువ్వుల సొరబులు(?)
వేగిన చెలితాపమునకు-వెన్నెల మందెడిని ॥పొద్దిక॥

దేవ శిఖామణి తిరుమల-దేవుని దలచిన నాయక
భావించిన యాకామిని-భావము లోపలను
ఆ విభుడే తానుండిక-అతడె తానెఱగగవలె
నీ వెలదికి గల విరహం జేమని చెప్పదము ॥పొద్దిక॥

(X 11-138)

ఆ నాయిక విరహ వ్యథా స్థితిని చూపిన అన్నమయ్య మనసే 'ఝల్లు'మన్నదట! "వేగిన చెలి తాపమునకు వెన్నెల మందెడిని" అని చమత్కరిస్తాడు; విరహ వ్యథను వ్యక్తీకరిస్తాడు.

## 3.2 భక్తి :

హార్వోక్తమయినట్లు వైరాగ్యపదాలు 'గంభీర పదశ్రేణితో, అగ్రామ్యారమ్యములై విష్ణు చరితోదారములై, ఉండాలి. ఇదే రీతిగా అన్నమయ్య అధ్యాత్మపదాలు ఒప్పారుతున్నాయి. ఈ వైరాగ్యపదాలు భక్తి, మధుర భక్తి, ఆధ్యాత్మికము మొదలైనవాటిని స్పష్టం చేస్తున్నాయి. ఈ అన్నమయ్య భక్తికి ఉదాహరణలుగా అనేక పదాలు ఇవ్వవచ్చు. శ్రీకృష్ణలీలల్ని భక్తిప్రపత్తితో అభివర్ణించి తరించాడు అన్నమయ్య. అలాగే దశావతారాలని, రామకథని చిత్రించడం జరిగింది. గురు భక్తిని సైతం ప్రకటించాడు. అచంచలమైన భగవద్భక్తిని ప్రస్ఫుటం చేస్తుంది ఈ క్రింది పదం.

భక్తికొలఁది వాడే-పరమాత్ముడు
భుక్తి ముక్తి దానెయిచ్చు-భువి పరమాత్ముడు ॥భక్తి॥

పట్టినవారి చేబిడ్డ-పరమాత్ముడు
బట్టబయటి ధనము-పరమాత్ముడు
పట్టపగటి వెలుగు-పరమాత్ముడు
ఎట్ట ఎదుటనే వున్నాడిదే పరమాత్ముడు ॥భక్తి॥
పచ్చి పాలలోని వెన్న-పరమాత్ముడు
బచ్చెన వాసినరూపు-పరమాత్ముడు
బచ్చు చేతివోరగల్లు-పరమాత్ముడు
ఇచ్చకొలఁదివాడుపో-యీ పరమాత్ముడు ॥భక్తి॥

పలుకలలోని తేట-పరమాత్ముడు
ఫలియించు నిందరికి-పరమాత్ముడు
బలిమి శ్రీ వేంకటాద్రి-పరమాత్ముడు
ఎలిమి జీవుల ప్రాణ-మీ పరమాత్ముడు ॥భక్తి॥

(V–235)

**4.0** ఇలాగా అన్నమాచార్యుల సంకీర్తనల్లో చక్కటి కవితా పరిమళాలు గుభాళిస్తాయి. పద్య కవితకు తీసిపోని రీతిలో సహృదయరంజకమైన వర్ణనలు,

ఉక్తి చమత్కృతి, భావచిత్రాలు, శృంగార భక్తివైరాగ్యాలు కూడి అన్నమాచార్య సంకీర్తన కవిత మనోజ్ఞమై ఒప్పారుతూంది.

సూచికలు :


1. వేటూరి ప్రభాకరశాస్త్రి : అన్నమాచార్య చరిత్ర-పీఠిక, పు. 2, 3
2. ,, : సింహావలోకనము-పు. 84
3. పైదే పు. 116
4. సాహిత్యోపన్యాసములు-3 : క్షేత్రయ్య పదసాహిత్యము-పు. 19
5. తెలుగులో పదకవిత-పు.2
6. పైదే పు. 44, 45
7. పైదే పు. 65
8. భారతి-నవంబరు 1971 పు. 21
9. వివరాలకు ఈ గ్రంథంలోని 'అన్నమాచార్య పురందరదాసుల సమాగమం' అనే వ్యాసం పరిశీలనార్హం.


# పదకవులలో అన్నమయ్య

తెలుగులో పదకవిత ప్రత్యేకమూ, విశిష్టమూ అయిన కవిత. దీనికాద్యుడు తాళ్లపాక అన్నమయ్య. అన్నమయ్య తరువాత పలువురు పదకవులువెలసి పద కవితను సుసంపన్నం చేసిన మాట వాస్తవమే. అయినా అన్నమయ్య పదకవితా మార్గానికి వేసిన రాచబాటలు తదనంతర పదకవులందరికి సుఖప్రయాణ దోహద కారణాలయ్యాయి. కొన్ని ఉదాహరణలు పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది; అన్నమయ్య పదకవులలో శ్రేష్ఠుడని విదితం కాకమానదు.

తెలుగులో అనాదిగా వస్తున్న సహజమూ, స్వాభావికమూ అయిన నిసర్గ మనోహరమైన జానపద కవితను మన పూర్వులు సేకరించి రాపాడ లేదు. ఇది కేవలం వాఙ్మూపంలో ఉండి పోయింది; ఇది అడి పాడుకోటానికి ఉపకరించేదిగా ప్రజల్లో

ఉండిపోయింది. తరువాత కాలంలో వెలసిన పద్యకవిత రాజాదరణకి పాత్రమై అధికారాన్ని చలాయిస్తూ వచ్చింది. తెలుగు సాహిత్యాన్ని పండిత సాహిత్యమూ, పండితేతర సాహిత్యమూనని రెండు రకాలుగా చెప్పవచ్చు. దీన్నే ప్రౌఢ లేదా శిష్ట సాహిత్యమని, జానపద లేద శిష్టేతర సాహిత్యమని చెప్పవచ్చు. కాని శిష్టసాహిత్యం కంటే జానపద సాహిత్యమే అనాది. అన్ని సాహిత్యాలకి అదే పునాది. పండితులకు మాత్రమే పరిమితమైన శిష్ట సాహిత్యమంతా పద్య కవితలు. జానపద సాహిత్యమూ, పద్య సాహిత్యమూ రెండూ సమాజంలో ఉంటూనే వచ్చాయి. అయితే జానపద కవితలను పండిత కవితా మార్గంలో సృజించి, ప్రచారంలోకి తెచ్చారు పదకవులు. ఇదే పద సాహిత్యం. దీనికి ఆద్యుడు అన్నమయ్య. పద్య కవితతో గౌరవం పదకవితకు సంపాదించి పెట్టిన కవి అన్నమయ్య.

అన్నమయ్యకు పదకవితా పితామహుడనీ, సంకీర్తనాచార్యుడనీ బిరుదులున్నాయి. ఇతడు 1408లో జన్మించి 1503లో దివ్యధామం చేరినట్లు తెలుస్తుంది. కడప మండలంలోని తాళ్లపాక ఇతని స్వగ్రామం. ఆ వెనుక తిరుమలలో స్థిర నివాస మేర్పరచుకొని శ్రీ వేంకటేశ్వరునిపై భక్తితో 32 వేల పదాలు రచించి ఆడి, పాడి ముక్తిపొందిన మహనీయుడు. ఇతనిలాగే ఇతని పుత్రుడు పెద తిరుమలాచార్యుడు, మనుమడు చిన తిరుమలాచార్యుడు పదకర్తలు. అన్నమయ్య రచించిన పదాలలో 15000 ఈనాడు లభిస్తున్నాయి. ఇవి ఆధ్యాత్మ సంకీర్తనలనీ, శృంగార సంకీర్తనలనీ రెండు విధాలు. ఇవి వేంకటేశ్వరునకు అంకితాలు. పదాలు,సంకీర్తనలు సమానార్థకాలు.

పూర్వోక్తమైనట్లు అన్నమయ్య సమకాలిక పదకవులు తన పుత్రుడు పెద తిరుమలాచార్యుడు, మనుమడు చిన తిరుమలాచార్యుడు. తదనంతర పదకవులు క్షేత్రయ్య, రామదాసు, సారంగపాణి,మునిపల్లె సుబ్రహ్మణ్య కవి,త్యాగరాజు ప్రముఖులు. పదకవితా రచనలో వీరందరికి అన్నమయ్య మార్గదర్శకుడు. ఇతని పదాలలో ధాతుమాతువులలో మాతువునకు అంటే సంగీత సాహిత్యాలలో సాహిత్యానికే ఎక్కువ ప్రాధాన్యం: భాషసరళంగా, మనోహరంగా ఉంటుంది; కవిత మనోజ్ఞమై మధురమంజులంగా ఉంటుంది: భావుకత, ప్రతిభా అనన్య సామాన్యం. ఇలాగే క్షేత్రయ్య పదకవితల్లో సంగీత సాహిత్యాలకు సమాన గౌరవం ఉంది. దీనికి తోడు

అభినయాన్ని జోడించాడు క్షేత్రయ్య. భాష అచ్చమైన తేటతెలుగులో తియ్యంద నాలు ఒలికేట్లు సమస్త భావాల్ని తేటతెల్లంజేసి, ఒక్కొక్క పదం రసభావ నిర్భరం చేయగలిగాడు. తెలుగు దనాన్ని కవితలో అందించిన మొదటి కవి తిక్కన. ఆ తరువాత మరింతగా తెలుగు పలుకుబడి, నుడికారం క్షేత్రయ్యలో చూడగలం. సంగీతాభినయాలకు తగిన రీతిగా తెలుగు సాహిత్యాన్ని తీర్చిదిద్దినవాడు క్షేత్రయ్య. రామదాసు మహాభక్తిపరుడు. ఇతడు రచించిన పదాలు కీర్తనలు. ఇవి భక్తిపార వశ్యంతో భజన కూటములలో గుంపులు గుంపులుగా పాడుకొని భక్తిపారవశ్యంతో మునిగిపోవడానికి ఉచితమైనవి. తదుచితమైన భాష, అందుకు తగిన భక్తిభావస్ఫో రకమైన రచన రామదాసు కీర్తనలలో గమనించగలం. సారంగపాణి పదాలలో శృంగార పదాలున్నాయి. భక్తిసంబంధి అయిన కీర్తనలున్నాయి.తత్వాలవంటి అధ్యా త్మిక కీర్తనలున్నాయి. మరోరీతి జాతీయ పదలున్నాయి. ఇతడు తన పదాలలో అన్ని విధాలైన అంటే భక్తి, శృంగార, తత్వ, జాతీయ భావాల్ని విశదీకరిస్తు పద రచన చేసినట్లు స్పష్టమవుతుంది. ఇతనిలో జనవ్యహారంలోనివ్యావహారికం మొదలు కొని, భక్తి, శృంగారాది రసస్ఫూర్తికి రచితమైన భాషను ప్రయోగించినట్లు తెలు స్తుంది. రామదాసు అందరికి అందుబాటులో ఉండేట్లు కీర్తనల సంగీతంకూర్చాడు. సారంగపాణి వివిధ భావాలకు తగినట్లు కీర్తనల సంగీత జ్ఞానాన్ని స్పష్టం చేశాడు ఇతని పదాల్లోను భావనాబలానికి, తదుచిత రచనారీతికి కొదవలేదు. అన్నమయ్యలో పదం సంకీర్తనగా ప్రారంభమై, క్షేత్రయ్యలో కేవలం శృంగార పదంగా ప్రసిద్ధి కెక్కి, రామదాసులో కీర్తనగా రూపుదిద్దుకొని, త్యాగరాజులో కృతిగా చక్కటి చిక్కటి సంగీతం ముద్ద కట్టినట్లుగా పలు పోకడలు పోయింది. త్యాగరాజు కృతిలో ధాతుమాతువులలో ధాతువుకే అధిక ప్రయోగం. త్యాగరాజునాదోపాసనలో ముక్తి పొందిన భక్తశ్రేష్ఠుడు. సంగీతం త్యాగరాజు సొత్తు. సంగీత ప్రపంచాన్ని నిర్మించ డానికే ఉద్భవించినవాడు త్యాగబ్రహ్మ. సంగీత రచనలో మహోపజ్ఞాడాయన. సంగీతానికిచ్చినంత ప్రాధాన్యం సాహిత్యానికి లేదంటే తప్పు లేదని పండితుల అభిప్రాయం. ధాతునిర్మాణ నైపుణ్యానికి మాతువును సాధనగా ఉపయోగించు కొన్నాడు త్యాగరాజు. ఇది పెద్దలందరూ అంగీకరించే విషయము.

పదకవులలో అన్నమయ్యకొక ప్రత్యేక స్థానముంది. అన్నమయ్య పద కవితా పితామహుడు, సరస హృదయులను అలరింపడానికి, తానుతరించి,ఇతరులను

తరింపచేయడానికి ఇతడు పదరచన చేసి నిరూపించుకొన్నాడు; సహృదయుల మెప్పు పొందాడు. ఆయన పదకవిత ఏ యితర కవుల పద్యకవితకు తీసిపోదు. పై పెచ్చు కేవలం పద కవిత్వం మాత్రమే చెప్పి పద్యకవులకు కూడా మార్గదర్శకుడయ్యాడు. "వాక్యం రసాత్మకం కావ్యమ్", "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్" అనే లాక్షణికోక్తులకు చక్కటి నిదర్శనం అన్నమయ్య ప్రతిపదమూను. ఏ పదం పరిశీలించినా, అన్నమయ్య భావనా బలం, ప్రతిభా గోచరిస్తాయి. వీటిపై ఆయన ఏమి, ఎక్కడా కష్టపడ్డట్టు కనిపించదు. వాటికవే ఆయన కవితలో అల వోకగావచ్చి పడినట్లు స్పష్టం కాగలదు. అన్నమయ్య పదకవితా వైభవానికి ఒక్క ఉదాహరణ.

"అలరులు గురియగ - నాడెనదే
అలకల గులుకుల - నలమేలు మంగ ||పల్లవి||

అరవిరిసొబగుల - నతివలు మెచ్చగ
అర తెర మరుగున - నాడెనదే
వరుసగ పూర్వదు - వాళపు తిరుపుల
హరిగరగింపుచు - నలమేలుమంగ ||అలరులు||

మట్టపు మలపుల - మట్టెల కెంపుల
తట్టిడినడపుల - దాటెనదే
పెట్టిన వజ్రపు - పెండెపు దళుకులు
అట్టిటు చిమ్ముచు - నలమేలుమంగ ||అలరులు||

చిందుల పాటలు - సిరి పొల మాటల
అందెల మ్రోతల - నాడెనదే
కందువ తిరువేం - కటపతి మెచ్చగ
అందపు తిరుపుల - నలమేలుమంగ ||అలరులు|| XII-24

ఇందులో చక్కటి తెలుగు భాష, మనోజ్ఞమైన భావన, ప్రతిభా వ్యక్తమవుతున్నాయి. ఇంతటి రూపు కట్టించే రచన-సులభంగా - అన్నమయ్యకే తగును. అలరులు గురియగ అలమేల్మంగ ఆడినదట. వేంకటేశ్వరుని పరవశింపజేస్తూ అతివలు మెప్పు

కొనేట్టు, తన లాస్య భంగిమములన్నిటిని ప్రదర్శిస్తూ ఆడింది. ఇక్కడి పదంలో, ఆటలో క్రమపరిణతి గోచరిస్తుంది.

అన్నమయ్య భావనా బలానికి, ప్రతిభా సంపన్నతకు ఆయన పదాలన్నీ ఉదాహరణలే; మచ్చుకు ఒక్కటి.

"అతివ జవ్వనము రాయలకు బెట్టిన(బెట్టని)కోట
పతిమదన సుఖరాజ్య భారంబునిలుప ॥పల్లవి॥

కాంత కనుచూపు మేఘంబులోపలి మెఱుగు
కాంతుని మనంబు చీకటి వాపను
ఇంతి చక్కని వదన మిందుబింబము విభుని
వంత కనుదోయి కలువల జొక్కజేయ ॥అతివ॥

అలివేణి ధమ్మిల్ల మంధకారపు భూమి
కలికి రమణునకు నేకత మొసగను
పొలతికి బాహువులు పూవు దీగల కొనలు
పొలసి ప్రాణేశు వలపుల లతల బెనచ ॥అతివ॥

పంకజానన రూపు బంగారులో నిగ్గు
వేంకటేశ్వర సిరులు వెదజల్లగా
చింక (జింక) చూపుల చెలియచేత మదనునిచేత
ఝింకా నతనినె మోహించ జేయగను ॥అతివ॥

(XII 112)

ఇందులో పద్యకవితను మించి పదకవితా వైభవాన్ని అన్నమయ్య ప్రదర్శించాడు. "కాంత కనుచూపు మేఘంబులోపలి మెఱుగు, ఇంతి చక్కని వదన మిందు బింబము; అలివేణి ధమ్మిల్ల మంధకారపు భూమి, పంకజానన రూపు బంగారులో నిగ్గు," అని ఎందరు కవులు ప్రయోగించారో సహృదయ, హృదయాలు గ్రహించ గలవు.

అన్నమయ్య వర్ణనా నైపుణ్యానికి ఒక ఉదాహరణ :

"కాలము లారును గలిగె నీకు నిదె
బాలకియందే పై పై నీకు ॥పల్లవి॥

సతి కొప్పు విరులు జలజల రాలిన
లతల వసంతకాలము నీకు
కత గా దన మైకాకలు చూపిన
అతివేసవి కాలమప్పుడే నీకు ॥కాలము॥

కౌగిట చెమటల కడు నిను దడసిన
కాగల తొలకరి కాలమది
పీగని చూపుల వెన్నెల చల్లిన
రాగినమతికి శరత్కాలంబు ॥కాలము॥

లంచపు బులకల లలన నీరతుల
కంచపు హేమంత కాలమది
యెంచగ శ్రీ వేంకటేశ వలపు సతి
వంచ శిశిరకాల మైభవమాయ ॥కాలము॥

ప్రబంధాల్లో అష్టాదశ వర్ణనల్లో ఋతువర్ణన ముఖ్యమైంది. ఈ పదంలో షడృతు వర్ణనచేసి ప్రతిభా పాండిత్యాలను, భావనాబలాన్ని, వర్ణనా వైదగ్ధ్యాన్ని నాయికా పరంగా వర్ణించి నిరూపించుకొన్నాడు అన్నమయ్య.

అన్నమయ్య పదాలన్నిటా భావచిత్రాలు దృగ్గోచరమవుతాయి. చక్కని ఉదాహరణ :

"సువ్వి సువ్వి సువ్వి సువ్వని
సుదతులు దంచెద రోలాల
వనితలు మనసులు కుందెన చేసిటు
వలపులు తగనించోలాల
కనుచూపులనెడి రోకండ్లను
కన్నెలు దంచెద రోలాల ॥సువ్వి॥

బంగరు చెఱగుల పట్టు పుట్టముల
కొంగులు దూలగ నోలాల
అంగనలందరు నతివేడుకతో
సంగతి దంచెద రోలాల ॥సువ్వి॥

కురులు మూలగ మంచి గుబ్బచనులపై
సరులు దూలాడగ నోలాల
అరవిరి బాగుల నతివలు ముద్దులు
గురియుచు దంచెద రోలాల ॥సువ్వి॥

ఘల్లు ఘల్లుమనుచు కంకణరవముల
పల్లవ పాణుల నోలాల
అల్లన నడుముల అసియాడుచు సతు
లొల్లనె దంచెద రోలాల ॥సువ్వి॥

కప్పుర గంధులు కమ్మని పువ్వుల
చప్పరములలో నోలాల
తెప్పలుగా రతిదేలుచు గోనే
టప్పని బాడెద రోలాల ॥సువ్వి॥

(XII 352)

ఇందులో కన్నెలు తమ మనస్సులను కుదురులు చేసి, అందులో వలపులను నింపి, కనుచూపులనే రోకళ్లతో దంపుళ్ల సాగించారు. అనల్ప కల్పనా శిల్పం సైతం ఇందు స్పష్టమవుతుంది. పల్లవి మొదలు చరణాలన్నిటా చక్కటి పదచిత్రాలు, భావచిత్రాలు దృశ్యమానమైన అనంతానందాన్నిచ్చి,సహృదయుల్ని అలరిస్తున్నాయి. ఇలాగే శ్రీకృష్ణలీలల్ని వర్ణించే పట్టులలోను భావచిత్రాలుఅనంతంగకనిపించగలవు.

ఇంకా అపురూప భావాలతో అనన్య సామాన్యంగా పదరచనచేసి "నభూతో నభవిష్యతి" అన్నట్లుగా తన పదకవితా సంపదను అత్యంత మనోజ్ఞంగా మన ముందుంచాడు అన్నమయ్య. పదకవులలో శ్రేష్ఠుడు అన్నమయ్య అనడం స్తవం కాదు. వాస్తవం !

# అన్నమాచార్యుని జోలపాట - జానపదాంశం

తెలుగులో వేలకొలది పదాలు రచించిన వాగ్గేయకారుడు అన్నమాచార్యుడు. అన్నమాచార్యుని పదాలలో చాల వరకు తెలుగు జాన పద గేయాలలోని రీతులు అనేకం ఉన్నాయి. వాటిని విమర్శకులు గ్రహించారు.ఆయన పదాల్లో ప్రసిద్ధమైనది జోల పాట ఒకటి. ఈ జోలపాటలోని జానపదాంశాన్ని గూర్చి పరిశీలించడమే ఈ వ్యాసోద్దేశం.

తెలుగులో అనాది నుంచి మార్గ-దేశి అనబడే శిష్ట, శిష్టేతర కవితలు వెలసి నట్లు మనకందరకు తెలిసిన సంగతే. నన్నయ్యకు పూర్వం ఉన్న నిబద్ధ ఛందస్సు లైన, తరువోజలు, మధ్యాక్కరలు మొదలైనవి శాసనాలకెక్కగా అనిబద్ధ పదాలు పామర ప్రజల నోళ్లలో నివసిసూనే ఉండేవి అనవచ్చు. నన్నయ్యకాలంలో ఎలాంటి పదాలు ఉండేవో తెలియదు. కాని నన్నెచోడుని నాడు మాత్రం ఊయల పాటలు, గౌడు గీతాలు ఉండేవని తెలుస్తుంది. పాల్కురికి సోమనాథుడు భక్తులు శ్రీ శైల పర్వతారోహణ సమయంలో పాడినట్లు పేర్కొన్న పర్వతపదాలు. ఆనంద పదాలు, శంకర పదాలు. నివాళి పదాలు, గొబ్బి పదాలు, వెన్నెల పదాలు మొదలైన అనేక పదాలు జాన పద గేయ రీతుల్ని స్పష్టం చేస్తున్నాయి. నాచన సోమనాథుడు ఉత్తరహరివంశమే కాక వసంత విలాసమనే ప్రబంధం రచించినట్లు తెలుస్తుంది. అందులో జాజర పాట ప్రసక్తి ఉంది.

"వీణాగానం వెన్నెల తేట
రాణ మీరగా రమణుల పాట
పేరు చెప్పిన బ్రాహ్మలు వీట
జాణలు మెత్తురు జాజర పాట"

ఇలాంటి తెలుగు పద కవితల మాధుర్యాన్ని ఆస్వాదించే భాగ్యం తెలుగు వాళ్లకి కలగలేదు, ఇలాంటి పదాలు బతికి బట్టకట్టక పోవడం వల్ల.

ఇలాంటి పద కవితలకు పర్వదినం అన్నమాచార్యుని జన్మదినం. అన్నమాచార్యుడు 32,000 పదాలు రచించి రక రకాల జానపద గేయ రీతుల్ని అందులో పొందుపరచి ఉండడం తెలుగు వారి అదృష్టం. చందమామపదాలు, తుమ్మెద పదాలు, గొబ్బి పదాలు, ఏలలు, లాలలు, జోలలు, తందనాలు, ఊయల, సువ్వి, కూగూగు, ఛాంగుభళా మొదలైన అనేక పదాలు అన్నమాచార్యుని పదాల్లో కనిపిస్తాయి. అందులో ప్రసిద్ధమైనది అన్నమయ్య జోలపాట. ఇలాంటి జోలపాట తెలుగునాడులో పలు ప్రాంతాల్లో పలు విధాల ఉన్నట్లు తెలుస్తుంది. అన్నమయ్య జోలపాటతో పాటు తక్కిన కొన్ని జానపదుల జోలపాటల్ని పరిశీలిద్దాం. ప్రసిద్ధమైన అన్నమాచార్యుని జోలపాట ఇది.

జోవచ్చుతానంద - జోజోముకుంద
రావె పరమానంద - రామగోవింద ॥పల్లవి॥

నందునింటను జేరి - నయము మీఱంగ
చంద్రవదనలు నీకు - సేవ జేయంగ
నందముగ వారిండ్లు - నాడు చుండంగ
మందలకు దొంగ - మా ముద్దు రంగ ॥జోవ॥

పాలవారాశిలో - వపళించి నావు
బాలుగా మునుల కభయమిచ్చినావు
మేలుగా వసుదేవకుదయించినావు
బాలుడై యుండి గో — పాలుడై నావు ॥జోవ॥

అట్టుగట్టిన మీగ - డట్టె తిన్నాడే
పట్టి కోడలు మూతి - పై రాసినాడే
అట్టె తినెనని యత్త యడుగ విన్నాడే
గట్టిగా నిదె దొంగ కొట్టుమన్నాడే ॥జోవ॥

గొల్ల వారిండ్లకును - గొబ్బునను బోయి
కొల్లలుగా త్రావి - కుండలను నేయి
చెల్లునామగనాండ్రి - జెలిగి యిశాయీ
చిల్లి తనములు సేయ - జెల్లునటవోయి ॥జోవ॥

రేపల్లె సతులెల్ల గోపంబుతోను
గోపమ్మ మీ కొడుకు మా యిండ్లలోను
మాపుగానే వచ్చి - మా మానములను
నీ పాపడే చెఱచె - నేమందు మమ్మ ॥జోవ॥

ఒకని యాలిని దెచ్చి - నొకని కడబెట్టి
జగడములు కలిపించి - సతిపతుల బట్టి
పగలు నలుజాములును - బాలుడై నట్టి
మగనాండ్రి జేపట్టి - మదనుడై నట్టి ॥జోవ॥

అంగజుని గన్న మా - యన్నయిటు రారా
బంగారు గిన్నెలో - బాలు పోసేరా
దొంగ నీవని సతులు - బొంగుచున్నారా
ముంగిటనాడరా - మోహనకార ॥జోవ॥

గోవర్ధనంబెల్ల - గొడుగుగా బట్టి
కావరమ్మున నున్న - కంసుబడగొట్టి
నీవు మధురా పురము - నేల జేపట్టి
తీవితో నేలిన దేవకీపట్టి ॥జోవ॥

అంగుగాతాళ్లపా - కన్నయ్య చాల
శృంగార రచనగా ! జెప్పెనీ జోల
సంగతిగ సకల సంపదల నీవేళ
మంగళము తిరుపట్ల మదనగోపాల ॥జోవ॥

ఈ పాటలోని పల్లవి తెలుగు వాళ్ళందరికీ సువిదితమే. తెలుగుతల్లులందరు పాడిందే ! పాడుతూ ఉన్నదే ! ఇందులోని తొమ్మిది చరణాల్లో శ్రీకృష్ణ లీలలు ఎంతో మనోజ్ఞంగా, సరళమైన భాషలో చాల చక్కగా అభివర్ణించి తరించాడు అన్నమాచార్యుడు. పై పల్లవితో కూడిన జానపదుల జోలపాటలు అనేకం కనిపిస్తాయి. నా మిత్రుడు కందాళం కుప్పుస్వామి సేకరించిన జానపద గేయాల్లోను ఇదే పల్లవి ఉంది. ఆ పాట ఇది.

జో అచ్యుతానంద జోజో ముకుందా
రార పరమానంద రామ గోవిందా ॥లాలీ॥

తొలుత బ్రహ్మాండంబు తొట్టి గావించి
నాలుగూ వేదములు గొలుసు లమరించి
బలువైన ఫణిరాజు పాను పమరించి
ఆధార పనియేటి దూలములను వేసి ॥లాలీ॥

తొలుత బ్రహ్మాండంబు తొట్టి గావించి
కామ క్రోధములను కట్టుగావించి
సాహసమ్మని యేటి పడక గావించి
భక్తి చేలను బట్టి పానుపమరించి ॥జోజో॥

తొమ్మిది వాకిండ్లు దొడ్డిలోపలనూ
క్రూరులగు ఆర్గురిలో పాపులైదుగురూ
అంతటా ముగ్గురు మూర్తులున్నారూ
తెలివిదెలిపెట్టే వాడు దేవుడున్నాడు ॥జోజో॥

పట్టవలె నల్గురిని పదిలంబుగానూ
కట్టవలె ముగ్గురిని కదల కుండగనూ
ఉంచవలె ఒక్కరిని హృత్కమలమందూ
వుండవలె పండువెన్నెల నిండుగానూ ॥జోజో॥

ఈడుగా నీకూడుండ వలెనూ
జోడుగా నీ వాని జూడగ నీ వలెనూ
మేడ మీదా నున్న మేలు గనవలెనూ
కోరి యాగోవిందుగురుని గనవలెనూ ॥జోజో॥

వీధి ఒక బాటలో గీతంబు సేయా
కోటలో భేరీ మృదంగములు మ్రోయా
వేటలో కోదెకాంద్రుడు కోలంది వేయా
దీటులేని ప్రభువు దొరతనము సేయ్యా ॥జోజో॥

ఓంకారమని యేటి ఒక తొట్టిలోను
తత్వమని యేటి చెలువలంబరచి
వేడ్కతో పాపణ్ణి యేర్పాటు చేసి
ఏడు భువనముల వారు ఏకమైపాడా ॥జోజో॥

(ఆంధ్రప్రదేశ్ - నవంబరు 1977 పు. 142, 143)

పల్లవి ఒకటే అయినా ఇందులోని చరణాల్లో తాత్విక చింతన వర్ణితం. ఆధ్యాత్మిక చింతనతో వేదాంత రహస్యాలు నిబద్ధమై ఉన్నాయి. ఇది జానపద గేయమే అయినా తత్వబోధామృతాన్ని అందిస్తూ ఉంది. దీని రచయిత ఎవరోకాని పామరుడు కాక పండితుడేమో అనిపిస్తుంది.

ఇది ఇలా ఉండగా 'స్త్రీల పాటలు' అనే పుస్తకంలో పల్లవి, చరణాల్లో స్వల్ప భేదాలతో ఈ జోలపాట ఉంది.

"జోజో అచ్యుతానంద జోజో ముకుంద
రార పరమానంద రామ గోవిందా ॥జోజో॥

తొలుత బ్రహ్మాండము తొట్టి గావించి
నాలుగు వేదములు గొలుసు లమరించి
బలుపైన ఫణిరాజు పాన్పునమరించి
చిత్తాము అనియేటి దూలము వేసి ॥జోజో॥

తొలుత బ్రహ్మాండంబు తొట్టిగావించి
కామ క్రోధములను కొట్లనమరించి
సహస్రమనియేటి ప్రక్కగావించి
భక్తి చేతను పట్టుపానుపమరించి ॥జోజో॥

బొమ్మిది వాకిళ్ల దొడ్డి లోపలను
దారిరులగు ఆర్గురు సాధులైదుగురు
అంతట ముగ్గురు మూర్తులున్నారు
తెలిసిజెప్పేటి దేవుడున్నాడు ॥జోజో॥

పట్టవలెనాగ్గురుని పదిలంబుగాను
కట్టవలె ముగ్గురను కదలకుండగను
ఉంచవలెనొక్కరిని హృత్కమాలమందు
మెంచవలెపండువెన్నెల నిండుగాను ॥జోజో॥

ఈడుగాని కూడుండ వలెను
జోడుగాని వాని జాడగనవలెను
మేడ మీదనున్న మేలు గనవలెను
కోరి గోవింద గురువని గనవలెను ॥జోజో॥

వీధినొకబాటలో నీతంటు సేయ
కోటలో చేరి మృదంగములు మోగ్రియ
కోటలో కొలగాండ్రు కోలండివేయ
నీటుకని ప్రభువు దొరతనము సేయ ॥జోజో॥

ఓంకార మనియెడి యొక తొట్టిలోను
తత్వమని కూటి వలావలంబరచి
వేడ్కతో పాపని యేర్పాటు జేసి
ఏడు భువనముల వారు ఏకమై పాడ ॥జోజో॥

(స్త్రీల పాటలు- పు. 22, 23-సి.వి. కృష్ణా బుక్ అండ్ కో, మద్రాసు)

పల్లవి 'జోజో' అనే ఆరంభమవుతుంది. ఈ రచనలో ఒడుదుడులున్నాయి. బహుశా పాడేవాళ్ళు బాణీలను ఇందులోకి ఎక్కించిఉంటారు.

నా సేకరణలోని జానపద గేయాల్లోని జోలపాట ఒకటి ఉంది. ఇందులోని పల్లవి అన్నమయ్య జోలలాగా ఉంది. ఆ గేయమిది.

జో అచ్చుతానందా జోజో ముకుందా
లాలి పరమానంద రామ గోవిందా లాలీ ॥జోజో॥

తొలుత బ్రహ్మాండంబు తొట్టిగావించి
నాలుగూ వేదములు గొలుసులమరించి ॥జోజో॥

సలువ దేవతలు పానుపులమరించి
అద్దాలలోన డు బిడ్డలయినారా ॥జోజో॥

తొలి యొక్క జన్మమున బిడ్డలే లేరూ
ఈ యొక్క జన్మమున నాకు బిడ్డలయినారా ॥జోజో॥

నీలాలకంబాన నిలిచి దేవతలూ
రేపు మా పాటనిక పాడగలరూ ॥జోజో॥

నాగేంద్రుడున్నాడూ ననుగన్న తండ్రి
కంటికి రెప్పవలె నిను కాపాడగలడూ ॥జోజో॥

ఈ పై గేయాలన్నిటా పల్లవి ఒకటే అయిన చరణాల్లో విషయం. వేరు నా సేకరణలోని గేయంలో బ్రహ్మ, విష్ణు, పరమేశ్వరులు, అనసూయ ప్రాతివత్య మహిమ వల్ల ముగ్గురు శిశువులైన సందర్భంలో వాళ్ళని ఊయల్లో వేసి అనసూయ జోలపాడిన విషయం వర్ణితం.

అన్నమాచార్యుడు రచించిన జోలపాట మొదటిదో లేదా తక్కిన మూడు జానపద గేయాల్లో ఏది మొదటితో చెప్పడం కష్టం. కాని స్త్రీల పాటల్లోని జోలపాట తప్ప ఈ పాటలు మూడింటా పల్లవి మాత్రం సమానమన్న విషయం సత్యం. ప్రాంతీయ తత్వాన్ని బట్టి గేయరచయిత మనోభీష్టానుసారం విషయ వర్ణనలో భేదముంది. కాని వీటి పూర్వాపరాలను నిర్ణయించడం కష్టం. ప్రసిద్ధ వాగ్గేయకారుడైన అన్నమాచార్యుడు ఈ జోలపాటను రచించిన తరువాత దానికి వచ్చిన ప్రచారాన్ని పురస్కరించుకొని తమకు నచ్చిన రీతిలో జానపదులు అదే పల్లవితో ఇలా గేయరచన చేశారో లేక తన కాలానికి ముందే జానపదుల్లో ప్రచారం పొందిన ఇలాంటి జానపద గేయ పల్లవినే గ్రహించి అన్నమయ్య రచించాడో ఇదమిత్థంగా చెప్పడానికి తగిన చారిత్రకాధారాలు లేవు. కాని తనకంటె పూర్వమే ప్రచారంలో నున్న జానపద గేయ ఫణితుల్ని అన్నమాచార్యుడు చాలవరకు తన రచనల్లో గ్రహించాడన్న విమర్శకుల అభిప్రాయాన్ని మనము అంగీకరిస్తే జానపద గేయాలే

మొదటివని నమ్మవలసి ఉంటుంది. అంతకుముందే ప్రసిద్ధమైన జానపద గేయ పల్లవిని స్వీకరించవలసినంత ప్రతిభారహితుడేమీ కాదు అన్నమాచార్యుడు. అయినా ప్రసిద్ధి పొందిన బాణీని గ్రహించినప్పటికి తన భక్తి ప్రపత్తితో శ్రీకృష్ణలీలా విశేషాలను తొమ్మిది చరణాల్లో విపులంగా, మనోజ్ఞంగా కన్నులకు కట్టినట్లు వర్ణించి ఉండడం అన్నమాచార్యుని గొప్పదనానికి నిదర్శనం. లేదా అన్నమాచార్య రచనానంతరమే ఈ జోలపాట ప్రసిద్ధిలోకి రాగా జానపదులు దానిని అనుకరించయినా ఉండవచ్చు. ఆదాన ప్రదానాలు ఎటునుంచయినా కావచ్చు.ఏది ఏమయినా ఈ జోలపాట ఏదో ఒకరీతిలో తెలుగునాడంతటా ప్రసిద్ధికెక్కిందన్న విషయం మన కందరికి తెలిసిందే.

# అన్నమయ్య లాలిపాట - ఇతర వాగ్గేయకారులు

అన్నమయ్య సంకీర్తన సాహిత్యం అనంత రస సాగరం. ఆ అనంత సాగరంలో ఓలలాడే రసలుబ్ధుల్ని రసానందోర్మికా దోలికల్లో ఊచి పరవశుల్ని చేస్తుంది. అందులో రకరకాల పదరచనా వైవిధ్యం అడుగడుగునా గోచరించిఅబ్బుర పరుస్తుంది. అమృతమయ జగత్తులోకి తీసుకొని పోతుంది. అందులో జానపద గేయరీతులెన్నో కమనీయమై సరసుల మనసులను మైమరపింపజేస్తాయి.

"జోవచ్యుతా నంద జోజోముకుంద
రావె పరమానంద రామగోవింద"

అనే అన్నమయ్య జోలపాట చాల ప్రసిద్ధి పొందిన విషయం సర్వజన సువిదితమే. ఈ పల్లవితో జానపదులు సైతం జోలలు అనేకం పాడినట్లు ప్రచారంలో ఉన్న విషయం కూడ మనకు తెలిసిందే. పోతే ఈ జోలపాట లాంటిదే లాలిపాట. అన్నమయ్య ప్రసిద్ధమైనలాలిపాటనుసైతంరచించినట్లుస్పష్టం. దీన్ననుసరించివాగ్గేయకారులు లాలిపాటలు రచించినట్లు మనకు తెలుస్తుంది. ముఖ్యంగ అన్నమయ్య లాలిననుసరించిన వాగ్గేయకారుల్లో సారంగపాణి, త్యాగయ్యలు ప్రముఖులు. వీటి తులనాత్మక పరిశీలనమేఈ వ్యాసోద్దేశం.

అన్నమయ్య ప్రసిద్ధమైన లాలి పాట ఇది :

లాలనుచు నూచేరు లలనలిరుగడల
బాల గండవర గోపాల నిను జాల ||పల్లవి||

ఉదుట గుబ్బల సరపుటుయ్యాల లూగ
పదరి కంకణరవము బహుగతుల మ్రోగ
పొదిగి చెంపల కొప్పు లొక్కింత వీగ
ముదురు చెమటల నళికములు తొప్పదోగ ||లాలి||

సొలపు తెలిగన్నుగవచూపు లిరువంక
మలయు రవళులకు బలుమాఱును బెళంక
కొలది కోవిలగములు క్రోలుమదనాంక
ముల గ్రేణి సేయు రవములు వడిదలంక ||లాలి||

సరస పదములు జంగచాపుచే బాయ
గురు కృల మీగాళ్ళ గుచ్చెళ్ళ రాయ
కరమూలముల కాంతి కడుజాయ జేయ
సరస సురకుసుమ వాసన లెదురు దాయ ||లాలి||

కొలది నునుమేనులత కూనలసియాడ
మెలకువతో నొకరికొకరి మెచ్చి సరిగూడ
తల లూచి చొక్కి చిత్తురు బొమ్మ లాడ
అలరి యెల్లరు మోహనాకృతులు చూడ ||లాలి||

లలిత తాంబూల రసకలితంబులైన
తళుకు దంతములు కెంపుల గుంపులీన
మొలక వెన్నెల డాలు ముసురుకొనితోన
ఛెలగి సెలవుల ముద్దు చిఱునవ్వులాన ||లాలి||

మలయ మారుత గతులు మాటికిఁ జెలంగ
పలుకు గపురతావి పై పై మెలంగ
బలుగానలహరి యింపుల రాల్గరంగ
బలసి వినువారి చెవి బడలిక దొలంగ ॥లాలి॥

లలనా జనాపాంగ లలిత సుమ చాప
జలజలోచనదేవ సద్గుణ కలాప
తలపులోపల మెలగు తత్వ్రప్రదీప
భళిర గండవరేశ పరమాత్మరూప ॥లాలి॥

(అన్నమాచార్య చరిత్ర పీఠిక - పు. 63, 64)

ఈ పాటలో వెంకటేశ్వర నామాంకంగాని, అన్నమయ్య పేరుగాని కనిపించడం లేదు. దీనికి సమాధానంగా దీన్ని సేకరించిన వేటూరి ప్రభాకర శాస్త్రి గారే ఇలా పేర్కొన్నారు. "ఈ పాటలో గండవరపు బాల గోపాలుని నామాంకమున్నది గాని శ్రీ వేంకటేశ్వర స్వామి నామాంకము గానరాదు. అన్నమయ్య వేరెందు లేక పోయినను గండవరము తాళ్ళపాక వారికి ఇల్లుము వచ్చిన గ్రామమని తెలియుటచే నయ్యూరి స్వామి మీద నన్నమాచార్యులో తత్పుత్ర పౌత్రులో దానిని రచించి యుందురను కొంటిని." (అన్నమాచార్య చరిత్ర పీఠిక పు. - 63) మొత్తం మీద ఇది అన్నమాచార్య లాలిగానే ప్రసిద్ధి కెక్కింది. ఈ లాలిపాట ఎంతో మనోజ్ఞమూ ఆనంద నిష్యంది అయి ఒప్పుతూంది. లలనలు ఇరుగడల చేరి లాలెనుచు ఊయల ఊస్తున్నారు. ఆ ఊచే లలనల సౌందర్యం చరణాల్లో అత్యంత సముచిత రీతిని అభివర్ణించడం జరిగింది. ప్రతి చరణం అంత్యప్రాసోదంచితమై శ్రుతి పూర్ణమై ఊయల ఊచినట్లే తోస్తుంది. ఆనందాన్ని పాదిస్తూంది. చరణంలోని ఒక్కొక్క పంక్తిలో, రెండేసి పంక్తుల్లో, ఒక్కొక్క చరణంలో చక్కటి భావచిత్రాలు చిత్రించాడు అన్నమయ్య. "నునుమేనులతకూనలసియాడ" చక్కటి రూపకాలంకారంతో సహృదయ రంజకమైన కవిత మనల్ని మైమిరపింప జేస్తుంది.

ఇలాగే "లలిత తాంబూల రసకలితంబులైన
తళుకు దంతముల కెంపుల గుంపులీన
మొలక పెన్నెలడాలు ముసురు కొని తోన
ఛెళగి సెలవుల ముద్దు చిఱునవ్వులాన"

చక్కటి వర్ణన. ఇందలి భావాలు లలితమై కవి భావుకత స్పష్టమవుతుంది. తెలుగు పలుకులతో పాటు సరళమైన సంస్కృత సమాసాలు. "లలిత తాంబూల రసకలితంబులైన",

"లలనా జనాపాంగ లలిత సుమచాప
జలజలోచన దేవ సద్గుణ కలాప"

ఇలాగ సరసమై ఒప్పుతున్నాయి. ఇందులోని "లలనా జనాపాంగ లలిత సుమచాప" వినగానే "లలనా జనాపాంగ వలనా వసదనంగ" అనే రామరాజ భూషణుని ప్రసిద్ధ పద్యం గుర్తుకి రాకమానదు. ఇలాంటి సమాస కల్పన ప్రబంధ కవులకంటే ముందే పదకవితలో వెలసి ఉండడం విశేషం. ఇంకా "తలపులోపల మెలగు తత్వప్రదీప" అని తత్వప్రాధాన్యాన్ని వివరించాడు అన్నమయ్య.

బహుశా దీని ప్రభావం వల్లనో లేదా స్వతఃగా గాని తరువాత ప్రముఖ వాగ్గేయ కారులు సైతం లాలిపాటలు రచించారు. అందులో ప్రధానంగా పేర్కొన దగ్గవారు సారంగపాణి త్యాగయ్యలు. వారి లాలి పాటల్ని క్రమంగా పరిశీలిద్దాం.

సారంగపాణి లాలి పాట ఇది :-

"లాలెనుచు వూచేరు లలనలింపునను
శ్రీల చెన్నలరుసుయ్యాల పాన్పునను
గోల రుక్మిణిదేవి కోరినొంపునను
బాళితో వచ్చె నీపై తలంపుననూ ॥లాలీ॥

జోలపాడెదమనుచు జోడు కూడుకొని
బాలికలు తమలోన పంతమాడుకొని
మేలిమిగ నిన్ను యేవేళ పొగడుకొని
తాలిమితో వచ్చేరు దయను వేడుకొని ॥లాలీ॥

కరమునను రత్నాల కంకణము మోవా
హరిణాక్షి మరువంపు సురటిగొని వీవా
మరి ప్రొద్దుబోయె నెమ్మది నిదురదోవా
పరమ పావనమైన వరభావదేవా ॥లీలా॥

చిన్న బాలుల తోటి చెలిమి సేయకురా
కన్నికామణుల దగ్గరికి బిలువకురా
మన్నన తో క్షీ తల్లి మాట మీరకురా
వెన్నయిచ్చేను నీ వెందు దిరుగకురా ॥లాలీ॥

ధరలోన వసుదేవు తనయుడై పుట్టి
శరణాగత త్రాణ బిరుదు చేపట్టి
వరుస సద్భక్తులకు వరమొసగినట్టి
దొరవనుచు సుజను లెంతురు గంటగట్టి ॥లాలీ॥

జారచోరత్వముల చతురుడై నావు
ధీరుడై యిల్లిల్లు దూరి వచ్చేవు
వారు కోపించితే వగల బొయ్యేవు
దూరగా వలెననుచు దుడుకుజేసేవు ॥లాలీ॥

అసురులను శిక్షించి అవని రక్షించి
మసలకను కౌరవుల మదములణగించి
పొసగ ధర్మజు చేత భూమి నేలించి
రసికుడై వెలగితివి రాజసము మించ ॥లాలీ॥

వాణీశ రుద్రాది వందితుడవీవు
ప్రాణి కోటులనెల్ల ప్రబలజ్ఞసేవు
నాణెముగ కార్వేటి నగరమున నీవు
వేణు గోపాలుడై వెలసి యున్నావు ॥లాలీ॥

(కీర్తన - 199)

ఇందులో సారంగపాణి అన్నమయ్య లాలిపాటలో లాగానే పల్లవి ఒకే మాదిరిగా ఆరంభించాడు. సమంగా దాన్నే గ్రహించాడా అన్నట్లుంది. "లాలనుచు నూచేరు లలనలు" వరకు రెండు లాలి పాటల్లోను సమానమే. తరువాత అన్నమయ్య పాటలో 'ఇరుగడల' అని వుంటే సారంగపాణి పాటలో 'ఇంపునను' అని మాత్రం మారింది. అన్నమయ్య లాలి పాటలో పల్లవికి రెండు పాదాలుండగా,

సారంగపాణి పాటలో పల్లవి చతుష్పాదమైంది. అన్నమయ్య లాలి ఊచే లలనల సొబగులు సర్వత్ర వర్ణితం కాగా, ఇక్కడ రుక్మిణి బాళితో వచ్చిందనీ, బాలికలు జోడు గూడుకొని పంతమాడు కొంటూ లాలిపాట పాడుతున్నట్లు, కంకణాలమ్రోత వినిపిస్తున్నట్లు రచితం. మూడో చరణం మొదలు ఆరో చరణం వరకు చక్కగా శ్రీకృష్ణ లీలలు వర్ణితం. ఇవన్నీ చక్కటి భావ చిత్రాలు. అన్నమయ్య లాలి పాటలో గండవర బాలగోపాలుడు ఉండగా, సారంగపాణి పాటలో కార్వేటి నగరంలో వెలసిన వేణుగోపాలుడు ఇష్టదైవం వర్ణితం. అన్నమయ్య లాలిపాటలో లాగానే అన్ని చరణాలు అంత్యప్రాస ఘటితమై ఒప్పుతున్నాయి.

కాగా ఇంత పెద్ద లాలిపాట కాకపోయినా నాదోపాసనలో దైవసాక్షాత్కారం పొంది తరించిన భక్తాగ్రేసరుడు త్యాగయ్య రచించిన చిన్న లాలిపాటను సైతం ఇక్కడ ప్రస్తావించడం అప్రస్తుతంకాదు: అత్యవసరం.

త్యాగయ్య లాలిపాట ఇది :

"లాలీ లాలీ యని యూచేర- వన
మాలి మ్మాలీయని యూచేరా ॥లాలీ॥

రామ రామ యని పాడేర - రిపు
భీమ భీమా యని పాడేరా ॥లాలీ॥

దేవ దేవాయని పిలిచేరా - మా
దేవ దేవాయని పిలిచేరా ॥లాలీ॥

రాజరాజాయని పిలిచేరా - త్యాగ
రాజరాజాయని తలచేరా ॥లాలీ॥

(త్యాగరాయకృతులు - పు. 13)

ఈ పాటలో పల్లవి కాక మూడు చరణాలు మాత్రమే ఉన్నాయి. పాట అంతా అంత్యప్రాసాఘటితం. వనమాలి స్మరణతో పాటు త్యాగయ్య ఇష్టదైవమైన రామ స్మరణం ఇందులో ప్రాధాన్యం వహిస్తుంది, భగవద్భక్తి భజన స్మరణాదులని నవవిధాలు, అలాంటి భగవద్భజన స్మరణాదులు పరమ భక్తాగ్రేసరుడైన

త్యాగయ్య కృతిలో ఉండడం అత్యంత సహజ విషయం. కృతి అంతటా త్యాగయ్య భక్తి నిండినిబిడీ కృతమై ఉంది.

ఈ విధంగా ఈ మూడు లాలిపాటలు ఒక్కొక్కటి ప్రత్యేకమైన విశిష్టతను సంతరించుకొన్నట్లు స్పష్టమైంది. ఇంతేగాక ఈ సందర్భంలో మరికొన్ని విషయాలు సైతం స్మరించడం సముచితమే. అన్నమయ్య లాలిపాట, తదితర సంకీర్తనల్లాగే భాషాపాటవంతో ప్రబంధ శైలిలో రచితమై ఉండడం గమనించదగ్గవిషయం. పై పెచ్చు అన్నమయ్య సంకీర్తనల్లో సాహిత్యానికి ప్రాధాన్యమెక్కువ. సంగీతానికి ప్రాధాన్యం తక్కువ. అదే రీతిని ఈ లాలి పాటయందు సైతం సంగీతాన్ని వెనక్కినెట్టి సాహిత్యమే అత్యంత ప్రాముఖ్యం వహించింది. ఇదిలా వుండగా సారంగపాణి లాలిపాటలోని భాషలో సారళ్యమూ, సౌలభ్యమూ ఉన్నాయి. పైగా శృంగార పదాలలో కీర్తనలతోపాటు, దేశీయ, జాతీయ పదరచన చేసి ప్రజల భాషను ఆదరించిన వాడు సారంగపాణి. అదేవిధంగా కీర్తనల్లో ఒకటైన లాలిపాటను కూడా ప్రజలకు అర్థమయ్యేలా రచించడం విశేషం. ఇంకా చక్కగా చెప్పాలంటే క్షేత్రయ్య పదాల్లో సంగీత సాహిత్యాలకు సమప్రాధాన్యం ఉందన్న విషయం తజ్ఞులెరిగిన విషయమే. క్షేత్రయ్యలాగే పదరచన చేసిన సారంగపాణి పదాల్లోను సంగీత సాహిత్యాలకు సమానమైన ప్రతిపత్తి వుంది. కనుకనే సారంగపాణి లాలిపాటలోను సంగీత సాహిత్యాలు సమంగావుండి అత్యంతానందాపాదిమై వున్నాయి. కాగా నాదోపాసకుడు త్యాగబ్రహ్మ లాలిపాటలో ఆయన తదితర కృతులలోలాగనే సాహిత్యాన్ని ప్రక్కకునెట్టి సంగీతం ప్రాధాన్యం వహించింది. సంగీత వేత్తలు తదుచిత రీతిని ఆలాపన చేసినప్పుడు ఆలాలిపాట ప్రాధాన్యం ప్రస్ఫుటమై రసగ్రహణ పారీణులైన సహృదయ హృదయాల్ని అలరించి ఆనందాన్ని ఆపాదించగలదు. రాగతాళాల్ని వదలి రసభావాల్ని గ్రహించి పరవశత్వం చెందుదామన్న వారికి ఆ సాహిత్యం అంతగా ప్రయోజనం కూర్చలేకపోవచ్చు. అంటే పూర్వోక్తమైనట్లు నాదోపాసనా కళాత్ములై తరించిన త్యాగయ్యలో సంగీత ప్రాధాన్యమంతటి మహిమాన్వితమైందన్న విషయం మనం తప్పక ఇక్కడ గమనించి తీరాలి. పదకవితా పితామహ బిరుదాంకితులైన అన్నమయ్య లాలిపాట మొదటిది. దాని ప్రభావం వల్ల గాని, లేదా వారే స్వతఃగా గాని రచించిన సారంగపాణి, త్యాగయ్యల లాలి పాటలలోని తారతమ్యాలు, భేద సాదృశ్యాలు గమనించడానికి చేసిన స్థూల పరిశీలన

యిది. ఇంకా సూక్ష్మాతి సూక్ష్మ పరిశీలన వివిధ దృక్కోణాల నుంచి చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది. అనాడు మాత్రమే ఆయా వాగ్గేయకారుల విశిష్టతలతో పాటు ప్రత్యేకతలతో పాటు వ్యక్తిత్వాలు సైతం స్పష్టం కాగలవు.

# అన్నమయ్య అధ్యాత్మిక చింతన

అన్నమాచార్యులు శృంగార, అధ్యాత్మ సంకీర్తనలు రచించి భక్తి, మధుర భక్తులను శృంగారముతోపాటు ప్రకటించి ఆధ్యాత్మికత, నీతి, వైరాగ్యాల్ని ప్రబోధించాడు. సర్వకాలాలకు సరిపడేలాగా ఉపదేశించాడు. ఆధ్యాత్మిక చింతనకి ఆయన అధ్యాత్మ సంకీర్తనలన్నీ ఉదాహరణలే.

హైందవ మతంలో ద్వైతాద్వైత, విశిష్టా ద్వైతాలు ముఖ్యమైనవి. వీటి కాచార్యులు మధ్వ, శంకర, రామానుజులు. సంక్షిప్తంగా ఈ మతాల లక్ష్యాలు - జీవాత్మ పరమాత్మలు ఎల్లప్పుడూ వేర్వేరని ద్వైతమత సిద్ధాంతం. జీవాత్మ పరమాత్మలకు దశాభేదమే గాని వస్తుతః రెండూ ఒక్కటే అన్నది అద్వైత మత సిద్ధాంతం. జీవాత్మ పరమాత్మలు ఒక్కటే ఐనప్పటికి శరీర శరీరి భావంతో వాటి సంబంధం కూడ వుంటుంది. శరీరి ప్రధానము, శాశ్వతము;శరీర మప్రధానము,అశాశ్వతము కనుకనే శరీరం శరీరిని ఆశ్రయించి ఉంటుందనివిశిష్టాద్వైత మతసిద్ధాంతం. ఇది శ్రీ రామానుజ సిద్ధాంతం. దీన్నే మనసా, వాచా, కర్మణా త్రికరణ శుద్ధిగా విశ్వసించి తదుచిత కృతిని అన్నమాచార్యులు శాశ్వతుడైన భగవంతునికై తన జీవితాన్నే కైంకర్యం చేసి తరించాడు. దాన్ని భగవద్భక్తిలో, రక్తిలో, ఆధ్యాత్మిక చింతనలో నీతి వైరాగ్య ప్రబోధంలో తన సంకీర్తన లన్నిటా నిరూపించి నిత్యుడయ్యాడు అన్నమాచార్యులు.

గురుభక్తి పురస్సరంగా భగవద్భక్తిని జ్ఞానమనే యజ్ఞంతో పోల్చి వైరాగ్య భావ పూరితంగా, అత్యంత మనోహరంగా, అలంకారిక శైలీ విన్యాసంతో ఆలపించాడు అన్నమాచార్యులు.

"జ్ఞాన యజ్ఞ మీగతి మోక్ష సాధన
నానార్థములు నిన్నే నడిపె మా గురుడు ||పల్లవి||

అలరి దేహమనేటి యాగశాలలోను
బలుపై యజ్ఞానపు పశువు బంధించి
కలసి వైరాగ్యపు కత్తుల గోసి కోసి
వెలయ జ్ఞానాగ్నిలో వేలిచె మాగురుడు ||జ్ఞాన||

మొక్కుచు వైష్ణవులనే మునిసభగూడబెట్టి
చొక్కుచు శ్రీపాదతీర్థ సోమపానము నించి
చక్కగా సంకీర్తన సామగానము చేసి
యిక్కువతో యజ్ఞము సేయించెటో మా గురుడు ||జ్ఞాన||

తదియ్యగురు ప్రసాదపు పురోడాశమిచ్చి
కొదదీర ద్వయమను కుండలంబులుపెట్టి
ఎదలో శ్రీ వేంకటేశునిట్లు ప్రత్యక్షముచేసె
యిదివో స్వరూపదీక్ష యిచ్చెను మా గురుడు ||జ్ఞాన||

(అధ్యా-1-148)

అందుకే ఈ సిద్ధాంతాన్ని వివరించాడీ సంకీర్తనల్లో —

"దేహము దా నస్థిరమట దేహి చిరంతను డౌనట
దేహపుమోహపు నేతలు తీరుట లెన్నడొకో"

(అధ్యా. సం. 1-136)

"ఓహో డేండేం వొగి బ్రహ్మ మిదీ యని
సాహసమున శ్రుతి చాటెడిని ||పల్లవి||

పరమును నపరము బ్రకృతియు ననగా
పెరపు దెలియుచె వివేకము
పరము దేవుడును అపరము జీవుడు
తిరమైన ప్రకృతియె దేహము ||ఓహో||

జ్ఞానము జ్ఞేయము జ్ఞాన గమ్యమును
పూని తెలియుటే యోగము
జ్ఞానము దేహాత్మ జ్ఞేయము పరమాత్మ
జ్ఞాన గమ్యమే సాధించు మనసు ॥ఓహో॥

క్షరము నక్షరమును సాక్షి పురుషుడని
సరవి దెలియుటే సాత్త్వికము
క్షరము ప్రపంచ, మక్షరము కూటస్థుడు
సిరి పురుషోత్తముడే శ్రీ వేంకటేశుడు ॥ఓహో॥

(అధ్యా. సం. 1-396)

దీన్ని మరింత సుస్పష్టం చేశాడు అన్నమాచార్యులు—

"దేహి నిత్యుడు దేహము లనిత్యాలు
యీహల నా మనసా ఇది మరువకుమీ ॥పల్లవి॥

గుది పాతచీరమాని కొత్తచీర గట్టినట్టు
ముదిమేను మాని దేహి మొగి గొత్తమేను మోచు
అదన జంపగ లేవు ఆయుధము లితని
గదిసి యగ్నియు నీరు గాలి జంపగలవు ॥దేహి॥

ఈతడు నరకు పడ డీత డగ్నిగాలడు
ఈతడు నీటమునుగ డితడు గాలిబోడు
చేతనుడై సర్వగతుండౌ చెలియించదేమిటను
యీతల ననాది యీత డి రవు గదలడు ॥దేహి॥

(అధ్యా. సం. 7-185)

ఇది భగవద్గీతలోని శ్రీకృష్ణుని వాక్యాల్ని యథాతథంగా నిరూపిస్తుంది.

"వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి,
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ"

"నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతిపావకః
నచైనం క్లేదయ న్త్యాపోనశోషయతి మారుతః"
"అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్యఏవచ
నిత్య స్సర్వగతఃస్థాణు రచలోఽయంసనాతనః"

(భగవద్గీత. 1-22, 23,24)

ఈ శ్లోకాల భావాన్ని అత్యంత సులభరీతిలో చక్కటి తెలుగు పలుకుల్లో మనోహరంగా వర్ణించాడు అన్నమాచార్యులు.

పై క్రీతిని వివరిస్తూ అన్నమాచార్యులు ఆ భగవంతుని భజించాడు. ఈ విషయాన్నే వేనోళ్ళ కొనియాడుతూ అన్ని సంకీర్తనల్లోను ఆడిపాడి తరించాడు.

ఉదాహరణకు :

"పాడేము నేము పరమాత్మ నిన్నును
వేడుక ముప్పది రెండు వేళల రాగాలను ॥పల్లవి॥

తనువే వొళపు తలయే దండెకాయ
ఘనమైన భూర్పులు రెండు కట్టిన తాళ్ళు
మనసే నీ బద్దికాడు మరి గుణాలే జీవాళి
మొనసి పుట్టుగే మూలమైన కరడి ॥పాడేము॥

(అధ్యా. సం. 9-178)

"నిత్య పూజ లివిగో నేరిచిన నోహో
ప్రత్యక్షమైనట్టి పరమాత్మునికి ॥పల్లవి॥

తనువే గుడియట తలయే శిఖరమట
పెను హృదయమే హరి పీఠమటా
కనుగొన చూపులె ఘనదీపము లట
తన లోపలి యంతర్యామికిని ॥నిత్య॥

(అధ్యా. సం. 6-82)

"గుఱ్ఱాల గట్టని తేరు కొంక కెందైనా బారీ
విఱ్ఱవీగుచు దీనిని నేడుకతో జీవుడు ॥పల్లవి॥

సరిపిరుదులే రెండు జంట బండి కండ్లు
సరవితో బాదాలు చాపు నొగలు
గరిమ జూపులు రెండు గట్టిన పగ్గములు
దొరమై దేహ రథము దోలిబో జీవుడు ॥గుఱ్ఱా॥"

(అధ్యా. సం. 6-152)

శరీరాన్ని వీణగా, గుడిగా, రథంగా ఊహించి తదుచితరీతిని భగవంతుని మహిమాన్వితమూ, శాశ్వతమూ ఐన గుణాన్ని ఆడిపాడుకొన్నాడు అనేక విధాల అన్నమాచార్యులు.

అన్నమాచార్యుల ఆధ్యాత్మిక ప్రతిపత్తికి ఎన్నైనా ఉదాహరణ లివ్వవచ్చు. మచ్చుకు ఒకటి రెండు సంకీర్తనల్ని సమాలోచిస్తే ఈ విషయం స్పష్టమౌతుంది.

"పోయగాలం బడవికి గాయుపెన్నెల కరణిని
శ్రీయుతు దలచడి నరులు మాయబడిచెడక ॥పల్లవి॥

చిత్తము చేమూరుచుకొని చిత్తైకాగ్రతను
చిత్తజ గురుని దలచుడి చిత్తజుజోరనీక ॥పోయ॥

బూరుగు మాకున బొందిన కీరము చందమున
ఆరయ నిష్ఫలమగు మరియన్యులజేరినను ॥పోయ॥

కూరిమి మా తిరు వేంకటగిరి గురుశ్రీపాదములు
చేరిన వారికి భవములు చెందవెపుడునటుగాన ॥పోయ॥

(అధ్యా. సం. 1-194)

కాలం వృథాగా పోతున్నదనీ, అలాకానీక భగవంతుని ఎల్లవేళలా స్మరించమని ప్రబోధిస్తున్నాడు. ఇలానే

"పోరాకపోయి తలపున నున్న దైవంబు
జేరనొల్లక పరుల జేరదిరిగెదము ॥పల్లవి॥

వడిబారు పెనుమృగము వలలోపలదగులు
వడి పెడల గతిలేక వడకుచున్నట్లు
చెడని కర్మములలో జిక్కి భవములబాధ
బడిపొదముగాక యే పనికి దిరిగెదము ||వోరా||

నీరులోపలి మీను నిగిడి యామిషముకై
కోరి గాలము మ్రింగి కూలబడినట్లు
జారిపోయిన నేల సంసార సౌఖ్య వి
కారంపు మోహముల గట్టు వడియెదము ||వోరా||

శ్రీ వేంకటేశు నాశ్రిత లోకరక్షకుని
భావింప దేవతాపతియైన వాని
సేవించు భావంబు చిత్తమొదబడక నే
మీవలావలి పనుల నిట్ల దిరిగెదము ||వోరా||

(అధ్యా. సం. 1-331)

భగవన్నామ స్మరణమేగాని తదితరం కొరగానిదని, దానికి తగిన రీతిలో నడచుకొన్నప్పుడే ముక్తి అని, లేకపోతే అన్ని కష్టనష్టాలనీ ఎన్నో ఉదాహరణలతో నిరూపించాడు; ఆధ్యాత్మిక చింతనను ఉపదేశించాడు.

ఇలాగ అన్నమాచార్యులు తన జీవితమంతా ఆధ్యాత్మిక చింతనతో భగవంతుడైన శ్రీ వేంకటేశ్వరునికే మీదు కట్టిన భక్తాగ్రేసరుడు. ఆయన చూపిన ఆ ఆధ్యాత్మిక చింతనా మార్గం సర్వజనానుసరణీయం.

# అన్నమాచార్యుల అపురూపభావాలు - ప్రయోగాలు

1.0 తెలుగు సాహిత్యంలో తాళ్లపాక అన్నమాచార్యులు (1408-1503) పదరచనకు ఆద్యుడు. సర్వశ్రేష్ఠుడైన వాగ్గేయకారుడు. ఆయనకు పదకవితా పితామహుడు అని సంకీర్తనాచార్యుడని బిరుదులున్నాయి. తెలుగు సాహిత్యంలో అన్నమాచార్యుల తోనే పదకవితకు ప్రాశస్త్యం వచ్చింది. అంతేకాదు అన్నమాచార్యులే పద్యకవితతో సమానమైన పట్టంగట్టి ఉత్తమ వాగ్గేయకారుడుగా ప్రసిద్ధికెక్కాడు. వాగ్గేయాల

రెండింట సమగ్ర ప్రావీణ్యం గలవాడు వాగ్గేయకారుడు. అలాగా అంటే ధాతు మాతువుల సంప్రయోగంలో దక్షుడు అన్నమాచార్యులు. పద్యానికేగాని పదానికి ప్రాముఖ్యం లేనికాలంలో పామర ప్రజానీకంలో బహుధా ప్రచారంలో- అనిబద్ధమై ఉన్న జానపదగేయకృతికి నిబద్ధత చేకూర్చడమేగాక, పద్యంతో సమానమైనగౌరవ ప్రతిపత్తిని పదానికి చేకూర్చిన మహనీయుడు అన్నమాచార్యులు. తిరుమలపై వెలసిన శ్రీ వేంకటేశ్వరునిపై ముప్పైరెండువేల అధ్యాత్మ శృంగార సంకీర్తనలుభక్తితో రచించి ఆడిపాడిన మహిమాన్వితుడు అన్నమాచార్యులు.

**1.1** అలాంటి అన్నమాచార్యుల పదాలలోని అపురూప భావాలు, అపురూప ప్రయోగాల సంక్షిప్తంగా వివరించడమే నాయీ వ్యాసప్రయోజనం. అపురూప పదానికి గల నైఘంటికార్థం చూపించి అన్నమాచార్యుల పవాలలో - ఇతర పదకర్తల్లోనేగాదు పద్యకవులలో సైతం కనిపించనివి- కోకొల్లలుగా కనిపించే అపురూప ప్రయోగాల్ని సోపపత్తికంగా నిరూపించడం నాయీ వ్యాసంలోని ప్రయత్నం. తన్మూలాన పద్యకవులలో కూడా కనిపించని ప్రత్యేకమూ, వింత అయిన భావాల, ప్రయోగాల వల్ల అన్నమాచార్యుల వైశిష్ట్య వివరణ నాయీ వ్యాసంలోని విశ్లేషణ. దానితో అన్నమాచార్యుల ప్రతిభా పాండిత్యాల ఔన్నత్య ప్రకర్షలు విస్పష్టమై ఆయన ప్రత్యేకత విదితమవుతుంది.

**2.0** అన్నమాచార్యుల పదాలలోని అదురూప భావాలు, ప్రయోగాల గురించిన విశ్లేషణ చేసే ముందు, ఆ పదాల అర్థ స్వరూపాలను తెలుసుకోవడం అవసరం. వాస్తవానికి ఏ ఇతర కవులలోను కనిపించని ప్రత్యేకత అన్నమాచార్యుల భావనలో, పదప్రయోగంలో ఉన్నదని అర్థం. అపురూపమైన భావన చేయడమూ, అపురూపమైన ప్రయోగాల్ని ప్రయోగించడమూ అన్నమాచార్యులకుఅబ్బిన అపురూపమైన విశిష్టమైన విద్య. ఆయా అపురూప భావాలను, ప్రయోగాలను పరిశీలించినప్పుడు అన్నమాచార్యుల ప్రతిభా సంపద, పాండిత్య ప్రకర్ష సర్వవిద్వల్లోక ప్రశంసకు పాత్రమవుతుంది.

**2.1** అపురూపం అనే పదానికి సూర్యరాయాంధ్ర నిఘంటువు అపూర్వమనీ, వింత అయినదనీ అర్థాలనిస్తుంది. అలాగే శబ్దరత్నాకరం అపూర్వమనే అర్థాన్నిచ్చి దానికి లక్ష్యంగా కళాపూర్ణోదయంలోనిపద్యం ఉదాహరించింది.

"పీణియ ముట్టుటల్ మిగుల వింతలు, పెంపుడు
జిల్కబోదతో
రాణ దలిర్ప బల్కుటకరంబపురూప, మపూర్వ
మెంతయున్
బ్రాణ సఖీ రహస్యముల బ్రాతియు గ్రీడలు కానివాని, యా
యేణ విలోలలోచనకు హెచ్చిన మన్మథ
చేష్టలయ్యెడన్"

(కళా. 6. 217)

ఇది మధురలాలస మదనావస్థా సందర్భంలోని పద్యం. ఇక్కడ కవి అపురూప పపూర్వమని పునరుక్తి ప్రయోగం చేయడం మధురలాలస మదానావస్థ ద్విగుణీకృతమైన తీరును తెలుపడానికే నన్న విషయం స్పష్టమవుతుంది. ఇందులో వింత అనీ, అపూర్వమనీ మనం రెండర్థాలు సైతం గ్రహించనూ వచ్చు. ఇలాగే సూర్యరాయాంధ్ర నిఘంటువులో పై పద్యంతో తోపాటు పాండురంగ మాహాత్మ్యం లోని పద్యం మరొకటి ఉదాహరించబడింది.

"ముత్తియముల్ ప్రవాళదళముల్ గన నాకృతి
గూడినట్టులై
క్రొత్తగ నొర పీని యపురూపపు రూపిదియంచు
విస్మయో
దాత్త మనస్కులై సకల తైర్థికులుంగొని యాడ....
........................................

(పాండు. 5. 285)

ఇందులోను అపూర్వమూ, వింత అనే రెండర్థాలు స్పష్టమవుతున్నాయి.

ఇంతేగాదు అపురూపమనే పదప్రయోగంపై అర్థాలు వచ్చేట్టు అన్నమాచార్యుడే ప్రయోగించాడు.

"అపురూపమైన మోహము దాచి యిటువంటి
కపటపు నటనము గడియించనేలే ॥పల్లవి॥

కిన్నెరకాయల బోలు కిక్కిరిసినట్టి గుబ్బ
చన్నులపై నునుగొంగుజారగా
కిన్నెర మీటుచు మంచి సన్నపు నడపుకో
కన్నులు చేలగ మేను కదిలించేవేలే ॥అపు॥

(12.128)

2.2 పై విధంగా అపురూప శబ్దానికి అపూర్వమూ, వింత అనే అర్థాలు తెలుసుకొన్నాక, అన్నమాచార్యుల సంకీర్తనల్లోని భావాలు, ప్రయోగాలు ఎంత వింతగా, ఎంత అపూర్వంగా ఉన్నాయో తెలుసుకోవడం అవసరం. తెలుసుకొంటే అన్నమాచార్యుల ప్రతిభా పాండిత్యాల విదగ్ధతను వివరింప వీలవుతుంది.

## 3.0 అపురూప భావాలు - ప్రయోగాలు :

అన్నమాచార్య సంకీర్తనల్లో అపురూపాలు అయిన భావాలు ప్రయోగాలు కలిసి మెలసి వుంటాయి ఒకే పదంలో. అవి అతని భావనా వైదగ్ధ్యానికి,పాండిత్య ప్రకర్షకు నిదర్శనాలు. ఒక చక్కటి ఉదాహరణ :

"వలపారగించవమ్మ వనిత నీ
యలుక చిత్తమున కాకలి వేసినది ॥పల్లవి॥

అడియాసలనే పక్వమైన సోయగపు
పెడయలుకలు మంచి వేడి పేడి రుచులు
ఎడసేసి తాలిమి నెడయించి పైపై నె
వొడమిన తమకంపు బోనము వెట్టినది ॥వల॥

ఆమంచి మధురంపు అధరామృతముల
కేమారు దావులు చల్లు వెన్నెల బయటను
కోమలపు దరితీపు కోరిక గుమ్మరించి
భామకు పూబానుపు పళ్లెము వెట్టినది ॥వల॥

కన్నుల కాంక్షలనెడి కళవళము దీరె
సన్నపు నవ్వులనెడి చన వగ్గలించెను
అన్నువపు మరపు నీకంతనింత గలిగెనే
డిన్నియును దిరు వేంకటేశుని మన్ననలు (12-25) ॥వల॥

చెలికత్తె నాయికను నాయకుడైన శ్రీ వేంకటేశ్వరునితో శృంగారానుభూతిని పొందు మని ఉద్బోధిస్తోందీపదంలో. ఇందులోని భావనాశక్తి అనన్యసామాన్యమేగాదు, అనుపమానం. అందుకే ఇది అపురూపమని పేర్కొనడం. ఆ భావనా పటిమకు తగిన రీతిలో ప్రయోగాలు సైతం అపురూపంగా తమంత తామే వచ్చి పదంలో కుదిరిపోవడం గమనించగలం. "వలపారగించవమ్మ, నీవలపు చిత్తమున కాకలి వేసినది, మంచి వేడి వేడి రుచులు, తమకంబు బోనము వెట్టినది. పూబానుపు పళ్లెము పెట్టినది" అన్నవి అపురూప ప్రయోగాలు. "వలపారగించడం, వలపు చిత్తానికి ఆకలి వేయడం, వేడి వేడి రుచులు, తమకంబు బోనము పెట్టడం, పూబాను పళ్లెము పెట్టడం" అనే ప్రయోగాలు అన్నమాచార్యుల భావనా వైశిష్ట్యానికి, తదుచిత ప్రయోగ నైపుణ్యానికి చక్కటి ఉదాహరణలు. ఇలాంటి అపురూపభావాలు, ప్రయోగాలు అన్నమాచార్యుల సాహిత్యమంతటా గోచరిస్తాయి.

## 3.1 అపురూప భావాలు :

మచ్చుకు కొన్ని అన్నమాచార్యుల అపురూప భావాలు పరిశీలిస్తే ఆయన భావనాశక్తి విదితమవుతుంది

"ఎక్కువ నామేని జవ్వాదిందరు దెలిసేరంటా
మిక్కిలి నీ మేని తావి మెరయించేవు
చక్కని వేంకటగిరిస్వామి నన్ను గూడితివి
గక్కున నా చూపు నీకు గావలి పెట్టింతునా."

(12.81)

నాయిక నాయకునితో అంటున్న మాటలు. "గక్కున నా చూపు నీకు గావలి పెట్టింతునా ?" అని నాయిక అంటుంది. తన చూపుల్నే నాయకుని కావలిగా పెట్టుదునా ? అని ప్రశ్నిస్తుంది. ఇలాంటి భావం ఇతర కవులలో ఎక్కడా మనకు కనిపించదు. ఇది అన్నమాచార్యుని అపురూప భావానికి మరో మచ్చుతునక. ఇంకా

మరికొన్ని: 'కన్నుల మొక్కకుపే' (12-83), 'కుమరు గదలని నాగుబ్బలు' (12-86), 'చిరునవ్వు నిప్పులు' (12-90), 'నిట్టూర్పు టెండలు' (12-203), 'మొగమున కెగిరెడి మొనవాడి గుబ్బలు' (12-261), 'మోహపుటాకటికి'(12-321) 'ఉప్పతిల్లు జెమటల నోలలాడంగా మేను', నిప్పువలెనున్నదిట్టినెయ్యమెందు గలదా? (12-428), 'చలి వేడి చూపుల బాణవట' (12-329), 'పేడుకతో సంగీతము విని కన్నుల మెచ్చను' (12-349), 'చూచక చూచిన చూపుల చొక్కెడి చందములు' (12-349), 'వాకి కుచములు' (12-378), 'ముంగిటి సిగ్గులు పెద్ద మోపాయంగ డనే' (3-556). 'కలికి అదిగో కన్ను గిరిపిని బొలుపు తామరలచే పూజచేసినట్లు' (3-649), 'పుండుగాగ చిత్తమెల్ల నొక్కచేసిలివి' (3-29), 'రతి జవ్వమార గించి' (3-547), 'వలపెల్లా చిల్లారం పెట్టి వళచూనపె' (3-146), 'వాములైన వలపుల నీపై/భామరో వట్టికి బారీ బాప్కె' (22-108), 'చేటడేసి పన్నిదేరేసిగ్గులు నీపై జల్లె' (22-445), 'మొలక పెన్నెలలు మోసులెత్తె నేటికే' (22-456), 'కొండవంటి సంతసాన' (22-184), 'కంపెపు మోవిచ్చిహరె (22-407), పువ్వు వంటి కోరికతో బొద్దు గడపరాదా' (22-439), కారపు వలపు చల్లిగానీపే యింక' (22-'79), 'పూవు వంటిది వయసు భోగించ వలెగాక' (22-461), 'నిప్పువంటి విరహము నీకేలే' (22-461), 'కొండవంటి కోపము నీకేలే' (22-461), 'ప్రియములేని మాట పెదవికి సంగరము' 'కారణములేని నవ్వు కను చూపులకొలది; (26-128), 'మానువలెనిగిరించె మాటలకే మేను' (26-185), 'తుమ్మెదవంటి బొమ్మలు తోడముడిపెట్టికుపే' (26-255), 'పొగరు తనకుచగిరులు బొడవాయ' (26-275), 'మోపులుగా నూటగట్ట సేసిని, కన్నుచూపు మెఱుగుల గంపగమ్మి నన్ను నిట్టె' (26-276), 'చిగురుల మాటలు చిల్లులువోయను, కారపు జూపుల కాలువ లాయను' (26-279), 'కంచు వంటిది పలపు గాలి వంటిది వయసు' (26-418), 'పన్నీరు వంటి మోహాము: చిగురు వంటి ప్రియూన' (26-419), 'పూవువలె భోగించితే పుణ్యము పేరుచు' (26-517), 'కన్నుల గానుకుండితి కదిసి నీ మాటలకు' (26-557), 'వాసులుగా నందరికీ వరము రాసగును'(26-558), 'కన్నులని మొక్కాగా రాదని తోసేవా' (26-587), 'మోపులుగా జవ్వనము మూట గట్టుకొన్నదానా' (24-392), 'వలపుల దిష్టిదాకి వాడి పున్నది నీ మోము'(24-503), 'పొదలుజన్నుల నెంత పూచి తుదిమేనే' (24-555), 'చెక్కులపెచెమరించె చిత్తమెల్లా జిగురించె, (25-239), 'చెలిసు సూచిన పూపు చీకటిలో వెన్నెల

(25-244), పడతి మేనిచాయ బంగారులోని నిగ్గు (25-244), జలజాక్షి కోరికలు చనువగ రాసులాయ (25-301), వేడుకరు వెలలేదు, వెన్నెల కెంగిలిలేదు(27-7), తొయ్యలి మోమే దొంతి బోనము (27-13), ఘొంచిన కెమ్మోవినేబువ్వపు విందు పెట్టితి (2-40), జంటల యూరతులాయ చల్లు జూపులు (28-247) దొంతిపెట్టి వల పేల తూరుపెత్తేవే (28-406), చింతకాయ కజ్జాయాలు చెప్పరాని వలపులు (28-4889), పూపలై వసంత కాలపు చిగురులు రతులు (18-288), కారుకమ్మిన పంటలు కాంతల వలపులు (27-492), సిగ్గుల మూటగట్టి (29-48), మాటల దేనెలుగారీ మలసితే సిగ్గుదేరీ/తేటలై కనుచూపులు దెల్లవారీ (29-89), మాయల నీ నవ్వులివి మచ్చుమేపుల వంటివి, (294-24), చొక్కపు నీమాటలు రొంపిలోని కంబాలు (29-477), వెలలేని వలపుల వేటకాడవు నీపై తే (29-517), ఎదురు చూచిన చూపు దొంతులై (30-42), తీగనవ్వు నవ్వేవు (30-171), పున్నమ వెన్నెల బొన్సపూచి కుప్పనేతురా (30-351), పువ్వువలె నీకుగానే పూనుక వచ్చిన దాన (30-509), వలపు చద్ది గట్టుక వచ్చితివి (30-592), అన్నిటా రతిసంబళా లందుకొంటివి (30-392), నానవెట్టి ముసిముసి నవ్వులు నవ్వి నాపె (31-16), గద్దించి నేరుపులెల్లాగాదె బోయవచ్చునా (వచ్చునా (31-138), వయసు మొగిలు వంటిది వట్టి జాగేల (31-252), చక్కని నవ్వులు సానరాయినే (31-363), ఇద్దరి మోహరసము లేరులై పారజొచ్చె (31-377), శిరస్సు వంచి నవ్వుల సిగ్గులు కాను కలిచ్చే, సరసతలను చేయిచాచరాదా (31-288). ఇంతలో విచారము లిట్టుండెను. పంతాలు దున్నక ముందే పంట పండెను (31-328), పాలమీది మీగడ పాయము లోని మదము (31-332), సతుంకు జలము జవ్వనపు బొలము (31-385), ప్రియములు రాసి వోసి బేరమాడినదివో (31-448), సానబట్టేవు చూపులు సమర తులెట్టివో (31-469),

"జలజాక్షితో నీవు సరసము లాడగాను
చెలరేగి చెక్కులెల్ల జెమరించెను
మొలక చన్నులు నీవు ముట్టితే గనుక ఇక
వలపెల్ల జడివట్టి వానలై కురియవా ?" (31-477)

ఇలాగా ఎన్నైనా ఉదహరించవచ్చు.

## 4.0 అపురూప ప్రయోగాలు ;

ఇతఃపూర్వమే అపురూప భావాలతో పాటు అపురూప ప్రయోగాలు సైతం కొంతవరకు చవిచూచాము. వాటికి సంబంధించి మరికొంత విపులంగా తెలుసుకొందాం. తద్వారా అన్నమాచార్యుల అపురూప పద ప్రయోగ వైలక్షణ్యం విశదం కాగలదు.

4.1 ఇంతకు ముందుగానీ ఆ వెనుకగానీ ఇతర కవులెవ్వరూ అన్నమాచార్యుల లాగా ప్రయోగాలు చేయలేదనడంలో అత్యుక్తిలేదు. అందుకే అవి అపురూప ప్రయోగాలు అయ్యాయి.

కొన్ని ఉదాహరణలు : లేత మాయలు, పూత పూత సిగ్గులు, యాతవలపు (12-85), కొప్పెర గుబ్బల గొల్లెత (12-92), పచ్చిచూపులు(12-101), నిట్టూర్పు టెండలు (12-203), మోహపు టాకటికి (12-321), కన్నులమెచ్చుచు(12-390) వాడికుచములు (1 -358), చల్లకు నవ్వు (3-218), వలపు చల్లిని (3-46), కడునవ్వుల వాములు (21-246), తీగలు సాగెను తీరని వలపులు (22-266), పేరెను పైపై ప్రియముల వలపు (22-266), పువ్వు వంటి చెలి (26-106), వెన్నెల సెలవితోడ (26-284), కుప్పళింపచేవలపు (26-342), వెన్నెలవలపు (26-303), కంచెపు మోవి యిచ్చి కన్నులనే నవ్వనవ్వి (26-414), కంచు వంటిది వలపు గాలివంటిది వయసు (25-418), పన్నీరు వంటి మోహము, చిగురు వంటి ప్రియాన (26-486), పెగ్గళించి మోవి తేనె విందు వెట్టరాదా (26-582), కన్నులగాను కుండితి కదిసి నీ మాటలకు (26-557), కన్నుల నీవుమొక్కగా కాదని తోసేనా (26-587), మగువ కన్నుల మొక్కె మనసున దీవించు (24-378), మోపుగా జవ్వనము మూట గట్టుకున్నదానా (24-292), నానబెట్టి సెలవుల నవ్వు నీ ముందరబోసి (24-462), పలుచని సిగ్గుతోడ (25-39), వలపులు వాడుకొని వడ్డికిచ్చేవా (25-72), చెలియ చూచిన చూపు చీకటిలో వెన్నెల (25-234), పడతి మేనిచాయ బంగారులోని నిగ్గు (25-244), వలపుల పంటలు, తమ

కపు కొటారులు, వదన సామ్రాజ్యము (25-246), వెన్నెల నవ్వు నవ్వి వేడి సిగ్గు రేచితి (25-397), కుంగకుండే యిటువంటి కుచముల కొనలను (27-61), పూవు వంటి మతిదాన (27-62), వలపు వలువదీసి (27-115), దొంతి వెట్టిన నవ్వులెల్లా (27-185), మేడిపంటి బోనమిది (27-192). నా మోవిపొత్తు (27-373), ములు వాడి చన్నులు మోము కెగురు (28-212), దొంతివెట్టి వలవేల తూరు పెత్తేవే (28-406), వలపులు వేడి వేడి (28-489), కారు కమ్మిన పంటలు కొంతల వల పులు (28-492), కొండవంటి మగవాడు (28-495), తీగ సాగిన మోహామే (28-498), వెలలేని వలపుల వేట కాడవు (29-517), రతి సాములు (28-524), తలపోత యేరులు (29-536), పొంతి పులకలు (29-556), ఎదురుచూచిన చూపులు దొంతులై (30-42), కుచాలు దలెత్తి చూచి (39-132), వాములు పూరు పులకు (30-188), కానుక వెట్టెను చనుగవ సీకును (31-146).

ఇలాంటి అపురూప ప్రయోగాలు అన్నమాచార్యుల సాహిత్య మంతటా ఆకగడుగునా ప్రత్యక్షమై ఆనంద నిష్యందులై సహృదయులను రంజింప చేస్తాయి.

5.0. ఇలాగా అపురూప భావాలు, తత్ప్రయోగాలు గల పదాలు అన్నమా చార్యుల సాహిత్యంలో ఎన్నో ఉన్నాయి. అలా రెండు సమ్మిళితమై అన్నమా చార్యుల ప్రతిభా పాండిత్య ప్రకర్షల్ని స్పష్టీకరించి, అతని విశిష్టతను వివరిస్తాయి. మచ్చుకో ఉదాహరణ :

"అతని కొక్కటివే నీవాల పై తివా
సతులందరును నీసాటివారే కారా ॥పల్లవి॥

గాదె దోసుకొనే వేమే గంపముంచి వలపులు
పోదిచ్చిసి రమణుని పొంత నీవుండి
పాదుసేసి విత్తేవేమే పదనుతో నీసిగ్గులు
ఆదిగొని చన్నులు పయ్యద గప్పికప్పి ॥అతని॥

పెదచల్లేవేమే పెన్నెలవంటి నవ్వులు
కొదదీర నీతని కొలువునను
తుద విచారించే వేమే తొంగి తొంగి నీ చూపులు
ఛెదరిన నీకొప్పు చేత బెట్టుకొంటాను ॥అతని॥

వాడి గట్టుకొనే వేమే పుబ్బరి సంతోసాలు
కడగి శ్రీ వేంకటేశు కౌగిట గూడి
నడుమ నీవది యేమే నన్ను నీత డిపుడేలె
అదరి యలమేల్ నౌత నీ వెఱ్ఱగవా" ॥అతని॥

(29.37)

ఈ పదంలో నాయికతో తదితర నాయికలు అంటూన్న మాటలు. నాయకుడు దక్షిణ నాయకుడు. అందుకే అనేక నాయికలు. ఇక్కడ పదంలోని భావాలు, ఆ భావాల్ని వ్యక్తీకరించిన తీరు అపురూపమూ, అద్భుతమూను; అనంతానంద దాయకమూను. అపురూపమైన భావాలు : గాదెబోసు కొనేనేమే గంప ముంచి వలపులు, పాదు వ్వసి విత్తేవేమే పదనుతో నీ సిగ్గులు, పెదజల్లేవేమే వెన్నెల వంటి నీ నవ్వులు, తుదబచారించేవేమే తొంగి తొంగి నీ చూపులు, వాటిగట్టుకొనే వేమేపుబ్బరి సంతోసాలు అనేవి. అందుకు తగిన రీతిలో ప్రయోగించడంలో అనల్ప శిల్పకళా నైపుణ్యం స్పష్టమవుతూంది. తద్వారా అన్నమాచార్యులు పదకవితాపితామహుడు గానేకాక మహా సాహిత్య శిల్పిగా మనకు ప్రత్యక్షమవుతాడు. అనంతాంధ్ర సాహిత్యంలో అమరుడై నిలిచిపోయాడు అన్నమాచార్యులు.

# అన్నమాచార్య సంకీర్తనల్లోని జానపద ధోరణులు

అన్నమాచార్య సంకీర్తనల్లో జానపద ధోరణులు వ్యక్తం కావడంలో ఆశ్చర్యం లేదు. జానపద సాహిత్యం ఏ సాహిత్యానికైనా అనాది. పునాది. తెలుగులో సైతం జానపద కవిత్వం అతి ప్రాచీనమే. కానీ దాన్ని అభిమానించి ప్రోత్సహించి, భద్రపరచినవారు లేక పోవడం వల్ల ఆనాటి జానపద రీతులేమిటో తెలియదు. ఈ నడుమనే జానపద విజ్ఞాన జిజ్ఞాసువులూ, పరిశోధకులూ అప్పటి వరకూ కాలగర్భంలో కలసి పోయినదిపోగా మిగిలిన, జానపద సంబంధి సమస్తమూ సేకరించి భద్రపరచనారంభించారు. పాల్కురికి సోమనాథుడు, నన్నెచోడుడు పేర్కొన్న ఆచూకీలను బట్టి అనాదినుంచి జానపదగేయ రీతులుండేవని తెలుస్తుంది. జానపద కవి కాకృతుల్ని నిబద్ధం చేసిన అన్నమాచార్యుల పదాల్లో ఎన్నో జానపద

ధోరణులు కన్పించడం సహజమైన అంశం. అలాంటి అన్నమాచార్యుల పదాల్లోని జానపద రీతుల్ని క్రమంగా తెలుసు కొందాం.

**మేలు కొలుపులు :** మేలుకొలుపు దేవతోద్దిష్టం. కానీక్రమంగా తల్లులు తమ పిల్లల్ని మేలుకొల్పడానికి, దేవతల్లా భావించి మేల్కొలుపుతారు. 'మేలుకో' అనే పదం ఆవృత్తి అవుతుంది. సామాన్యంగా దేవతల్ని ప్రాతఃకాలం లో వారి లీలావిలాసాలను వర్ణిస్తూ మేలుకొలుపు పాటల్ని పాడతారు. పూర్వం ప్రభాత సమయంలో రాజుల్ని వందిమాగధులు మేల్కొల్పుతూ రాజస్తోత్రాలుకూడా చేసేవారు.

"మేలుకో శృంగార రాయ మేటి మదనగోపాల
మేలుకో నాపాలముంచిన నిధానమా ॥పల్లవి॥

సందడించే గోపికల జవ్వన వనములోన
కందువన్ దిరిగే మదగజమవు
ఇందుముఖి సత్యభామ హృదయ పద్మములోని
గంధము మరిగినట్టి గండు తుమ్మెదా ॥మేలుకో॥

—ఈ సంకీర్తనంలో 'మేలుకో' అనే పదం ప్రారంభంలో ఉంది. మరికొన్ని సంకీర్తనల్లో 'మేలుకో' అనే పదం తర్వాతి చరణాల అంతంలో ఉంటుంది,

"విన్నపాలువినవలె వింత వింతలు
పన్నగపు దోమతెర పైకెత్తవేలయ్యా ॥పల్లవి॥

తెల్లవారె జామెక్కె దేవతలు మునులు
అల్లనల్లనంతనింత నదిగో వారే
చల్లని తమ్మిరేకుల సారసపు గన్నులు
మెల్ల మెల్లనవిచ్చి మేలుకొనవేలయా ॥విన్న॥

—ఇక్కడ పన్నగపు దోమతెర అనడంలో అన్నమయ్య భావనాశక్తి ప్రస్ఫుట మౌతున్నది.

**రోకటి పాటలు :** రోకళ్లతో రోళ్ల వద్ద చేరి స్త్రీలు ధాన్యాన్ని గాని, కాయధాన్యాన్ని గాని దంచుతూ పాడే పాటల్ని రోకటిపాట లంటారు. ఈ సమయంలో స్త్రీలు తమ శ్రమనుమరిచిపోవడానికి 'ఇస్‌ఇస్' అనే ధ్వనుల్ని చేస్తారు. వీటిని సువ్వి పాటలని అంటారు. పెళ్లి సమయంలో కొట్నాలు దంచుతూ ఈ పాటలు పాడతారు. వాస్తవానికివి శ్రామిక గేయాలు. స్త్రీలు తాము చేస్తున్న పనికి ఒక రకమైన ఊపును, శక్తిని తెచ్చుకోవడానికిపాడే ఈ పాటల్లో ఒక ప్రత్యేకమైన లయ ఉంటుంది.

సువ్వి సువ్వి సువ్వని
సుదతులు దంచెద రోలాల ॥పల్లవి॥

వనితల మనసులు కుందెన చేసిటు
వలపుల తగ నించోలాల
కనుచూపులనెడు రోకండ్లను
కన్నెలు దంచెద రోలాల ॥సువ్వి॥

బంగారు చెరఁగుల పట్టు పుట్టములు
కొంగులు దూలఁగ నోలాల
అంగన లందరు నతిపేడుకతో
సంగడి దంచెద రోలాల ॥సువ్వి॥

కురులు దూలఁగ మంచి గుబ్బచన్నులపై
సరులు దూలాడగ నోలాల
అరవిరి బాగుల సతిపలు ముద్దులు
గురియుచు దంచెద రోలాల ॥సువ్వి॥

ఘల్లు ఘల్లు మని (ను) కంకణరవములు (ల)
పల్లవపాణులకో (నో) లాల
అల్లనసనడుములు అసియాడుచు నతు
లొల్లనె దంచెద రోలాల ॥సువ్వి॥

కప్పుర గందులుకమ్మని పువ్వుల
చప్పరములలో నోలాల
తెప్పలుగా రతిఁదేలుచుఁగోనే
టప్పనిఁబాడెద రోలాల ॥సువ్వి॥

(12-353)

....స్వభావోక్తిలో సాగిన ఈ సంకీర్తనసహృదయుల కన్నులకు గట్టినట్లు అత్యంత మనోహరంగా ఉన్నది.

ఇలాంటిదే వేరొక సంకీర్తన. శ్రీకృష్ణ జనన విశేషాన్ని వివరించే కీర్తన ఇది.

"సువ్వి సువ్వి సువ్వాలమ్మ
నవ్వుచు దేవకినందను గనియె ॥సువ్వి॥

శశివొడచె అలసంబులుగడచె
దిశల దేవతల దిగుళ్ళు విడిచె
కావిరి విరిసె కంసుడుగినిసె
వావిరిఁబువ్వుల వానలు గురిసె ॥సువ్వి॥

(22-361)

....శ్రీకృష్ణుని జననంతో దేవతల దిగులు తొలగిపోయి పువ్వుల వానలు కురిశాయని సంతోషంతో స్త్రీలు రోళ్ల దగ్గర చేరి పాడిన ఈ పాట అలతి అలతి పదాలతో సాగిపోయింది.

**అల్లోనేరేళ్లు :** అల్లోనేరేళ్ల అనే పదాలు రాత్రి సమయాల్లో వెన్నెల్లో ఆడపిల్లలు పాడుకొంటారు. ప్రధానంగా పండుగ పబ్బాల సమయంలో వీటిని పాడతారు. అల్లోనేరేళ్ల అనేపదం పునరుక్తమౌతుంటుంది.

"నెయ్యములల్లో నేరేళ్ళో
వొయ్యనవూరెడి వువ్విళ్ళో ॥పల్లవి॥

పలుచని చెమటల బాహుమూలముల
చెలమలలోనా జెలువములే
ధళధళమను ముత్యపు(జెరగుసురటి
దులిపేటి నీళ్ల తుంపిళ్లో ॥నెయ్య॥

తొటతొట గన్నుల దొరిగేటినీళ్ల
చిటిపొటి యలుకల చిరునగవే
వటఫలంబు నీ వన్నెల మోవికి
గుటకలలోనా గుక్కిళ్లో ॥నెయ్య॥

గరగరికల వేంకటపతి కౌ(గిట
పరిమళములలో బచ్చనలు
మరునువింటి కమ్మనియంపవిరుల-
గురితాకు లినుపగుగ్గిళ్లో ॥నెయ్య॥

(12-179)

—అన్నమయ్య సంకీర్తనల్లో ఇది చాల ప్రసిద్ధమైంది. అంత్యప్రాసలతో సాగిన ఈ కీర్తన సహృదయ రంజకంగా ఉన్నది.

గొబ్బి పాటలు :సంక్రాంతిపండుగసందర్భంలోఅవుపేడనో,గేదెపేడనో తెచ్చి గొబ్బెమ్మలుగా తీర్చి స్త్రీలు, ముఖ్యంగా యువతులు ఆగొబ్బెమ్మల్ని పూలు, రంగులు, ముగ్గులతో అలంకరించి వాటి చుట్టూ మండలాకారంలో తిరుగుతూ నృత్యం చేస్తూ పాటలు పాడతారు. మకుటంగా గొబ్బిళ్లో, గొబ్బియలో అనే పదాలను ఆవృతం చేస్తారు.

"కొలనిదోపరికి గొబ్బిళ్లో యదు-
కులస్వామికిని గొబ్బిళ్లో ॥పల్లవి॥

కొండగొడుగుగా గోవుల(గాచిన
కొండుక శిశువుకు గొబ్బిళ్లో
దుండగపు దైత్యులకెల్లను తల-
గుండు గండనికి గొబ్బిళ్లో ॥కొలని॥

పాపవిధుల శిశుపాలునితిట్ల
కోపగానికిని గొబ్బిళ్లో
యేపున(గంసుని యిడుమల(బెట్టిన
గోపబాలునికి గొబ్బిళ్లో ॥కొలని॥

దండిపైరులను తఱిమిన దనుజుల-
గుండెదిగులునకు గొబ్బిళ్లో
వెండి(బైండియగు వేంకటగిరిపై
కొండలయ్యకును గొబ్బిళ్లో ॥కొలని॥
(12-98)

—శ్రీకృష్ణలీలా విశేషాల వర్ణనతో సాగిన ఈ సంకీర్తనం సహృదయలోకానికి సుపరిచితం.

**జాజర :—**

"వీణాగానము వెన్నెల తేటా
రాణమీరగా రమణుల పాట
ప్రాణమైన పిన బ్రహ్మణువీట
జాణలు మెత్తురు జాజరపాట" ఇదినాచనసోముని

'వసంత విలాసం' లోనిదని ప్రసిద్ధి. ఇలాగే శ్రీనాథాది కవులలో కూడా ఈ'జాజర' ప్రసక్తి వస్తుంది. తప్పనిసరిగా 'జాజర' అనే పదం ఈ పాటల్లో ఉంటుంది. వసంతోత్సవ సమయాల్లో వెన్నెలరాత్రుల్లో స్త్రీలు, శృంగార ప్రియులు పాడేపాటలు జాజర పాటలు. వీటిలో శృంగారంతోపాటు హాస్యరసం కూడా ఉంటుంది.

చాలుచాలు నీ జాజర నన్ను
జాలి(బఱచె నీ జాజర ॥పల్లవి॥

వలపు వేదనల వాడేను ఈ
తలనొప్పులచే(దలకేను
పులకలమేనితో పొరలేను కడు
ఛలిగొని చల్లకు జాజర ॥చాలు॥ - విరహాన్ని
(12-132)

అనుభవిస్తూ నాయిక పాడిన పాట ఇది

తుమ్మెద పదం :- తుమ్మెద పదం తాత్త్విక గేయం. ఇందులో నీతి వైరాగ్యాలు కూడా ఉంటాయి. "తుమ్మెదా" అనే పదం అవృతమౌతుంది. శృంగార పదాల్లో కూడా 'తుమ్మెద' పదం ప్రయుక్తమౌతుంది.

"తొల్లింటి వలెగావు తుమ్మెదా-ఇంక
వొల్లవుగా మమ్ము-నో తుమ్మెదా ॥పల్లవి॥

తోరంపు రచనల తుమ్మెదా-కడు
దూరేవు గొందులే తుమ్మెదా-
దూరినా నెఱుగవు తుమ్మెదా-మమ్ము
ఓరగా చూడకు ఓ తుమ్మెదా ॥తొల్లింటి॥

— తుమ్మెదను ఉద్దేశించి పాడిన ఈ పాట నాయకుని గూర్చిన వ్యంగ్యంతో సాగిం దని సహృదయుల కవగతమవు తున్నది.

తందాన పాట :- ఈ తందాన పాటలు సామూహికంగా ప్రజలు పాడుకొనే పాటలు. ఏకతార లాంటి వాద్యం వాయిస్తూ పాడుకొంటూ ఉంటారు తందాన, తందనాన, తందానతాన అనే పదాలు పునరుక్తమౌతాయి. చాలా ప్రసిద్ధమైన అన్నమయ్య తందాన పాట సర్వప్రాణి సమానత్వాన్ని ప్రబోధిస్తున్నది.

"తందనాన అహి తందనాన పురె
తందనాన భళా తందనాన ॥పల్లవి

బ్రహ్మ మొకటె పరబ్రహ్మ మొకటెపర
బ్రహ్మ మొకటె పరబ్రహ్మ మొకటె ॥తంద

కందువగు హీనాధికములిందులేవు
అందరికి శ్రీహరే అంతరాత్మ
ఇందులో జంతుకుల మింతానొకటె
అందరికి శ్రీహరే అంతరాత్మ ॥తంద

నిండారరాజు నిద్రించు నిద్రయు నొకటె
అండనే బంటునిద్ర అదియునొకటె
మెండైన బ్రాహ్మణుడు మెట్టు భూమియొకటె
చండాలు డుండేటి సరిభూమి యొకటె ॥తంద॥

(2-385)

—ఇంకా కీటకాలకు పశువులకు, దేవతలకు కామ సుఖమూ, ధనాఢ్యునికి నిరు పేదకూ దివారాత్రులూ, శిష్టదుష్టాన్నాలను తినే ఆకలీ, సుగంధ, దుర్గంధాలపై ప్రస రించే వాయువూ, ఏనుగుమీదా, కుక్కమీదా పడే ఎండ సమానమేనని అన్నమయ్య వర్ణించి సర్వసమానత్వ భావాన్ని ప్రకటించాడు.

ఏలపాట : ఏలపాటకు యాల పాటలనీ, యాలపదాలనీ తెలుగు నాట ప్రచారం. పాల్కురికి సోమనాథుని దగ్గరనుంచి తెలుగు సాహిత్యంలో ఈ ఏల పదాలు కన్పిస్తాయి. యక్ష గానాల్లో కూడా ఏలపాటలున్నాయి. ఇవి చాలా వరకు శృంగార సంబంధులై ఉంటాయి.

"మేడలెక్కి నిన్నుఁజూచి కూడేననే యాసతోడ
వాడుదేరి వున్నారందురా-వేంకటేశ
యాడనుంటి విందాకానురా........
నిండఁబూచినమానిపై గండుఁగోవిల గూయగా
నిండిన నీయెలుఁగంటాను - వెంకటేశా
అండకు నిన్ను రమ్మంటిరా....
ఆనిన తుమ్మెదలు నీ-మేని కాంతిఁబోలునని
పూని చేతఁబట్టఁదోగాను-వెంకటేశా
నూనాస్తురినీ వేగు లాయురా.... (13-223)

— తానే నాయికగా భగవంతునితో విరహాన్ని అనుభవిస్తూ అన్నమయ్య పాడిన ఈ ఏలపాట అద్భుతంగా, అలంకారికంగా, సుదీర్ఘంగా సాగింది,

**చందామామ పాటలు :** వెన్నెల రాత్రుల్లో ముఖ్యంగా పల్లెల్లో పిల్లలంతా ఒకచోట చేరి ఆడుకొంటూ పాటలు పాడతారు. జట్లు జట్లుగా, సామూహికంగా ఈ పాటల్ని పాడుతూ చందమామను సంబోధిస్తారు. జగన్మాత అయిన లక్ష్మీదేవికి తమ్ముడైన చంద్రుణ్ణి 'చందమామ' గా భావించి పల్లెపిల్లలు, తల్లులు పాడే ఈ పాటలు హృదయాకర్షకంగా ఉంటాయి.

"చందమామరావో జాబిల్లి రావో మంచి
కుందనపు పైడికోర వెన్నబాలుదేవో ॥పల్లవి॥
నగుమోము చక్కని యయ్యకు నలువబుట్టించిన తండ్రికి
నిగమము లందుండే యప్పకు మా నీలవర్ణునికి
జగమెల్ల నేలిన స్వామికి చక్కని యిందిరామగనికి
ముగురికి మొదలైన ఘనునికి మాముద్దులమురారి బాలునికి
॥చంద॥

—అంటూ ఒక తల్లి పాడుతున్న చందమామ పాటను అన్నమయ్య అత్యంత ప్రతిభావంతంగా వర్ణించాడు.

**నీరాజనం :** హారతిలాంటిది. దైవపూజల్లో చిట్టచివరగా నీరాజనం పాడతారు. పెళ్లిళ్ల సమయంలో కూడా పాడతారు. లక్ష్మీదేవికి నీరాజనమర్పించే పాటను అన్నమయ్య ఈ విధంగా వర్ణించాడు.

"క్షీరాబ్ధి కన్యకకు శ్రీ మహాలక్ష్మికిని
నీరజాలయమునకు నీరాజనం ॥క్షీరా॥

జలజాక్షి మోమునకు జక్కవ కుచంబులకు
నెలకొన్న కప్పురపు నీరాజనం
అలివేణి తురుమునకు హస్తకమలంబులకు
నిలువు మాణిక్యముల నీరాజనం ॥క్షీరా॥

(26-295)

—ఇంకా చరణ కినల నూలకు, సఖీరంభోరులకూ నిరతమైన ముత్యాల నీరాజనం అర్పించబడింది.

ఈ విధంగా అన్నమాచార్యుల శృంగార, ఆధ్యాత్మిక సంకీర్తల్లో ఇంకా ఘాంగుభళా, సొసముఖా, కోలాటం, జోల, లాల, ఉగ్గు, ఉయ్యాల, దోబూచి, కూగూగు, శోభనం, జయమంగళం, ఎచ్చరిక, నివాళి, వరసపాటలు, వాకోవాక్యాలు పొడుపు కథలు మొదలైన రీతుల్లో అసంఖ్యాకంగా జానపద గేయ దోరణులు ప్రస్ఫుట మవుతున్నాయి. ఇలాగా జానపద సాహిత్య ధోరణల్ని గ్రహించి పద సాహిత్యానికి పుష్టిని చేకూర్చిన ఘనత అన్నమయ్యకే దక్కింది. వీటివల్ల అన్న మాయ్య ప్రజాకవిగా ప్రసిద్ధికెక్కాడు.

# అన్నమాచార్యులు జయదేవుడు-తులనాత్మకపరిశీలన

సంస్కృత గీతి కావ్య కవులలో జయదేవుడు ప్రముఖుడు. జయదేవుడు గీతగోవింద కావ్యంలో మధుర సంగీత సాహిత్యాలను మేళవించి, అభినయాన్ని జోడించిన మహావాగ్గేయ కారుడు. రాధామాధవ ప్రణయేతివృత్తనిరూపకమైన గీతగోవిందంలో శ్లోకాలు, అష్టపదులు రచితమై కావ్యం సహృదయ రంజకమై ఒప్పుతూంది. ఇందులోని శ్లోకాలుగాని, అష్టపదులుగాని స్వయం సంపూర్ణమై రసభావ వ్యంజకంగ వుంటాయి.

1116 నుంచి 1190 వరకు గౌడ దేశాన్ని లక్ష్మణసేన మహారాజు పరిపాలించాడు. ఇతడు కావ్యగీతి ప్రియుడు. కవి పండిత గాయక పక్షపాతి మాత్రమే కాక సంగీత సాహిత్య నిష్ణాతుడు. స్వయంగా ప్రబంధ రచనాదక్షుడు. ఇతని ఆస్థానంలోని పంచకవిరత్నాల్లో ఒక వరకవి జయదేవుడనే ప్రసిద్ధికంది. జయదేవుని జన్మస్థానం, కాలం గూర్చి వాదాలున్నాయి. జయదేవుని కాలం బాలాంత్రపు రజనీ కాంతరావుగారు 1090-1153 అని, ఎ.బి.కీత్ పండితుడు, సంస్కృతకావ్యాలు, చరిత్రల ఆధారంగా లక్ష్మణసేనుడు12వశ.వాడుగనుక,జయదేవుడు12వశతాబ్దివాడనీ,

వైద్యులకృష్ణారావుగారు1160ప్రాంతంలోగీతగోవిందకావ్యరచనచేసినజయదేవుని కాలం 1120 ప్రాంతం కావచ్చునని ఊహిస్తున్నారు. ఈ ఊహాలుసబబుగానే న్నాయి. జయదేవుని జన్మస్థలం బిందు బిల్వం. కొన్ని శ్లోకాల్లో కేందు బిల్వమనీ, బిల్వమనీ, తిందు బిల్వమనీ చెప్పబడింది.[4] బిందుబిల్వం ఒరిస్సాలోని జగన్నా క్షేత్రానికి సమీపాన ఉంది. కానీ ఇది వంగదేశంలోని దంటారు కొందరు.అక్కడ సంవత్సరము జయదేవుని జన్మదినోత్సవం చేస్తారట. కెంపూలియందు జయ ని మఠమూ, అందు నిలుపెత్తు రాధాకృష్ణుల విగ్రహాలు వున్నాయి.[5] జయదేవుడు దేశంలో పుట్టి వంగదేశంలో ప్రసిద్ధుడయ్యాడని విమర్శకుల అభిప్రాయం.[6] జయదేవుడు వంగదేశీయుడని డా॥ వైద్యుల కృష్ణారావుగారు నిశ్చయించారు.[7]

జయదేవుని తలిదండ్రులు రమాదేవి భోజదేవులని గీతగోవిందం వల్ల సే విషయం.

"శ్రీభోజదేవ ప్రభవస్య రమాదేవి సుత శ్రీజయదేవకస్య
పరాశరాది ప్రియవర్గకంఠే శ్రీగీత గోవింద కవిత్వమస్తు ?[8]

జయదేవుని ధర్మపత్ని పద్మావతి అని -
'వాగ్దేవతా చరిత చిత్రిత చిత్త సద్మా

పద్మావతీ చరణ చారణ చక్రవర్తీ?[9]....అనే శ్లోకం వల్ల విదితమవుతుంది. దేవుడు రాధాకృష్ణుల అమర ప్రణయాన్ని ప్రబంధాలుగా భక్తి పూర్వకంగా ం చేస్తుండగా పద్మావతి నాట్యం చేస్తూ ఆప్రబంధాల రసభావానుగుణంగ అభిన స్తూ భర్తకు ప్రేరణ అయినదట. ఆ ప్రబంధాలే గీత గోవిందంగా వెలిశాయి. మలో పన్నెండు సర్గలున్నాయి. ఇరవై నాలుగు అష్టపదున్నాయి. కథాగతికి నట్లు శ్లోకాలున్నాయి. రాధాకృష్ణులు,సఖి ఇందలి పాత్రలు. ఏకత్రా కథగాభావిస్తే గోవిందం రాధాకృష్ణుల ప్రణయ కావ్యం. విడివిడిగా దేనికదే ప్రతి అష్టపదీ న్నమాచార్య సంకీర్తనల్లా భాసిస్తుంది. ఇదే ఇందులోని విశేషం. రాధామాధవు టే జీవాత్మ పరమాత్మలని వేదాంతార్థమని పెద్దల తలంపు[10].

చంద్రాలోకం, రీతిమంజరి, కారకానందం, తత్వచింతామణి అనే గ్రంథాలకు జయదేవుడని ప్రతీతివుంది. కానీ శృంగార మాధవీయ చంపూరచయితా,

ప్రసన్న రాఘవ నాటక కర్తా వేర్వేరు జయదేవనామకులనీ, గీతగోవింద కర్తఅయిన జయదేవుడు కాదనీ తెలుస్తుంది.

అన్నమయ్య తాత తండ్రుల నివాసం కడప జిల్లా తాళ్ళపాక గ్రామం. అక్కడే అన్నమయ్య పుట్టి పెరిగినా తిరుమల తిరుపతిలోనే జీవితాంతం శ్రీ వేంకటేశ్వరుని కైంకర్యంలో గడిపాడు, 1408లో జన్మించి, 1503లో దివ్యధామం చేరాడు. శ్రీ వేంకటేశ్వర ముకుటంతో దినానికొక్కటిగా 32వేల శృంగార,అధ్యాత్మ సంకీర్తనలు రచించి పదకవితా పితామహుడనీ, సంకీర్తనాచార్యుడనీ ప్రసిద్ధి పొందాడు అన్నమాచార్యుడు. ఇవి వేటికవే స్వయం సంపూర్ణాలు, భక్తి, మధురభక్తి, శృంగారం, నీతి, వైరాగ్యం, ఆధ్యాత్మిక చింతనా పూరితాలై శ్రీవైష్ణవ మత ప్రచారసమర్థమై వుంటాయి. తదనంతర పదకవు లెందరికో మార్గదర్శకుడు అన్నమాచార్యుడు. అయినా జయదేవుడే అన్నమాచార్యులుగా జన్మించినట్లు విశ్వసించే వారున్నారు.

జయదేవుడు సంస్కృతంలోని ప్రప్రథమ వాగ్గేయకారుడు. తదనంతర వాగ్గేయ కారులందరికి మార్గదర్శకుడు. తెలుగులో మొదటి వాగ్గేయకారుడు అన్నమాచార్యులు. ఇద్దరు వాగ్గేయకారులు తమ కాలంలో జీవించిన రాగతాళాలను ప్రయోగించి, సంగీత ప్రతిపత్తిని ప్రసిద్ధికి తెచ్చారు.

జయదేవుడు పాడుతుండగా, అతని భార్య పద్మావతి అభినయిస్తూండేదన్న అంశం పూర్వోక్తం. అన్నమాచార్యుడు పదరచన చేసి, ఆడిపాడి తరించాడు.తద్వారా గీత, సంగీతాలతోపాటు అభినయానికీ, ఎంతో ప్రాధాన్యప్రాముఖ్యాలు తెచ్చిన మహా వాగ్గేయకారులు జయదేవ, అన్నమాచార్యులు.

జయదేవునితో ప్రారంభమైన రాధామాధవ ప్రణయం, భక్తి అన్నమాచార్యుల్లో పలవంతమైనదని చెప్పవచ్చు. ఆ వెనుక ఎంతో ప్రచారం పొందింది.

జయదేవుడు, అన్నమాచార్యులు తమ రచనల్లో భక్తి, శృంగారాల్లో, మధుర భక్తిలో, జీవాత్మ పరమాత్మలో సమైక్యం పొందడానికి పడిన తపనను అభివ్యక్తీకరించారు.

జయదేవుడు గీతగోవిందంలో రాధాకృష్ణుల ఆధారంగా గోపీకృష్ణుల భాగవత భక్తిని వర్ణించాడు. రాధాకృష్ణుల శృంగారం, భక్తి, మధురభక్తిగీతగోవిందంలో

చూడగలము. అన్నమాచార్యుడు భాగవతభక్తిని అలిమేలుమంగా శ్రీవేంకటేశ్వరుల ప్రణయంగా, మధుర భక్తిగా, శృంగారం వివిధ రీతుల వర్ణించి తరించాడు. వివిధ శృంగార నాయికా వర్ణనసైతముంది.

శృంగారం :

గీత గోవిందంలో జయదేవుడు రాధామాధవుల అలౌకిక శృంగారం అనన్య సామాన్యంగా వర్ణించాడు. విరహ విప్రలంభ శృంగారమేగాక, దర్శనస్పర్శనా లింగనాది వివిధ రీతుల శృంగారమూ, ఒకరికి సురత శృంగారం సైతం వర్ణితం

విరహం :

రాధావిరహం చక్కగా వర్ణించినతీరు స్పష్టం.
"నిందతి చందన మిందు కిరణ మను నిందతి ఖేదమధీరమ్
వ్యాళనిలయ మిళనేన గరళమివ కలయతి మలయ సమీరం
మాధవ మనసిజ విశిఖ భయా దివ భావనయా త్వయిలీనా
సావిరహే తవదీనా" (చతుర్థసర్గ-అష్ట-8)

(మన్మథ బాణాలు తన మీద పడతాయేమోనన్నభయం వల్ల నీయందు దా... నదై అత్యంత విరహంతో దీనమై చందనాన్ని, చంద్ర కిరణాలను రాధ నిందిస్తూంది. పాముల కాటపట్టైన చందన వృక్షాలనుంచి వచ్చేమలయ మారుతాన్ని విషంగా భావిస్తుంది.) ఇందులో రాధవిరహోత్కంఠిత.

ఇలాగే అన్నమాచార్యునిలోను గలదు. విరహవిప్రలంభం మనోజ్ఞంగ వర్ణితం. చెలులు నాయికా విరహాన్ని తమలో తామనుకొన్న తీరు :

"ఇందుమీద సతిభావ మెటౌనో యేమౌనో
విందుగా జెలువునికి విన్నవించరే ॥పల్లవి॥

కోవిల కూతకుగానే గుండె జల్లురని చెలి
పూవక పూచిన యట్టు పులకించె
మావినుండి యంతలోనే మదన భూతము సోకె
పోవులైన పువ్వాడనే పోయచే బడిమి ॥ఇందు॥

కోమలి చందరుడనే కొరవి దయ్యముజూచి
దీమసమింతయుఁ మాని దిగులందెను
తేమలైన వెన్నెలల దిమ్మనట్టి నిలువున
మైమఱచెఁగప్పురాన మంత్రించరే ॥ఇందు॥

(శృం. సం. 30-76)

ఇందులో నాయికా విరహకారణాలు, ఉపచారాలు విదితం చేయబడ్డాయి.

**సంభోగ శృంగారం :**

రాధామాధవుల సురతమిందు వర్ణితం. ఇది అలౌకికమూ, దేవతా పరమూను'

'శ్రమజలకణభర సుభగ శరీరా
పరి పతితోరసి రతిరణధీరా' (సప్తమ సర్గ - అష్ట-14)

(ఆ రాధ సంభోగంలో నేర్పరిగా మెలగి ఆయాసం వల్ల కలిగినచెమట బిందువులు శరీరానికెంతో శోభావహంగా ఉండగా అలసి సొలసి శ్రీకృష్ణుని ఉరం మీద పడు కొన్నది.)

ఇలాగే వివిధ రీతుల శృంగారమూ, చివరికి సంభోగ శృంగారమూ అన్న మాచార్యులు వర్ణించాడు. దివ్యసంభోగాన్ని మధుర మంజులంగా వర్ణించి తరిం చాడు.

"పలుకుదేనెల తల్లి పవళించెను
కలికి తనముల విభుని గలసినదిగాన ॥పల్లవి॥

నిగనిగనిమోముపై చెలులు గెలకుల జెదర
పగలైన దాక చెలి పవళించెను
తెగని పరిణతులతో తెల్లవారినదాక
జగదేకపతి మనసు జట్టిగొనెగాన" ॥పలుకు॥

(శృం. సం.4-74)

ఇలా ఎన్నైనా ఉదాహరించవచ్చు.

**హాస్యం :**

ఈ ఇద్దరు మహావాగ్గేయకారులు నాయికానాయకుల దేవతా సంబంధి సురత శృంగారాన్ని వర్ణించి తద్వారా హాస్యరస స్ఫూర్తికి దోహదం చేసిన తీరు మనోజ్ఞం. రాధామాధవుల శృంగార క్రీడలో పరస్పరం గుడ్డలుమారడంతో హాస్యముత్పన్నమైంది.

"ప్రాతర్నీలనిచోల మచ్యుతమురస్సంవీతపీతాంబరం
రాధయాశ్చకితం విలోక్యహసతిస్వైరం సఖీమండలే
వ్రీడాచంచల మంచలం నయనయోరాధాయ రాధాననే
స్వాదుస్వైర ముఖోఽయమస్తు జగదానందాయ నందాత్మజః"

(సప్తమ సర్గ-శ్లో.10)

(రాధామాధవులు రాత్రియథేచ్ఛగా క్రీడించినపుడు ఇద్దరి వస్త్రాలు మారడం వల్ల కృష్ణుని పీతాంబరం రాధ, రాధ దుప్పటి కృష్ణుడు కప్పుకొని ఉదయం శయ్యాగారం నుంచిరాగా సఖులు నవ్వారట. దానితో సిగ్గుపడి రాధా ముఖావలోకనం చేసే కృష్ణుడు లోకానందదాయి ఔను గాక!)

"మగరూపు నాడురూపు మారుచుకొని రిద్దరు
నొగిసెద్దము చూపరే చూచుకొనేరిద్దరు ॥పల్లవి॥

కలికి కస్తూరి బొట్టు కాంతుని నొసలనంటె
నిలువు నామముపైపై నెలతకంటె
అలివేణి కొప్పుజారి ఆతని కొప్పుపై వాలె
అలరె నీ తన్విసిక ఆతని పాపటపైని ॥మగ॥

(26-309)

ఇందుఈ నాయికానాయకుల సురత సమయంలోని గుర్తులు పరస్పరం మారడంతో హాస్యముత్పన్నమవుతుంది. జయదేవుడిలో వస్త్రాల మార్పుండగా, ఇక్కడ తదితర చిహ్నాలు వర్ణించడంతో హాస్యముత్పన్నమైంది.

భక్తి :

భక్తినవవిధాలు. ప్రపత్తి శ్రేష్ఠమైనది. జయదేవుడు గీత గోవిందంలో తన భక్తి ప్రపత్తిని స్తుత్యాత్మకంగా నిరూపించుకొన్నాడు. ప్రారంభంలోనే ఈ స్తుతి ఉంది.

"మేఘైర్మేదుర మంబరం వనభువశ్శ్యామా స్తమాలద్రుమైః
నక్తం భీరురయం త్వమేవతదిమం రాధే! గృహంప్రాపయ,
ఇత్థం నందనిదేశ తశ్చలితయోః ప్రత్యధ్వకుంజద్రుమం
రాధా మాధవ యోర్జయన్తి యమునాకూలే రహఃకేళయం"

(ప్రథమ సర్గ - శ్లో - 1)

(ఓరాధా ! ఆకాశం దట్టమైన మేఘావృతమైంది. తమాల చెట్ల వల్ల వన భూము లన్నీ చీకటిమయమయ్యాయి. ఊరకే కృష్ణుడు రాత్రులందు భయపడు తుంటాడు. కనుక వెంటనే నీవే కృష్ణుని ఇంటికి చేర్చవలసింది అని నందుడు రాధకు అప్ప గించగా, వెళ్లి యమునానదీ కూలల్లో మనోహరమైన పొదరిండ్లయందు రాధాకృష్ణుల రహస్య క్రీడలు సర్వశుభంకరమై ఒప్పుతున్నాయి.)

ఇలాగే ఇష్టదేవతా ప్రార్థన :

"వాగ్దేవతా చరిత చిత్రిత చిత్తసద్మా
పద్మావతీ చరణ చారణ చక్రవర్తీ
శ్రీవాసుదేవ రతికేళి కథాసమేత
మేతం కరోతి జయదేవ కవిఃప్రబంధమ్"

(ప్రథమ సర్గ. శ్లో-2)

(మనోహరమైన వాగ్విలాసాలతో చిత్రితమైన చిత్తమనే గృహం గలవాడు, పద్మావతీ పాద విన్యాసంతో నాట్యం చేయగల నేర్పరి అయిన జయదేవ కవి అయిన తాను శ్రీకృష్ణుని, శ్రీకృష్ణ శృంగార క్రీడలను వివరించే గీతగోవింద ప్రబంధం రచిస్తున్నాడు.

"యదీ హరిస్మరణే సరసమ్మనో
యదీ విలాస కలాసు కుతూహలమ్,
మధుర కోమల కాన్త పదావళీం
శ్రుణు తదా జయదేవ సరస్వతీమ్"

(ప్రథమ సర్గ - శ్లో. 3)

(హరిస్మరణయందు భక్తి రసంతో గూడి మీ మనస్సు ఉంచే, శృంగార కళల యందు కుతూహలముంటే మధురమూ, కోమలమూ, మనోహరమూ అయిన పదావళి గల జయదేవవాణిని వినండి.)

ఇలాగా ఎంతో మనోహరంగా స్తుతిపూర్వకంగా కావ్యారంభం గావించాడు జయదేవుడు.

ఇలాంటి వెన్నో విధాల తన సంకీర్తనల్లో చేశాడు అన్నమాచార్యుడు. నవ విధ భక్తులను సవివరణగా, ఉదాహరణలతో చూడగలము. వీటిని మించి శరణాగతి, ప్రపత్తి అనేవి భగవంతునికి సర్వం సమర్పించుకోవడం అన్నమాచార్యుల సంకీర్తనల్లో వున్నాయి. అన్నమాచార్యుల శరణాగతి :

"అరసి నన్నుగాచి నాతనికి శరణు
పరము నిహామునేలే పతికిని శరణు ॥పల్లవి॥

(అధ్యా. సం. 9-85)

ప్రపత్తి.

"అన్నిటా నీవంతర్యామివి అవుట ధర్మమే అయినాను
యెన్నగ నీ వొక్కడవే గతియని యెంచికొలుచుటే ప్రపన్నసంగతి"

(అధ్యా. 1-386)

హరి ఒక్కడే దిక్కు.

"భావములోనా బాహ్యమునందును
గోవింద గోవింద యని కొలువవో మనసా".

(అధ్యా. సం. 9-272)

**సర్వం విష్ణుమయం:**

"సర్వం విష్ణుమయంబనుభావము సత్యం సత్యం బన్నిటను
సర్వేశ్వరుడే పొందెటి వస్తువు శరణాగతియే ఉపాయము".
(అధ్యా. సం. 10-90)

ఇలాగా శ్రీవైష్ణవ మత ప్రతిపాదికంగా నవవిధ భక్తి ప్రపత్తులతో వివరించాడు అన్నమాచార్యులు.

**దశావతార వర్ణన :**

జయదేవ అన్నమాచార్యు లిద్దరూ దశావతార వర్ణన అత్యంత మనోజ్ఞంగా చేశారు. అందునా జయదేవుని వర్ణన అత్యంత మనోజ్ఞంగా వుంది.

"ప్రళయ పయోధిజలే ధృతవానసి వేదం
విహిత వహిత్ర చరిత్ర మఖేదమ్
కేశవ ! ధృతమీన శరీర! జయజగదీశ! హరే! : ధ్రువమ్ :
.......................... ..... .. ....
శ్రీజయదేవకవేరిద ముదితముదారం
శృణుశుభదం సుఖదం భవసారమ్
కేశవ ! ధృత దశవిధరూప ! జయజగదీశహరే! ॥ధ్రు॥
(ప్రథమ సర్గ - అష్టపది-1)

ఇలాగ విపులంగా ఈ అష్టపదిలో వర్ణించిన దశావతారాలను సంక్షిప్తంగా ఒక శ్లోకంలో వర్ణించాడు జయదేవుడు.

"వేదానుద్ధరతే జగన్నివహతే భూగోల ముద్బిభ్రతే
దైత్యాన్దారయతే బలింఛలయతే క్షత్ర క్షయం కుర్వతే
పౌలస్త్యం జయతేహలం కలయతే కారుణ్యమాతన్వతే
మ్లేచ్ఛాన్ మూర్ఛయతే దశాకృతి కృతే కృష్ణాయతుభ్యన్నమః"
(ప్రథమ సర్గ - శ్లో - 5)

ఇలాగే అన్నమాచార్యులు తెలుగులో అనేకపదాల్లో వివిధ విధాల దశావతార వర్ణన చేసి, అంతటితో సంతృప్తి చెందక, సంస్కృతంలోను దశావతార వర్ణన చేయడం గమనించ దగ్గ అంశం.

"దశవిధాచరణం త న్నభవతి
దశవిధావస్థారం తే తత్ర ॥పల్లవి॥

స్థాపయిష్యామి వేదానితి వ్యాజేన
..........................................................
ధీరవేంకటనగాధీశ ఏవం నఖలు
భీరు మూర్వీం సంప్రణయతు మత్ర" ॥దశ॥

(శృ. సం. 12-374)

**మధుర భక్తి :**

జయదేవుడు గీతగోవింద కావ్యాన్ని శృంగార రస ప్రధానంగా రచించినా, ఇందులో ముఖ్యంగా మధుర భక్తిని ప్రతిపాదించాడు. రాధాకృష్ణుల ప్రణయంలో జీవాత్మ పరమాత్మల సమైక్యానికి చేసిన ప్రయత్నమని స్పష్టమవుతుంది. భాగవత భక్తినంతటినీ ఇందులో జయదేవుడు విశదీకరించాడు. ఇలాంటి మధుర భక్తి అన్నమాచార్యుల పదాల్లో విరివిగా మనం గమనించగలము. జయదేవుడు, అన్నమాచార్యులు, నాయిక రాధలాగా పతి అయిన కృష్ణుని, శ్రీవేంకటేశ్వరుని సంయోగంకై తమ పదాల్లో చేసే యత్నాన్ని మధుర భక్తి పూరితంగా అభివ్యక్తీకరించారు.

రాధామాధవులేకాక దూతికల్ని గూడా గీతగోవిందంలో జయదేవుడు ప్రవేశపెట్టాడు. దూతికనాయికకు ఆదార్యుని వంటిది. నాయికానాయకుల కలయికకు దోహదం చేసే వ్యక్తి దూతిక. ఇలాంటి దూతికల్నేగాక, సఖాలను సైతం అన్నమాచార్యులు ప్రవేశపెట్టాడు తన పదాల్లో.

అన్నమాచార్యుని పదంలోని మధుర భక్తి పూరిత ప్రణయాన్ని వర్ణించిన తీరు గమనించ దగ్గది. జీవాత్మ పరమాత్మ కలయిక వర్ణితమైన తీరు అత్యంత మనోహరమై, మధుర భక్తికి మకుటాయ మానంగా ఒప్పుతూంది.

'అదిగాక సౌభాగ్యమది గాక వలపు
అదిగాక సుఖమింక నందరికి గలదా ॥పల్లవి॥

ప్రాణ వల్లభుని బెడబాసి మరు బాణముల
ప్రాణబాధల నెగులు పడుపేటి వలపే
ప్రాణేశ్వరుడు దన్నుబాయ జూచినయపుడు
ప్రాణంబు మేనిలో బాయంగవలదా ॥అదిగాక॥

ఒద్దికై ప్రియునితో నొడకూడి యుండినపు
డిద్దరై విహరించుటిది యేటివలపే
పొద్దు పోకలకు దమపొల యాలుకకూటముల
బుద్ధిలో బరవశము పొందంగవలదా ॥అదిగాక॥

చిత్తంబులోపలను శ్రీవేంకటేశ్వరుని
హత్తించి నాడుదానయి యుండవలదా
కొత్తయిన యిటువంటి కొదలేని సంగతుల
తత్తరము మున్నాట తగులంగ వలదా ॥అదిగాక॥

(శృం. సం. 12-230)

ఇలాంటి వెన్నెన్నో ఉదాహరణలను ఇవ్వవచ్చును.

ఇలాగా జయదేవుడు వాగ్గేయకారులందరికీ సంస్కృతంలో మూలపురుషుడు. అన్నమాచార్యులు జయదేవుని బాగా జీర్ణించుకొన్న తెలుగు ప్రథమ వాగ్గేయ కారుడు. ఇతనికి ఆదర్శం జయదేవుడు. పై పరిశీలన వల్ల జయదేవ అన్నమా చార్యులలోని భేదసాదృశ్యాలు విదితమవుతున్నాయి.

## అన్నమాచార్య జయదేవులు : దశావతారవర్ణన

తెలుగులో పదకవితకు ఒక ప్రత్యేకత ఉంది. అలాగే కన్నడంలోను: అంతకుముందే తమిళంలో విశిష్టతను సాధించింది. ఈ మధ్యకాలంలో అంటే 12వ

శతాబ్దంలో జయదేవుడు గీతగోవింద కావ్యాన్ని అష్టపదుల్లో సంస్కృతంలో రచించి ప్రఖ్యాతి గడించాడు. సంస్కృతంలో మొట్టమొదటి వాగ్గేయకారుడు. జయదేవుడు అష్టపదులకు రాగతాళాలు నిర్దేశించి సాహిత్యంతోపాటు సంగీతానికి అత్యంత ప్రాధాన్యమిచ్చిన వాగ్గేయకారుడు. తెలుగులో పదకవితా పితామహుడనీ, సంకీర్తనాచార్యుడనీ పేరు గడించిన ప్రప్రథమ వాగ్గేయకారుడు అన్నమాచార్యుడు అధ్యాత్మ, శృంగార సంకీర్తనలు 32 వేలు రచించి శ్రీవేంకటేశ్వరుని ఆరాధించి తరించిన మహనీయుడు. శృంగారం, భక్తి, మధుర భక్తి, నీతి వైరాగ్యాల్ని తన సంకీర్తనల్లో సముచిత రీతిని వర్ణించిన మహాభక్తుడు. అలమేలుమంగా శ్రీవేంకటేశ్వరుల అలౌకిక శృంగారాన్ని వర్ణించాడు. కృష్ణభక్తిని వివరించాడు. ప్రతిపదం రసవత్కావ్యం.

జయదేవుడు గీతగోవిందంలో ఇరవై నాలుగు అష్టపదులు, సందర్భోచితంగా ముందు వెనుక కొన్ని శ్లోకాలు రచించి దీన్ని కావ్యం చేశాడు. అష్టపదులు దేనికదే విశిష్ట రసవత్కావ్యంగా ఉంటాయి. ఇందులో రాధామాధవ శృంగారమును వివిధ రీతుల చలచ్చిత్రాలుగా చిత్రించాడు జయదేవుడు.

అన్నమాచార్యులు పదరచన చేసి, ఆడి, పాడితరించాడు. జయదేవుడు పాడుతూంటే అతని భార్య పద్మావతి అభినయిస్తుండేదన్న విషయం ప్రసిద్ధం. తన్మూలంగా సంగీత సాహిత్యాభినయాలకు ఎంతో ప్రాధాన్యం తెచ్చిన మహావాగ్గేయకారులు జయదేవ అన్నమాచార్యులు. జయదేవ అన్నమాచార్యులు తమ రచనల్లో భక్తి శృంగారాల్లో మధుర భక్తితో జీవాత్మ పరమాత్మలో సమైక్యం పొందడానికి పడిన తపనను అభివ్యక్తీకరించారు.

అన్నమాచార్య జయదేవులు భక్తి తత్పరతను ప్రకటించి వైష్ణవ మత పారమ్యాన్ని విశదీకరించారు. శిష్టరక్షణ, దుష్ట శిక్షణ చేసి ధర్మసంస్థాపన చేయడానికి విష్ణువేయుగయుగాన అవతరించిన అంశాన్ని దశావతార వర్ణనలో ఈ వాగ్గేయకారులిద్దరూ అత్యంత మనోజ్ఞంగాచేసి తమ భక్తి ప్రపత్తిని తెలిపారు. 'సర్వం విష్ణుమయం' అన్న అంశాన్ని నిరూపించారు. దశావతార స్తుతి రూపంగా జయదేవుడు అష్టపదిలో ఆవాసుదేవుని కీర్తించినా తనివి తీరక మరోశార్దూల వృత్తంలో

క్లుప్తంగా వివరించాడు అన్నమాచార్యులు పలుచోట్ల తెలుగులో అనేక సంకీర్తనల్లో ఈ దశావతాల వర్ణన చేసినా తనివి చెందక సంస్కృతంలో సంకీర్తన రూపంలో చేసి తన భక్తి పారమ్యాన్ని వివరించాడు.

జయదేవుడు చేసిన దశావతార అష్టపదిని చవి చూద్దాము.

"ప్రళయ పయోధిజలే ధృత వానవవేదం
విహిత వహిత్ర చరిత్ర మఖేదమ్
కేశవాధృత మానవరీర! జయజగదీశ!హరే! ధ్రువమ్

క్షితిరితి విపులతరే తవతిష్ఠతి పృష్ఠే
ధరణి ధరణ కిణ చక్రగరిష్ఠే
కేశవ ! ధృత కచ్ఛపరూప ! జయజగదీశ ! హరే ! ధ్రు.

వసతిదశన శిఖరే ధరణీ తవలగ్నా
శశిని కళఙ్కకలేవ నిమగ్నా
కేశవ ! ధృత సూకర రూపా ! జయజగదీశ ! హరే ! ధ్రు.

తవకరకమలే నఖ మద్భుత శృఙ్గం
దళిత హిరణ్య కశిపు వరభృఙ్గమ్
కేశవ ! ధృత నరహరిరూప ! జయజగదీశ ! హరే ! ధ్రు.

ఛలయసి విక్రమణే బలి మద్భుత వామన !
పదనఖ నీరజనిత జనపావన !
కేశవ ! ధృతవామనరూప ! జయజగదీశ ! హరే ! ధ్రు.

క్షత్రియ రుధిరమయే జగదపగత పాపం
స్నపయసి పయసి శమితభవతాపం
కేశవ ! ధృత భృగుపతి రూప ! జయజగదీశ ! హరే ! ధ్రు.

వితరసి దిక్షురణే దిక్పతి కమనీయం
దశముఖ మౌళి బలిం రమణీయం
కేశవ ! ధృతరామ శరీర ! జయజగదీశ ! హరే ! ధ్రు.

వహసి వపుష విశదే వసనం జలదాభమ్
హలహతి భీతి మిళిత యమునాభమ్
కేశవ ! ధృతహల ధరరూప ! జయజగదీశ ! హరే ! ధ్రు. 8

నిన్దసి యజ్ఞ విధే రహహ శ్రుతిజాతం
సదయ హృదయ దర్శిత పశు ఘాతమ్
కేశవ . ధృతబుద్ధ శరీర ! జయజగదీశ ! హరే ! ధ్రు. 9

మ్లేచ్ఛ నివహ నిధనే కలయసి కరవాలం
ధూమకేతు మివ కిమపి కరాలమ్
కేశవ ! ధృతకల్కి శరీర ! జయజగదీశ ! హరే ! ధ్రు. 10

శ్రీజయదేవకవేరిద ముదిత ముదారం
శ్రుణు శుభదం సుఖదం భవసారమ్
కేశవ ! ధృత దశవిధరూప ! జయజగదీశ ! హరే ! ధ్రు 11

ఇది దశవతార వర్ణనాత్మక అష్టపది. ప్రారంభంలోనే గీత గోవిందంలో ఉంది. ఇందులో శ్రీకృష్ణావతారం దశావతారాల్లో ఒకటి వర్ణితం కాలేదు. జయదేవ మహాకవి బహుశః శ్రీకృష్ణుడు శ్రీవిష్ణువే నన్న భావనతో తక్కిన పది అవతారాల్ని వర్ణించాడని మనం తలంచ వలసి ఉంది.

ఇంత విపులంగా అష్టపదిలో వర్ణించిన ఈ దశావతారాలను సంక్షిప్తంగా ఒకే ఒక శ్లోకంలో జయదేవుడు వర్ణించాడు.

"వేదానుద్ధరతే జగన్నివహతే భూగోల ముద్బిభ్రతే
దైత్యాన్దారయతే బలిం ఛలయతే క్షత్ర క్షయం కుర్వతే
పౌలస్త్యం జయతే హలం కలయతే కారుణ్యమా తన్వతే
మ్లేచ్ఛాన్ మూర్ఛయతే దశాకృతికృతే కృష్ణాయతుభ్యన్నమః" -పైన పేర్కొన్నట్లు వేదాల నుద్ధరించిన మత్స్యావతారమూ, భూమినిమోసిన కూర్మావతారమూ, భూమండలాన్ని పైకెత్తిన వరాహావతారమూ, హిరణ్య కశిపుని సంహరించిన నరసింహావతారమూ, బలిచక్రవర్తిని మోసపుచ్చిన వామనావతారమూ, క్షత్రియ సంహారం చేసిన పరశురామావతారమూ, రావణుని సంహరించిన రామావతారమూ,

నాగేలిని ధరించిన బలరామావతారమూ, భూతదయా పరుడైన బుద్ధావతారమూ, మన్షులను కల్క్యవతారమూ, ధరించిన శ్రీకృష్ణా నీకు నమస్కారమని జయదేవుడు పై అష్టపదిలోని విపులవిషయములను దశావతార వర్ణనను క్లుప్తంగా ఈ శ్లోకంలో నిరూపించాడు. అన్నమాచార్యులు తన సంకీర్తనల్లో పలురీతుల దశావతార వర్ణన చేస్తిచేసి తరించిన మహనీయుడు. కేవలం తెలుగులోనే గాక సంస్కృతంలోను ఈ దశావతార వర్ణనచేసిన తీరు విశేషమైనదే గాదు. గమనించదగ్గది.

"దశవిధాచరణం తన్నభవతి
దశవిధావస్థాం తేతత్ర ॥పల్లవి॥

స్థాపయిష్యామి వేదానితి వ్యాజేన
దీపితోయం మత్స్య దేహఃపురా
వ్యాపారోయమేవం నచతరుణ్యా
రూపజలధౌ కేళిరుచయే తత్ర ॥దశ॥

ధారయిష్యామి మందరమితి వ్యాజేన
చారు కచ్ఛప విధాచరణం పురా
నీరసే యం తవ మనీషా ప్రియవధూ
ధారకుచ మందరౌ ధర్తుం తత్రి ॥దశ॥

భువ ముద్ధరిష్యామి పునరితి వ్యాజేన
ధవళకటి పై భవం ధత్సే పురా
వ్యవహృతిరియం నచమహా మహీకుచతదే
తవ దంతక్షతం దాతుం తత్ర ॥దశ॥

దనుజం హరిష్యామి తమితి వ్యాజేన
ఘన నారసింహ విక్రమణం పురా
దనుజహర తవమహత్త్వం తన్నచ నఖా
ర్ఘన మందిరాయా (యాం) ప్రసర్తుం తత్ర ॥దశ॥

అపహరిష్యామి బలి మహామితి వ్యాజేన
కపట వామన రూప కలనం పురా
నిపుణ ఏవం నఖలు నియతిస్స్వతీషు తే
కపటాచరణ ఘటయితుం తత్ర ॥దశ॥

సంహరిష్యామి నృపజనమితి వ్యాజేన
బహ్వారుణతోయే ప్రాప్తిః పురా
సింహ విక్రమణతే స్థితిరియం వచసతీ-
విహ్వలత్వం తదాపేత్తుం తత్ర ॥దశ॥

రావణం జేష్యామి రణ ఇతి వ్యాజేన
భూవరత్వే తేభోగః పురా
ఏవం నభవతి మహీసుతా విరహం
సావధానేన ప్రహర్తుంతత్ర ॥దశ॥

కంసం హనిష్యామి ఖలమితి వ్యాజేన
సంసారోయ మాచరితః పురా
హింసామార నచహిత మిదం వ్రజవధూ-
సంసరణ లీలాం ప్రసక్తుం తత్ర ॥దశ॥

పాతయిష్యే ప్రలంబ మితి వ్యాజేన
జాతిరోషస్యతే జస్యం పురా
భూతరక్షకతే ప్రభుత్వం తన్నఖలు
భూతలే రేవతీం భోక్తుం తంత్ర ॥దశ॥

బుద్ధో భవిష్యామి పురహ్యతి వ్యాజేన
బద్ధరోష ఇతి తే ప్రాప్తిఃపురా
తద్ధితం నహిఖలు తదా వధూహస్త-
సిద్ధ ప్రసాదేణ సేవితుం తత్ర ॥దశ॥

మారయిష్యామి కలి మతఖిలి వ్యాజేన
క్రూర కల్క్యేవ తారకోపశపురా
ధీరవేంకట నగాధీశ ఏవం నఖలు
భీరుమూర్త్యం సంప్రీణ యితుమత్ర ॥దశ

(శృం. సం. 12-374

అన్నమాచార్యులు 32 వేల సంకీర్తనలు రచించినట్లు ప్రసిద్ధి. అందులో సుమారు 12 వేలకు పైగా పదాలు 32 సంపుటాల్లో ముద్రణ పొందాయి. వాటిల్లో సంస్కృత సంకీర్తనలు సుమారు 80 వరకు నేను సేకరించాను. అందులో ఈ దశావతార వర్ణనాత్మకమైన సంస్కృత సంకీర్తన అన్ని విధాలా జయదేవు గీతగోవిందంలోని ప్రప్రథమాష్టపదిని పైనుదాహరించిన దానిని పోలి ఉంది కొన్ని భేదాలు గూడా ఉన్నాయి.

అన్నమాచార్యుని దశావతార వర్ణనను జయదేవుని దశావతార వర్ణనతో పోలిస్తే మనకు వెంటనే కొట్టవచ్చినట్లు కనిపించే భేదం ఒకటే. అది పూర్వోక్తమైనట్లు జయదేవుడు శ్రీకృష్ణునివినా బలరామునితో సహా దశావతారాలను వర్ణించాడు అన్నమాచార్యులు అలాగాక శ్రీకృష్ణావతారాన్ని వర్ణించి, బలరామావతారాన్ని సైతం వర్ణించాడు. దీనిలో దశావతారాలే గాక ఏకాదశావతారాలు వర్ణితమైనట్లైనది. భగవంతుడు ధర్మ సంస్థాపనం కోసం అనేకావతారాలెత్తినట్లు ప్రసిద్ధమే అందులో దశావతారాలు చాలా ప్రముఖమైన అవతారాలు. అందుకని కొందరు జయదేవుడు చేసిన వర్ణనను అంగీకరిస్తారు. మరికొందరు శ్రీకృష్ణావతారాన్ని వర్ణించి బలరామావతారాన్ని తొలగించి దశావతారాలను అంగీకరిస్తారు. కానీ అన్నమాచార్యులు శ్రీకృష్ణుడు విష్ణువనే అంశాన్ని విశ్వసించినా, శ్రీకృష్ణుని విస్మరించలేదు. పదికి బదులు పదకొండైనా ప్రమాదం లేదుగానీ, శ్రీకృష్ణుని వర్ణించాల్సిందే అన్నపట్టుదల ఉన్నవాడనిపిస్తుంది. ఎందుకంటే తన యిలవేల్పు శ్రీవేంకటేశుడు. అలమేలుమంగా శ్రీవేంకటేశ్వరుల అలౌకిక శృంగార వర్ణనమే తన శృంగార పదాలన్నిటా ఉన్నది. శ్రీ వేంకటేశ్వర ముద్ర విరహిత పదరచన లేదు. కానీ శ్రీకృష్ణునిగానే వేంకటేశ్వరుని నమ్మి, తదభిన్నంగా శ్రీకృష్ణలీలావిభవాలను వర్ణించి వర్ణించి తరించిన మహాభక్తాగ్రేసరుడు. అందువల్లనే శ్రీకృష్ణుని

వర్ణించాడు అన్నమాచార్యుడు. మరో అంశం బలరాముని కంటే ముందు శ్రీకృష్ణునే వర్ణించాడు

అంతేగాక జయదేవుడు బలరాముని దశావతారాల్లో వర్ణించడానికి ఒక ప్రమాణం చెప్పబడింది. "రామావతారమును వర్ణించిన పిదప రామోరామశ్చ కృష్ణశ్చ" అను ప్రమాణముంబట్టి కృష్ణావతారము వర్ణింపదగియున్నను 'వనజౌ వనజౌ ఖర్వః త్రిరామీ సకృపోఽకృపః' అను ప్రమాణము రీతి మతాంతరమునననుసరించి దశావతారములలో పరిగణింపబడు బలరామావతారమును స్తుతించుచున్నాడు" [జయదేవుడు గీత గోవింద కావ్యము-పు17] ఈ ప్రమాణం అన్నమాచార్యులకు తెలియక కాదు. కానీ కృష్ణావతారాన్ని సైతం వర్ణించడమే తన ధ్యేయం.

జయదేవుడు అష్టపదిలోని ప్రతిచరణంలోని మొదటి రెండు పంక్తులకు అంత్య ప్రాసవాడాడు. ఆయా అవతారాలను రూపరూప అని పేర్కొని రామ శరీర, బుద్ధ శరీర, కల్కిశరీర, అని మూడింటిని రచించాడు. ఇది మొదటి అష్టపది. గీతగోవింద కావ్యారంభంలో దశావతారాలను పేర్కొని ఆపైనక శ్రీకృష్ణుని లీలావిశేషాలను వివరించాడు. అందు కిది నాంది.

అన్నమాచార్యులు తన తెలుగు సంకీర్తనల్లో అనుసరించిన యతి ప్రాసలతో పాటు ఇందులో మరికొన్ని నియమములను పాటించాడు. ప్రతిచరణంలోని మొదటి పంక్తిలో 'వ్యాజేన' రెండో పంక్తిలో 'స్వా' నాల్గో పంక్తిలో 'తత్ర'-పదాలు అంత్య ప్రాసగా పాటించడం గమనించదగ్గ అంశం. చివరి పాదం ఒక్కదానిలో మాత్రం 'సంప్రీణయితుమత్ర' ప్రయోగించినా అంత్యప్రాస పాటింపబడింది.

జయదేవుడు తన అష్టపదిని మాలవరాగంలో రూపకతాళంలో నిర్దేశించాడు. అన్నమాచార్యులు రాగాన్నే గానీ ఎక్కడో తప్ప తాళ నిర్దేశం చేయడు. ఇక్కడ ప్రస్తుత సంకీర్తన కేదారగౌళ రాగంలో రచితం.

ఇలాగా జయదేవుడు, అన్నమాచార్యులు భక్తినిర్భరంగా దశావతార వర్ణన చేసి తరించారు.

# అన్నమాచార్య జయదేవులు-హాస్యం

అన్నమాచార్య జయదేవులు తెలుగు సంస్కృత భాషలలో ప్రసిద్ధ వాగ్గేయకారులు. అష్టపదుల్లో జయదేవుడు, సంకీర్తనల్లో అన్నమాచార్యులు భక్తి మధురభక్తి, శృంగారం, అభినయాన్ని జోడించి - అభివ్యక్తీకరించిన వాగ్గేయకార సత్తములు.

అన్నమాచార్యుడు తెలుగులో అధ్యాత్మ శృంగార కీర్తనల రచన చేసి ఆడి పాడి తరించాడు. తెలుగులో ప్రథమ వాగ్గేయకారుడు. అందువల్లనే ఆయన 'పద కవితా పితామహుడు, సంకీర్తనాచార్యుడు.' జయదేవుడు గీతగోవిందంలో అష్టపదులు పాడుతూంటే అతని భార్య పద్మావతి అభినయించేదట. తద్వారా గీత సంగీతాలతో పాటు అభినయానికి ఎంతో ప్రాధాన్య ప్రాచుర్యాలు తెచ్చిన వాగ్గేయకారులు జయదేవ అన్నమాచార్యులు.

అన్నమాచార్యుడు సంకీర్తనల్లో భక్తి శృంగారాలను వర్ణించి తరించాడు. ఇతని సంకీర్తనలు చేనికవే రసప్రతిపాదకాలైన రసవద్కావ్యాలు, ముక్తకాలు. జయదేవుని గీతగోవిందం గీతి కావ్యం. ఇరవైనాలుగు అష్టపదుల ముందు వెనుక కొన్ని శ్లోకాలు రచించాడు. అష్టపదులను వేటికవే పరిస్తే, పాడిలడితే రసభావ వ్యంజకమై అనంద ప్రధానాలుగా ఉంటాయి. రాధామాధవ శృంగార లీలలను చలచ్చిత్రాలుగా చిత్రించాడు జయదేవుడు. అన్నమాచార్యుడు కొన్ని సంస్కృత పదాలను సైతం రచించాడు. జయదేవుని అష్టపదులను స్మరింపచేస్తాయి.

జయదేవునితో ప్రారంభమైన కృష్ణభక్తి, అన్నమాచార్యునిలో ఫలవంతమైందని చెప్పవచ్చు. జయదేవుడు అన్నమాచార్యులిద్దరు తమ రచనల్లో భక్తి శృంగారాల్లో ప్రత్యేకించి మధురభక్తిలో జీవాత్మ పరమాత్మలో సమైక్యం పొందడానికి పడిన తపనను అభివ్యక్తీకరించారు.

జయదేవుని భక్తి మొదటి అష్టపదిలోనే దశావతారవర్ణనలో విదితమవుతుంది.

ప్రళయ పయోధిజలే ధృతవానసి వేదం
విహితవహిత్ర చరిత్ర మఖేదమ్
కేశవ! ధృతమీనశరీర! జయజగదీశ! హరే.

(ప్రథమసర్గ-అష్టపది-1)

ఇలాగే అనేక సంకీర్తనల్లో అన్నమాచార్యుడు దశావతార వర్ణన వివిధ విధాలుగా చేసినా, తద్వారా భక్తి ప్రపత్తిని ప్రకటించినా, సంస్కృతి చెందక సంస్కృత సంకీర్తనలో చేయడమూ మనం గమనించగలము.

దశ విధా చరణం తన్న భవతి
దశ విధావస్థార్థం తత్ర

(శృం. సం. 12-374)

ఈ కృతిగానే అన్నమాచార్యుడు పలువిధాల భక్తితత్త్వాన్ని తన సంకీర్తనల్లో నిరూపించారు. నవవిధ భక్తి కృతులకు ఉదాహరణలున్నాయి.

ఇంతకంటే ఈ మహావాగ్గేయకారుల్లో మనం గమనించదగ్గ అంశం వీరిద్దరు పోషించిన మధురభక్తి. జయదేవుడు గీతగోవింద కావ్యాన్ని శృంగార రస ప్రధానంగా రాధామాధవుల ప్రణయాన్ని రచించినా ముఖ్యంగా మధురభక్తిని ప్రతిపాదించాడు. రాధాకృష్ణుల ప్రణయంలో జీవాత్మ పరమాత్మల సమ్మేళనానికై చేసిన యత్నం విదితమవుతుంది. భాగవతభక్తినంతటిని ఇందులో స్పష్టం చేశాడు. ఇలాంటి మధురభక్తిని అన్నమాచార్యుడు తన సంకీర్తనల్లో - తానే నాయిక అయి శ్రీవేంకటేశ్వరుని నాయకునిగా భావించి - ప్రతిపాదించిన తీరు అమోఘం. ఒక ఉదాహరణ నాయిక నాయకునితో సంభాషించిన తీరులో మధురభక్తి:

నీ మహిమో నాలోన నిండిన వలపుజాడో
యేమి సేతు నన్నెప్పుడు నెడపకుమయ్య

(శృం. సం. 28-155)

జయదేవుడు, అన్నమాచార్యుల నాయికరాధ, అలమేలుమంగ లాగా పతిస్థానే కృష్ణుని, వేంకటేశ్వరుని కలయికకై పడ్డ తపనను వ్యక్తీకరించారు,

అన్నమాచార్య జయదేవులు శృంగారం సైతం మనోజ్ఞంగా వర్ణించి తరించారు. నాయికా నాయకుల విరహముంది; సంభోగ శృంగారంలో సంతృప్తి ఉంది.

అలౌకిక సంభోగ శృంగార వర్ణనలో జయదేవ, అన్నమాచార్యులలో ఒకరిని మించి మరొకరున్నట్లు స్పష్టమవుతుంది. అలౌకికమైన రాధామాధవుల సంభోగ శృంగారం జయదేవుడు, అలమేలుమంగా శ్రీవేంకటేశ్వరుల సంభోగ శృంగారం అన్నమాచార్యుడు అత్యంత మధురమంజులంగా హాస్యసంభరితంగా వర్ణించడం వారిద్దరికే తగును. తక్కినవారు వారితో దీటుకాలేరు. అదే విశేషం. ఇందులో రాధామాధవుల సంభోగ శృంగారం క్రీడలో వారిద్దరి వస్త్రాలు పరస్పరం మారిపోవడంతో హాస్యముత్పన్నమైంది.

ప్రాతర్నీల నిచోల మచ్యుత
మురస్సంవీతపీతాంబరం
రాధాయాశ్చకితం విలోక్య
హసతి స్వైరం సఖీమండలే
వ్రీడాచంచల మంచలం
నయనయో రాధాయ రాధాననే
స్వాదు స్మైరముఖోయమస్తు
జగదానందాయ నందాత్మజః.

రాధామాధవులు రాత్రి యథేచ్ఛగా క్రీడించినప్పుడు ఇద్దరి వస్త్రాలు మారడం వల్ల కృష్ణుని పీతాంబరం రాధ, రాధ దుప్పటి కృష్ణుడు కప్పుకొని ఉదయం శయ్యాగారంనుంచి రాగా సఖులు నవ్వసాగారు. దానితో సిగ్గుపడి రాధాముఖావలోకనం చేసే కృష్ణుడు లోకానందదాయి యౌనుగాక !

ఇది పై శ్లోకార్థం. ఇందులో రాధా కృష్ణుల వస్త్రాలు మారడం తెలియకుండా శయ్యాగారం నుంచి బయటికి వచ్చినప్పుడు చెలికత్తెలు చూచినవ్వారట. అది గుర్తించి సిగ్గుతో రాధావలోకనంచేసే శ్రీకృష్ణుడు లోకానికి ఆనందాన్ని కలిగించుగాక అని జయదేవుడు ఆశిస్తున్నాడు. ఇందులో హాస్య ముత్పన్నమై ఆనందాపాది అవుతుంది.

ఇలాగే అన్నమాచార్యులలోను మనం చూడగలము. నాయికానాయకులైన అలమేలుమంగా శ్రీవేంకటేశ్వరులు సురతంలో పరస్పరం గుర్తులు మారడంతో హాస్యానికి అవకాశం కలుగుతుంది. అన్నమాచార్యులపదం—

మగవాపు నాదు మోవి మరుపు కొనినిద్దరు
సొగిపెద్దము చూపకై కూచుకొనేరిప్పుడు
కలికి కస్తూరిబొట్టు కాంతుని నొసలనంటె
నిలువునామము పై పై నెలత నంటె
అలివేణి కొప్పువారి అతనికొప్పు పై వాలె
అలపె సీతన్వాసిక అతని సేవట్టుపైని.
కుంకుమ గుబ్బల యింతి గురుతు విభునిపంటె
అంతె బలిరొమ్ము రొమ్ము అంటె నంపెను
కంకణాల గాజుల చేతు మనుని సందిటనెక్కె
మట్టెల పాదములపై మగడి నాతనెటుప
నిట్ట పెద్ద పాదాలు నిలిచెనందు
యిట్టె శ్రీ వేంకటేశు డింతిగూడి పానుపుపై
పట్ట పగలిందరిని భ్రమయించిరిదెవో.

(శృం. సం. 26-309)

అలమేలుమంగా వేంకటేశ్వరుల రతిసంభ్రమంలో పరస్పరవిరుద్ధమైనరీతిలో ఆయా గుర్తులు మారిపోయి హాస్య సముత్పత్తికి కారణం కావడంతో మనకు నవ్వు కలుగుతుంది. వాస్తవానికి దేవిదేవేరులు ఆడరూపు మగరూపు మార్చుకొన్న రీతిని చెలికత్తెలే గమనించారు. గమనించి వాళ్లే పరస్పర విరుద్ధ రూపాలను చూచుకొని ఆనందిస్తారు; చక్కటి అద్దం చూపండని చెలికత్తెలే అంటున్నారు. ఇది అత్యంత మలౌకిక శృంగారంలో కలిగిన మార్పుని వర్ణించి చెలికత్తెలను, తద్వారా మనలందరిని భ్రమింపజేసి హాస్యోత్పత్తికి కారణమై మనకానందాన్ని గూర్చడంలో అన్నమాచార్యులు కృతకృత్యులయ్యారు. ఈ రీతిగా అన్నమాచార్యులు తన సంకీర్తనల్లో వివిధ రసభావాలను వ్యంజింపజేయడంలో నిపుణులు.

జయదేవుడు రాధాకృష్ణుల రతి సమయంలో వస్త్రాల మార్పిడిచేసి హాస్య ముత్పన్నం చేశాడు. అన్నమాచార్యులు అలమేలుమంగా శ్రీ వేంకటేశ్వరుల రతి సంరంభంలో చిహ్నాలు మార్చి హాస్యం కలిగించాడు.

ఈ విధంగా ఇద్దరు మహావాగ్గేయకారులు అనేక విధాల తమ రచనల్లో సామ్యం గోచరించేలా వర్ణించి మనలను తరింపజేశారు.

# పురందరదాస సాహిత్యం

"దురిత వ్రాతము వెల్లను
పరిమార్చెడి హరిగుణముల బాడుచు నెప్పుడున్
పరవశుడై వెలయు పురం
దరదాసుని మహిమ మెంచ దలచెద మదిలోన్"

(ప్రహ్లాద భక్త విజయము)

అని నాదోపాసనతో ముక్తుడైన త్యాగరాజు పురందరదాసుని గూర్చి ప్రశంసించడం గమనించదగ్గ విషయం. ఇంతేకాదు 'దాసరందరే పురందర దాసరయ్యా'- 'దాసులు అంటే పురందర దాసేనయ్యా' అని తన గురువు వ్యాసరాయల పొగడ్తకు పాత్రుడైన పురందరదాసు మహా పురుషుడనడంలో సందేహం లేదు. అంటే గురువును శిష్యులు పొగడడం సహజం. కానీ ఇక్కడ శిష్యుడు గురుస్తుతికి అర్హుడు కావడం అపురూప విషయం. ఇలాగా గురువుల ప్రసంశకు పాత్రుడై, దాసకూటానికి ప్రధాన వ్యక్తిగా వ్యవహరించి, దానికి అస్తిత్వమిచ్చిన మహాపురుషుడు పురందర దాసు. కన్నడంలో పద రచనచేసి, సంగీతానికి స్పష్టరూపతనిచ్చి వాగ్గేయకారులలో ప్రముఖుడై, 'కర్ణాటక సంగీత పితామహు'డనే బిరుదుతో ప్రసిద్ధి కెక్కిన వాడు పురందరదాసు.

పురందరదాసు అన్నది అసలు పేరు కాదు. అతనికి ఎక్కువ పేర్లు ఉన్నట్లు తెలుస్తుంది. కానీ వరదప్ప నాయకపుత్రుడు శ్రీనివాస నాయక అన్నదే ప్రసిద్ధమైన పేరు,

శ్రీనివాస నాయకుని స్వగ్రామము పురందర ఘడమని కొందరి అభిప్రాయం. ఇది పూనా సమీపంలో ఉంది. ఈనాడు ఇది మహారాష్ట్రలో ఉన్నా కర్ణాటక రాజుల పాలనలోనే ఉండేది.

పురందరదాసు జీవిత కాలం 1484-1564 అని పలువురు కర్ణాటక విద్వాంసుల నిర్ణయం. కానీ 1407-1564 అని నా అభిప్రాయం. దీనికి కారణం ఉంది. తిరుపతిలో అప్పటికే తెలుగులో ప్రసిద్ధ వాగ్గేయకారుడై, సంకీర్తనాచార్యుడనీ, పదకవితా పితామహుడనీ బిరుదులు పొందినఅన్నమాచార్యుని పురందరదాసు సందర్శించినట్లు నిదర్శనముంది.

"తనరు పురందర దాసాహ్వయుండు
పరమ భాగవతుడై పరగుచు, సంద
వరకులాగ్రణియైన వైష్ణవోత్తముడు
. .... ... ... .. ..... . ...
............తాళ్ల పాక శాసనుడన్నమయ్య
వెన్నునిగానె భావించి కీర్తించి
సన్నుతిసేయ నాచార్య వర్యుండు
నతని విట్ఠలునిగా సంభావించెనపుడు"

అని అన్నమాచార్యుని (1408-1503) జీవిత చరిత్ర రచించిన అతని మనుమడు చిన్నన్న (1500-1558) మాటల వల్ల మనకీవిషయం తెలుస్తుంది. తన తాత చరిత్రను రచించిన చిన్నన్న మాటలను మనం విశ్వసిస్తే పురందరదాసు జననం 1470, వైకుంఠ ధామం చేరిన సంవత్సరం 1564 అనుకోవడంలో దోషంలేదు.

కమలాంబా వరదప్ప నాయకులకు అపురూపంగా జన్మించిన వారు శ్రీనివాస నాయకుడు. యుక్తవయస్సు రాగానే పుత్రునికి ఉపనయనం చేయించి, విద్యాభ్యాసం చేయించాడు తండ్రి. తన వృత్తి అయిన రత్న పరీక్షా పద్ధతిని పుత్రునికి నేర్పించాడు. బాల్యంలో సంపాదించిన విద్యలన్నీ శ్రీనివాస నాయకునికి భవిష్యత్తులో మిక్కిలి ఉపకరించాయి.

పద్దెనిమిదేండ్ల వయస్సులోనే శ్రీనివాస నాయకునికి సరస్వతీబాయితో వివాహం జరిగింది. ఆమె సంప్రదాయ కుటుంబంలో జన్మించింది. అతని ఇరవయ్యో

ఏటనే తండ్రి మరణంతో వజ్రాల వ్యాపారమూ, ఆర్జించిన ఆస్తిపాస్తులన్నీ శ్రీనివాస నాయకునికి సంక్రమించాయి. వజ్రాల వ్యాపారంలో అనతికాలంలోనే కోట్ల కొలది సంపాదించి, 'నవకోటి నారాయణ' అనే బిరుదును పొందినవాడు. అయితే అతడు పిల్లికి బిచ్చం పెట్టని లోభి. సంపాదన అధికమయ్యేకొద్ది పిసినారి తనం మరింత ఎక్కువైంది.

ఇలా ఉండగా ఒక విచిత్ర సంఘటన జరిగింది. ఒకదినం శ్రీనివాస నాయకుడు దుకాణంలో ఉండగా ఒక వృద్ధ బ్రాహ్మణుడు బాలునితో పాటు వచ్చి అతని ఉపనయనం కోసం ధన సహాయం చేయమని యాచించి, పసిగి ఏసారి 'ఇస్తారో ఇవ్వరో తేల్చి చెప్పండని అడిగాడు. శ్రీనివాస నాయకుడు అతనిని వదిలించుకోడానికి చెల్లని ఒకటి రెండు నాణాలు ఇచ్చి పంపాడు. ఆ ముసలి వాటిని గ్రహించి తిన్నగా శ్రీనివాస నాయకుని ఇంటికి వెళ్ళి, ఆతని శ్రీమతిని అర్థించి ఆమె ముక్కుపుడకను దానంగా గ్రహించాడు. మళ్లీ శ్రీనివాస నాయకుని వద్దకు పోయి దానికి వెలను కట్టి డబ్బిమ్మన్నాడు. నాయకుడు ఆశ్చర్యచకితుడై, అది తన భార్య ధరించే ముక్కుపుడక అని తెలుసుకున్నాడు. ఇంటికి వెళ్ళి చూడగా భార్య ముక్కున ముంగర లేకపోగా ఏమైందని అడిగాడు. భయంతో ఏమి చెప్పాలో తోచక పూజ మందిరంలో ప్రవేశించి విషపానం చేయాలనుకొన్న సమయంలో, దైవసంకల్పంతో ఆ గిన్నెలోనికి ముక్కుపుడక వచ్చి పడిందట ! పట్టరాని సంతోషంతో ఆముక్కెర తెచ్చి భర్తకిచ్చింది సరస్వతీబాయి. ఆశ్చర్యంలో మునిగిపోయిన శ్రీనివాస నాయకుడు భార్యనడిగాడు. ఆమె జరిగిన సంగతంతా చెప్పింది. ఇది సామాన్య విషయం కాదు. దైవమే వృద్ధుని రూపంలో వచ్చి తనకు కనువిప్పు కలిగించాడని తలంచాడు. అతని జ్ఞాన నేత్రం విప్పారింది. ఆ బ్రాహ్మణుని కోసం ఊరంతా వెదికాడు. ఎక్కడా కనిపించలేదు ఐహిక సుఖ విముఖుడై తన ఆస్తిపాస్తులు, నగనట్రా డబ్బు దస్కం సమస్తం పేదలకు పంచిపెట్టి బికారి అయ్యాడు. నిరుపేద తనాన్ని వరించాడు. తంబూర, తులసీ మాల ధరించి దాసుగా మారిపోయాడు. ఒకనాడు 'నవకోటి నారాయణు'డని బిరుదు వహించిన ధనవంతుడు. ఈనాడు భగవద్భక్తి సంపన్నుడైన దాసుడు.

ఆ సమయంలో విజయనగర రాజధాని అయిన హంపిలో వ్యాసరాయలు రాజగురువై ప్రసిద్ధికెక్కాడు. శ్రీనివాస నాయకుడు సకుటుంబంగా హంపికి వెళ్ళి

వ్యాసరాయలను దర్శించగా సంతోషంతో నాయకుని శిష్యునిగా స్వీకరించాడు. వ్యాసరాయలు అతనికి దీక్ష ఇచ్చినది మొదలుకొని అతనికి 'పురందరవిట్ఠలు' అన్న పేరు ప్రసిద్ధమైంది; అప్పటి నుంచి 'పురందర విట్ఠల' అనే ముద్రతో పదరచన చేయనారంభించాడు. పురందరదాసు పదాలన్నీ ఉపనిషత్తుల సారానికి తీసిపోనివి. అందుకే ఆ పదాలకు 'పురందరోపనిషత్తు' అని ప్రసిద్ధి వచ్చింది. పురందరదాసు చేసిన తీర్థయాత్రలన్నిటి కంటే తిరుపతి ముఖ్యమైంది. తిరుమల వేంకటేశ్వరుని ఉపముద్రతో అనేక పదాలు రచించడమే కాక, తిరుపతిలో ప్రసిద్ధ పదకారుడైన అన్నమాచార్యుని సందర్శించినట్లు మనం ముందే తెలుసుకొన్నాము.

పురందరదాసు జీవితంలో ఎన్నో విశేషాలు, మహిమలు నడచినట్లు ప్రతీతి ఉంది. విజయనగరంలో ఉన్నప్పుడే పురందరదాసు నిరాడంబరతను ప్రశంసించి, శ్రీకృష్ణ దేవరాయలు అంతఃపురానికి ఆహ్వానించాడు. అంతకుముందే సత్కరించి రాయలు కానుకలుగా ఇచ్చిన సంపదల్ని పేదలకు పంచిపెట్టినవాడు పురందరదాసు. తానిచ్చిన కానుకలు పురందరదాసుకు సంతృప్తినివ్వలేదేమో అని రాయలు ప్రశ్నించగా, పేదరికాన్ని స్వీకరించిన తనకు ధనధాన్యాలతో పనిలేదని తెలిపి, రాయలతో సవాలు చేస్తున్నట్లు ఈ పదం పాడి వినిపించాడట పురందరదాసు.

"నిమ్మ భాగ్య దొడ్డదో నమ్మ భాగ్య దొడ్డదో
సమ్మతినావు నీవు సాటిమాడి నోడువబన్ని"
'నీ భాగ్యం గొప్పదో నా భాగ్యం గొప్పదో
సమ్మతితో మీరు నేను సరిచూచుకొందాము రండి !'

ఈ పదం విన్న రాయలు అమితానందం పొందినట్లు ప్రతీతి ఉంది. ఇలాంటి వెన్నో వింతలూ, విశేషాలు జరిగినట్లు తెలుస్తుంది.

భక్తి ప్రబోధానికీ, నీతి నిర్దేశానికీ పురందరదాసు చక్కటి పదరచన చేసినట్లు గమనించగలం. ఆ పదాలు చదువుతున్నప్పుడు లోకన్యాయాన్ని గుర్తించి, అందులోని సహజత్వాన్ని గమనించినప్పుడు అతని సాహిత్యం గొప్పతనం స్పష్టమవుతుంది ; మనకెంతో ఆనందం కలుగుతుంది. ఇందుకు చక్కటి ఉదాహరణ :

"జాలియ మరదంతె - ధరెయొళు దుర్జనరు
జాలియ మరదంతె
మూలాగ్ర పరియంత ముళ్ల కూడిప్పంథె

బిసలలి బళలి బందవరిగె నెరళిల్ల
హసిదు బందవరిగె హణ్ణా ఇల్ల
కుసుమ వాసనె ఇల్ల కూడ్రలు స్థళవిల్ల
రసదల్లి స్వాదపు విషదంతె ఇరుతిహ"

ఈ పదంలో దుర్జనుని తుమ్మచెట్టుతో పోల్చి చెప్పాడు పురందరదాస "భూమిపై దుర్జనులు తుమ్మ చెట్టులాంటి వాళ్లు. కిందినుంచి పైదాకా ముళ్లు. ఎండకి బడలిక చెంది వచ్చినవారికి నీడలేదు. ఆకలిగొని వచ్చిన వారికి పళ్లూలేవు. పూలా వాసనలేనివి. కూర్చుండ స్థలమే లేదు. కాయల రసం విషంలాగా కటువుగా పు టుంది."—ఇలాగే దుష్టులు సైతం పరోపకారులు కారు. పైగా హాని చేసేవారు ఇలాంటి ఉదాహరణలు ఎన్నైనా ఇవ్వవచ్చు. అంతేగాదు, పురందరదాసు పదాలన్నీ మనోజ్ఞమై, సందేశాత్మకమై వుంటాయి. అది ఆయన సాహిత్య మహాత్మ్యం.

పురందరదాసు పదాల్లో అలంకారాలు తమకుతామే వచ్చి చేరిపోయి, అంద చందాల్ని, జిగిబిగిని పదాలకు చేకూర్చాయి. స్వభావోక్తికి చక్కటి ఉదాహరణ :

"దంతగళు సడలిదవు ధాతుగళు కుందిదవు
కాంతెయరు జరెదు ఓకరిసువరో
చింతెయన్నేతకె బయలాద దేహక్కె
ఇంతెందు శ్రీకాంతన నెనె మనవె"

'పండ్లు సడలిపోయాయి. ధాతు పటుత్వం తగ్గిపోయింది. స్త్రీలుదూషించి అసహ్యించు కొంటున్నారు : శుష్కించిన దేహానికి చింతఏల ? ఓ మనసా ! ఇది తెలిసి శ్రీకాంతుని భజించు.' — అంటూ చాల చక్కగా స్వభావోక్తిలో ముసలితనాన్ని వర్ణించాడు : భక్తిని ప్రబోధించాడు.

హరి సర్వోత్తముడు : ఆత్మనివేదన పూర్వకమైన భక్తి ప్రధానం. భక్తి లేని తక్కిన ఆడంబరాలు అనవసరమని పురందరదాసు ప్రగాఢవిశ్వాసం.

"కలియుగదొళు హరి నామవ నెనెదరె
కులకోటిగళు ఉద్ధరిసువువు
సులభము క్తిగె సులభవెందెనిసువ
జలరుహ నాభన నెనెమనవె"

'కలియుగంలో హరినామ స్మరణం
కులమంతటినీ తరింపజేస్తుంది తథ్యం
సులభమైన ముక్తికి అతి సులభమైన
జలరుహనాభుని తలచుము మనసా' —

— ముక్తి కోసం భక్తి ప్రధానం. ముక్తినిచ్చే హరి నామ స్మరణ చేయడమే మంచిదంటాడు.

నీతిని బోధించి, వైరాగ్యాన్ని వివరించిన వాడు పురందరదాసు. వైరాగ్యాన్ని పలువిధాల ప్రవచించాడు.

"విషయద విచారబిడు విహిత కర్మమాడు
వైరాగ్య భాగ్య బేడు
విషవెందు కామక్రోధంగళెల్ల నీడాడు
మానస మనవె మాధవన కొండాడు" —

— విషయాసక్తిని వదలు, విహితకర్మమాచరించు ; వైరాగ్య భాగ్యాన్ని వేడుకో. కామక్రోధాదులన్నిటిని విషమని పరిత్యజించు. మసణమైన మనసా మాధవుని పొగడు - అంటూ చక్కగా తెలిపాడు.

పురందరదాసు కర్ణాటక సంగీతానికి చేసిన సేవ అమూల్యమైనది. 'కర్ణాటక సంగీత పితామహు'డని అతనికి బిరుదు. తరువాత వచ్చిన సంగీత ప్రపంచమంతా పురందరదాసు ఆరంభించిన కర్ణాటక సంగీతం మీదనే ఆధారపడింది. అపూర్వ రాగాలతోపాటు ప్రసిద్ధరాగాలను సైతం పురందరదాసు రచించాడు.

పురందరదాసు తరువాత వెలసిన వాగ్గేయకారులందరు అతనివల్ల ప్రభావితులైనవారే. అన్నమాచార్యులు, పురందరదాసు ఇద్దరినుంచి పదరచనా రీతిని, సంగీత పద్ధతిని గ్రహించి, అభినయాన్ని జోడించి పదరచన చేసి ప్రసిద్ధుడైనవాడు క్షేత్రయ్య. పురందరదాసును త్యాగరాజు ప్రస్తుతించిన విషయం ముందే తెల్సుకున్నాము. పురందరదాసు సంగీత రీతుల్ని గ్రహించి, నాదోపాసనలో ముక్తి పొందినవాడు త్యాగరాజు. ముత్తుస్వామి దీక్షితులు, శ్యామశాస్త్రి మొదలైన సంగీతో

పాసకులు పురందరదాసుకు ఋణపడినవారే. ఇలాగ కర్ణాటక సంగీతానికి ఎ సేవ చేసిన మహానుభావుడు, ఉత్తమ వాగ్గేయకారుడు పురందరదాసు.

మానవ జీవితాన్ని సముద్ధరించిన మహా మహాత్ముడు పురందరదా ఎల్లప్పుడు అందరికీ వందనీయుడు పురందరదాసు. అతని సాహి అజరామరం !

— o —

# అన్నమాచార్య పురందరదాసుల సమాగమం

అన్నమాచార్యుడు తెలుగులో సంకీర్తనాచార్యుడనీ, పద కవితాపితామ డనీ ప్రసిద్ధికెక్కిన అత్యుత్తమ వాగ్గేయకారుడు. వెంకటేశ్వరునిపై అధ్యా శృంగార పదాలు, వేలలో రచించి తరించిన మహాభక్తాగ్రేసరుడు. పదరచన తత్ప్రచారం గావించిన మొదటి వాగ్గేయకారుడు అన్నమాచార్యుడే. కడప మండ లోని తాళ్లపాక ఇతని స్వగ్రామం. కానీ బాల్యంలోనే వేంకటేశ్వరుని దర్శనార్థ వెళ్లి రచనావ్యాసంగం చేయమొదలిడిన తాను క్రమంగా తిరుమలలోనే నివ మేర్పరచుకొని వేంకటేశ్వరునిపై దినానికొక పదం చొప్పున నియమం తప్ప రచన చేస్తూవచ్చిన వాడు. క్రమంగా పుత్రపౌత్రులు ఈ కార్యక్రమాన్ని ఎడతె కుండ కొనసాగించి తిరువెంగళనాథుని సేవించిన మహాభక్తులు. సంకీర్తనలి రచిస్తూ పాడుతూ తద్వారా వైష్ణవ మత ప్రచారానికి సైతం ప్రయత్నించిన వా అన్నమయ్య. ఇలాంటి అన్నమయ్యను పురందరదాసు సందర్శించి శ్రీ విష్ణువుగా కీర్తించగా అన్నమయ్య సైతం అతన్ని విఠలునిగానే సంభావించాడట అన్నమయ్య పురందరుని పూర్వనామం శ్రీనివాసు. తన తండ్రి కోటికి పడగెత్తిన వజ్రా వ్యాపారి వరదప్ప. వ్యాపార మూలకంగా సంపాదించిన ఆస్తి అంతా తండ్ర మరణానంతరం శ్రీనివాసుకి సంక్రమించింది. ఒకానొక సంఘటన మూలకంగ ఐశ్వర్యం సర్వనాశనకారి అని సంభావించి సర్వ సంపదని బీదలకు పంచిపెట్ట భిక్షారి అయి భార్యా సమేతంగా విఠలుని ఇష్టదైవంగా గ్రహించి పదాలు, పాడుతూ

ఊరూరా తిరిగి ఉదరపోషణ చేసుకొంటూ చివరికి విజయనగరం చేరి వ్యాసరాయని శిష్యుడై వైష్ణవ మత ప్రచారం చేయనారంభించాడు. ఆ సందర్భంలోనే ఒకసారి తిరుపతిలో పురందరదాసు అన్నమయ్యను దర్శించడం జరిగింది. కర్ణాటక సంగీత పితామహుడన్న బిరుదుకు నోచుకొన్న ఘనుడు పురందరదాసు. కర్ణాటకలోని దాస కూటానికి ప్రధాన పురుషుడు పురందరుడు.

చిన తిరువెంగళ నాథుడనే చిన్నన్న కృతమైన ద్విపద 'అన్నమాచార్య చరిత్రము'ను పరిష్కరించి, విపులమైన అన్నమాచార్య చరిత్ర పీఠికను రచించిన వారు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. వారి పర్యవేక్షణలో 1949లో అచ్చైన గ్రంథం వల్ల అన్నమయ్య పురందరుల సమాగమం తెలిసింది.[1] దీన్నే పేర్కొన్నారు తమ ఆంధ్ర వాగ్గేయకార చరిత్రలో శ్రీ బాలాంత్రపు రజనీ కాంతరావుగారు.[2] ఈ విషయం విపులీకరించిన వారు డా. వేటూరి ఆనందమూర్తిగారు.[3]

దీనికంతటికీ మూలం చిన్నన్న రచించిన అన్నమాచార్య చరిత్ర. అందులోని ద్విపద పంక్తులివి.

"గద్యపద్యముల చెప్పెడి రెండు మంది
యాద్యులచే గొనియాడించుకొన్న
రసికుండు శ్రీ పండరంగ విట్ఠలుడు
కొసరెడు భక్తి చేకూర జేసేత
నెనయ సంధ్యలకు నీళ్లియ్య జేకొనుచు
దనరు పురందర దాసాహ్వయుండు
పరమ భాగవతుడై పరగుచు సంద
వర కులాగ్రగణితుడైన వైష్ణవోత్తముడు
సవరించు మురవైరి సంకీర్తనములు
కువలయంబున చేదుకొన్నమాత్రమున
తలచిన భూత భేతాళ పిశాచ
ములు పాఱిపోవనిమ్ముల కుగంబెసగ
ఘనిఘని తనలోన వెఱగందికొనుచు

చన తాళ్ళపాక శాసనుడన్నమయ్య
ఎన్ననిగానె భావించి కీర్తించి
సన్నుతి సేయ నాచార్య వర్యుండు
నీతని విట్ఠలునిగా ననయంబు దలచి
ప్రతి లేని గతుల సంభావించెనపుడు" [4]

ఇందులో తాతగారైన అన్నమాచార్యుని (1408-1503) జీవితచరిత్రను మనుమడు చిన్నన్న (1500-1558) రచించడంవల్ల దీనిని మనం చారిత్రక సత్యంగా గ్రహించడంలో అసామంజస్యంలేదు.

కానీ విద్యారత్న ఆర్. ఎస్. పంచముఖిగారు మాత్రం అన్నమయ్య పురందరుల పరస్పర సందర్శనాన్ని శంకించారు. అందుకు వారు చూపిన కారణాలు ఇవి.[5] చిత్తశుద్ధిగల మాధ్వుడైన పురందరదాసు అన్నమాచార్యుని విష్ణువుగానే భావించి కీర్తించడం జరగడానికి వీల్లేదు.[6] విద్యానగరంలో వ్యాసరాయల వద్ద ఉపదేశం పొందాక పురందరదాసనే పేరితోటి పదరచన ప్రారంభించాడు. వ్యాసరాయలు 1500 తరువాత గాని విద్యానగరానికి రాలేదు. కాబట్టి 1500 తరువాత వ్యాసరాయల శిష్యుడైన పురందరదాసు అన్నమాచార్యుని దర్శించి యుండడు. ఇవి అంత సమంజసమైన కారణాలుకావని డా. వేటూరి ఆనందమూర్తిగారు నిరూపించారు. "వ్యాసరాయలవారు (క్రీ. శ. 1446-1539) పంద్రెండేండ్లపాటు తిరుపతిలో శ్రీనివాసుని ఆలయమున నర్చకత్వము నెరపుచు క్రీ. శ. 1486-1498 నడుమ పలుమారులు విద్యానగరమునకు వెళ్ళివచ్చుచుండిన వారలే. 1489లో వెళ్ళి అక్కడే స్థిరపడిన వారును, అందువలన ఆ పంద్రెండేండ్ల వ్యవధిలోగాని, కాదను కొన్న పక్షమున క్రీ. శ. 1498లో గాని పురందరదాసు వ్యాసరాయల నుపదేశ గురువుగా భావించి గ్రహించియుండును. అట్టియెడ చిన్నన్న వ్రాసినట్లు "పరమ భాగవతుడగు అన్నమయ్యను (అతని అవసానకాలమగు) 1503లోగానెన్నడేని దర్శించి యుండుటలో నసంభావ్యమేమియును లేదు."[7] దీనికాధారంగా కన్నడంలో సోమనాథ కవీశ్వర కృత 'వ్యాసయోగ చరితము'ను దానికి శ్రీ బి. వెంకోబరావు గారు రచించిన సమగ్ర పీఠికను గ్రహించారు డా. ఆనందమూర్తిగారు. 1486 నుంచి విద్యానగరంతో సంబంధం కలిగియుండిన వ్యాసరాయలు 1498లో స్థిరపడినట్లు

పేర్కొన్నారు డా. ఆనందమూర్తిగారు కానీ డా. ఆనందమూర్తిగారు పేర్కొన్న సోమనాథకృత 'వ్యాసయోగ చరితము' ననుసరించే 1470 నుంచే వ్యాసరాయలు విద్యానగరంలో ఆధ్యాత్మికాధిపత్యం నెరపినట్లు డా. ఎమ్. వి కృష్ణారావుగారు స్పష్టంగా వివరించారు. "He (Vyasaraja) was also the guardian saint of the Vijaya nagar empire, and according to Somanatha's description, he spiritually dominated the empire from 1470 A. D. till his death in 1539 A. D. He was to Saluva Nara simha I as Dattatreya : was Kartiviryarjuna to Saluva Nara simha II a Brhaspathı, to Narasa the guardian angel Babarayana and to Krishnadevaraya as Lord Krishna to sons of Pandu and Kunthi. Vyasaraja was Kuladevata to the Royal family and he founded many Agraharams and was closely associated with the rulers in their conquests and administration ;[8] ఈ విషయాన్ని డా. ఆనందమూర్తిగారు ఉట్టంకించి కూడా సోమనాథ కవి కృతమైన 'వ్యాసయోగి చరితము' లోని విషయాల్ని సమర్థించగల శాసనాలు లభించ లేదని పేర్కొన్నారు. దీన్ని సమర్థించే శాసనాలతో పనిలేదని మనమిక్కడ భావించడమే సముచితం. కారణమేమంటే సోమనాథ కవి స్వయాన "వ్యాసరాయల శిష్యుడు," ఈ విషయం స్పష్టంగా తెరుస్తుంది. "Chronologicolly after Jayateertha, the most out-standing personality among Vaishnava pontiffs was Vyasaraja whose life has been vividly described by poet Somnnatha in his Vyasayogi Charitam. Somanatha was himsely a desciple of Vyasayogi whose Matha was the Principal University in the city of Vijayanagar"[9] ఇలాగే వ్యాసరాయని శిష్యుడై యుండి వారి జీవితచరిత్రని "వ్యాసయోగి చరిత" మన్న పేరుతో రచించిన సోమనాథకవి మాటలను మనం ప్రామాణికంగా గ్రహించడం సముచితం. కాబట్టి 1470 నుంచి 1539 వరకు విజయనగరంలో ఆధ్యాత్మికాధిపత్యం నెరపిన వ్యాసరాయల శిష్యత్వం 1470-1539 మధ్యకాలంలో పొంది ఉంటాడు పురందరదాసు అనటం సమంజసమే. అన్నమాచార్యుని మరణం 1503లో

కాబట్టి చివరిదశలో సందర్శించి ఉండవచ్చునన్న డా॥ ఆనందమూర్తిగారి మాటలు సైతం విశ్వసనీయాలే. అయితే ఒక చిక్కు ఉంది. పురందరదాసు జీవితకాలం 1484-1564 అని పలువురు కర్ణాటక విద్వాంసుల అభిప్రాయం.[10] సంపదల్ని త్యజించి ఆలు పిల్లలతో వెళ్లి గురూపదేశం పొంది అన్నమయ్యను దర్శించడానికి తిరుపతికి వచ్చే సమయానికి పురందరుని వయస్సు పైని పేర్కొన్నదాని ప్రకారం కుదరదని స్పష్టమవుతుంది. అంటే అతని జననం 1484 అని తలిస్తే 1503 ప్రాంతంలో పురందరదాసు అన్నమయ్యను 20 ఏళ్లలో దర్శించాడనటం సమంజసం కాదు. కాబట్టి స్వగ్రామాన్ని, సంపదల్ని పరిత్యజించి పేదరికాన్ని కొని తెచ్చుకొని భగవంతునిపై భక్తి ప్రపత్తులతో పాడుతూ బయలుదేరి వెళ్లి గురూపదేశం పొందిన ఆ వెనుక శ్రీనివాసుడు పురందరదాసుగా మారి పదరచన చేస్తూ పాడుతూ ప్రజలకు భక్తి జ్ఞాన, వైరాగ్య మార్గాల్ని చూపిస్తూ విజయనగరంలో ఉంటూ అహోబిలం, కంచి, వేలూరు మొదలగు క్షేత్ర సందర్శనం చేసుకొంటూ[11] వెళ్లి తిరుపతిలో అప్పటికే ప్రసిద్ధుడైన అన్నమయ్యను సందర్శించి ఉంటాడనటం న్యాయం. అంటే పూర్వోక్తమైనట్లు అన్నమయ్య చరమదశలో సందర్శించి ఉంటాడనడం వల్ల పురందరదాసు వయస్సు అప్పటికి సుమారు 30 సవంత్సరాలు పైబడి ఉండవచ్చు. కాబట్టి మూడు దశకాల వయస్సు అనంతరం దర్శించాడను కోవడంలో దోసగులేదు. పైపెచ్చు ఇదే సముచితం. అయితే ఇతడు తన 40వ ఏట ప్రసిద్ధ మాధ్వగురుపైన వ్యాస తీర్థులవద్ద ఉపదేశం పొంది పురందరదాసుగా పేరు మార్చుకొన్నాడు.[12] అని శ్రీ బొడ్డుపల్లి రజనీ కాంతరావుగారు పేర్కొన్నారు.

తన వలభయ్యోయేట గురూపదేశం పొందాడంటే ఆ తరువాతగాని తిరుపతిలో ప్రసిద్ధ సంకీర్తనాచార్యులైన అన్నమాచార్యుని దర్శించే అవకాశమే లేదు. కాబట్టి పైన పేర్కొన్న విధంగా తన ముప్పయ్యోఏట గురూపదేశం పొందాక పురందరదాసు అన్నమయ్యను అతని చరమదశలో దర్శించి ఉంటాడనటం చక్కగా కుదురుతుంది. శ్రీ రజనీ కాంతరావుగారే "20వ యేట పురందరుని తండ్రి మరణించాడు. తండ్రి చేస్తూ ఉండిన రత్న వ్యాపార భారమంతా కుమారుని తలపై పడింది. అతని చాతుర్య సామర్థ్యాలవల్ల వ్యాపారం బాగా వృద్ధి అయి కోటీశ్వరుడై తోటి వర్తకులచేత నవకోటి నారాయణ అనిపించుకొనేవాడు"[13] అని

పేర్కొన్న దాన్ని బట్టి తన ఇరవయ్యో ఏట తండ్రి మరణానంతరం అచిర కాలం లోనే గొప్ప ధనవంతుడైన పురందరదాసు తన 30 ఏండ్ల వయస్సులో, కలిగిన వృద్ధ బ్రాహ్మణుని సంఘటనానంతరం సంపదలపై రోసి, పరిత్యజించి విజయ నగరం వెళ్లి వ్యాస తీర్థుల వద్ద ఉపదేశం పొంది ఆ వెనుక ఒకటి రెండు సంవత్స రాల్లో అంటే అన్నమాచార్యుడు 1503లో దివంగతుడు కాక ముందే అన్నమా చార్యుని సందర్శించి ఉంటాడని గ్రహించవచ్చు. ఇది నిర్బాధకం. దీనికి తోడు డా. ఆనందమూర్తిగారు ఊహించినట్లు పురందరుని కాలం 1470-1564 అనడం సముచితం.[14] అంటే సోమనాథకవి తన గురు జీవితాన్ని గూర్చి 'వ్యాసముని చరితం' సత్యమని, విశ్వసించినట్లే చిన్నన్న తన తాత జీవితచరిత్ర "అన్నమా చార్య జీవిత చరిత్రము" ను విశ్వసించి అన్నమాచార్య పురందరదాసుల సందర్శ నం సంభావ్యమే అని భావించి, దీని ఆధారంగానే పురందరదాసు జీవితకాలాన్ని మనం నిర్ణయించుకోవడం అత్యంత సముచిత విషయమని స్పష్టమవుతుంది.

అన్నమాచార్య పురందరదాసుల సమాగమాన్ని గూర్చి చిన్నన్న చెప్పిన విషయాల్ని పేర్కొని దానికి సహకారంగా "పురందరదాసుల వారన్నమాచార్యుల సంకీర్తనముల ననుకరించి సంకీర్తనముల రచించిరి. మచ్చునకొక్కటి :

మాళవి రాగం

"శరణు శరణు సురేంద్ర సన్నుత శరణు శ్రీసతి వల్లభా
శరణు రాక్షస గర్వ సంహార శరణు వేంకట నాయకా ॥పల్లవి॥

భజన పద్ధతిలో అన్నమాచార్యునిదిగా నాటి నుండి నేటి దాక సాగుచున్న యీపై సంకీర్తనము జదివి పురందరదాసుగారి యీ క్రింది సంకీర్తనమును గూడ చదువుడు.

మాళవి రాగం

"శరణు శరణు సురేంద్ర వందిత శరణు శ్రీపతి సేవిత
శరణు పార్వతి తనయ మూరితి శరణు సిద్ధివినాయక ॥పల్లవి॥

అన్నమాచార్యుల వారి సంకీర్తన ఛాయనే పురందరదాసుల వారి కీర్తన మున్నది[15] అని వివరించారు. ఇదే రీతిని వివరించారు శ్రీ బాలాంత్రపు రజనీ

కాంతరావుగారు.[16] వీటికి మరికొన్నింటిని జోడించి చెప్పారు డా. వేటూరి ఆనంద మూర్తిగారు.[17] ఇవేగాదు ఇంకా అనేక సాదృశ్యాలున్నాయి. ఇతర పదాల్లో సన్నిహితమైన పోలికలతో పాటు అన్నమయ్య పురందరులు స్మరించిన దేవతలు, ప్రకటించిన భావాలు, భక్తి జ్ఞాన వైరాగ్యభావనలు మొదలైన పెక్కు విషయాలలో చక్కటి సామ్యం గోచరిస్తుంది. కాబట్టి వీటన్నిటినీ బట్టి అన్నమాచార్యుని పురందరదాసు సందర్శించాడని విశ్వసించడంలో విప్రతిపత్తి లేదు.

కాగా మాధ్వుడైన పురందరదాసు అన్నమయ్యను దర్శించి ఉండడన్న విషయాన్ని పరిశీలిద్దాం. 'ఇక మాధ్వుడగు పురందరదాసు అన్నమయ్యను "వెన్నునిగానె భావించి కీర్తించుట' యొసగదను పంచముఖిగారి యభిప్రాయము వారి దృష్టితో సరియే కావచ్చును. కాని అది ఈ సమావేశము జరిగిన యెంతో కాలమునకు వైష్ణవ సంప్రదాయమునకు చెందిన చిన్నన్న చెప్పిన తీరని మనము సరిపెట్టుకొన వలెను"[17] అని డా. ఆనందమూర్తిగారు సమాధానపరుస్తున్నారు. ఇది సమంజసం కాదు. పైపెచ్చు పంచముఖిగారి దృష్టిలో సరియేకావచ్చునన్న విషయాన్ని మనం అంగీకరించలేము. పురందరదాసు గాని అతని గురువు వ్యాసరాయలుగాని - తాము ద్వైత మతానుయాయులైనా - ఈ భేద భావాన్ని పాటించలేదనడానికి ఎన్నో ఉదాహరణలు మనం చూపించవచ్చు. హరిదాసులన్న వారికి కులం, మతం, జాతి అనే భేదాలుండవన్న సంగతి సర్వజన విదితమే. మాధ్వుడైనా పురందరదాసు అహోబిలం, కంచి, బేలూరు, అలాగే తిరుపతిని దర్శించిన వాడన్న విషయం పూర్వోక్తం. ఆయా దేవతలపై ఉపముద్రతో పదాలు రచించి పాడారు. ఇంక కులం, మతం మొదలైన వాటిని లెక్కచేయనందువల్లే జీవితంలో కొన్ని కష్టాల్ని ఎదుర్కొన్నాడట పురందరదాసు. "There are many stories current about his daily rounds, his embarrasments at the visits of his rich relations, his extreme struggle to wean himself and his family from the temptations of wealth and fortune, his conflicts with the orthodoxy and the rich, who were disdainful of Puranadara's casteless, universal out-look and of his Bhajana Gosthis which consisted of all classes of people."[18] ఈ శిష్యుడు గురు ప్రశంసకు నోచుకున్న మాన్యుడు. "Sri Vyasaraja who

was Guruvarya and Swarupodharaka, himself has sung in praise of his own desciple Purandara in the words" "Dasaran–dare Purandaraasdaiayya"[19] ఇలా శిష్యుని ప్రశంసించిన వ్యాసరాయలు మతసహనం గలిగిన మహాయోగి "Vyasaraja was not a sectarian and he wa tolerant of all forms of belief and variants of Hindu religion : this is borne out by the conferment of Inkita on Purandara, Somanatha and Kanaka of Kurubar community, and at the same time receiving from Basava Bhatta of Kalinga, a Sivalinga and worshipping the Linga installed in his Matha and Saraswathi Peetha on Mahasivaratri days."[20]

పురందరదాసు ఈ పదంలో "కనక దాసన మేలదయ మాడలు వ్యాసముని" అని ప్రశంసించడమేగాదు, పురందరదాసు విఘ్నేశ్వర స్తుతితో పాటు శివస్తుతి చేశాడు.

## విఘ్నేశ్వర స్తుతి

"శరణు శరణు సురేంద్రవందిత శరణు శ్రీపతి సేవిత
వరణు పార్వతి తనయమూరితి శరణు సిద్ధివినాయక"
— ఇది పూర్వోక్తం. ఇలాంటివే :
"వందిసువుదాదియలి గణనాథన"
"గజవదన బేడువె గౌరీతనయ" (1)
— ఇలాగే శివస్తుతి చేయడం విశేషం :
"కండె కరుణానిధియ - గంగెయమండె యోళిట్టదొరెయ

॥ప॥

శివనరుండమాలె సిరియనౌస మొళ కెండగణ్ణిన బవెయహరన

॥అ॥

గజ చర్మాంబరగౌరీవర జగదీశ్వర నే
త్రిజగన్మోహన నత్రిపురాంతక త్రిలోచన శివన హరన

॥కండె॥

దరెగె దక్షిణ కాశియెనిసువ పురపంపా వాసి
కాకనృపవేశిపురందర విఠలన భక్తరపోష
॥౮०

ఇందువల్ల పురందరదాసు మతసహనం మనకు స్పష్టమైంది.

ఇలాంటి గురుశిష్యులు మాధ్వులైనప్పటికీ మతసహనం కలిగి ఉండట మూలాన్నే "సర్వం విష్ణుమయం జగత్" అన్నట్లు చూడగలిగారు. అలాంటి సం ర్భంలో చిత్తశుద్ధిగల మాధ్వుడైన పురందరదాసు అన్నమాచార్యుని వెన్నునిగా భావించి కీర్తించి ఉండడం పొసగదన్న శ్రీ పంచముఖిగారి మాటలకు ప్రాధాన్య లేదు. ద్వైతామతానుయాయులైన మాధ్వులు శ్రీరామానుజానుయాయులను గౌరవిం చక పోవడమన్నది బహుశా ఇటీవల విషయంకావచ్చు. అందువల్ల చిన్నన్న పేర్కొన్నట్లు పురందరదాసు అన్నమాచార్యుని

"వెన్నునిగానె భావించి కీర్తించి
సన్నుతి సేయ నాచార్య వర్యుండు
నీతని విట్ఠలునిగా ననిశంబు దలచి

ప్రతిలేని గతుల సంభావించె" ననడం ఎంతైన సమంజసమై సంగతి అనడంలో అత్యుక్తి లేదు. కాగా అన్నమాచార్య పురందరదాసుల సమా గమం తిరుపతిలో జరిగిందనడంలో విప్రతిపత్తి లేదు.

సూచికలు :

1) అన్నమాచార్య జీవితచరిత్ర : పీఠిక : పు. 66-68
2) ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము : పు. 113, 114
3) తాళ్లపాక కవుల పదకవితలు-ద్వి.భా. : పు: 43-51, 557, 557
4) పై 1 లోనిది. పు. 44, 45
5) పై 3 లోనిది - అధోజ్ఞాపిక. పు. 44
6) పై దే. పు. 44, 45
7) పైదే. పు. 39, 40

# అన్నమాచార్య పురందరదాసుల సాదృశ్యాలు

1.0 'సంకీర్తనాచార్య, పదకవితా పితామహ' అనే అరుదైన బిరుదాంచితుడైన వాడు అన్నమాచార్యుడు; 'కర్ణాటక సంగీత పితామహ' అనే బిరుదుతో ప్రసిద్ధి కెక్కినవాడు పురందరదాసు. వీరిద్దరు సమకాలికులు. పైపెచ్చు పరస్పర సందర్శన సంభావితులు. ఒకరు తెలుగులో పదరచనా పరంపరకు ఆద్యులు; మరొకరు కర్ణాటకలో దాస సాహిత్యానికి దోహదం చేసిన మహానుభావుడు. పురందరదాసు దాస కూటానికి ప్రధాన వ్యక్తి; 'దాసరెందరె పురందర దాసరయ్య'-అని కన్నడంలో ప్రసిద్ధికెక్కిన వాడు. అన్నమాచార్య శ్రీ వేంకటేశ్వరుని పై 32 వేల పదాలు రచించినట్లు తెలుస్తోంది. అవన్నీ అతని పుత్ర పౌత్రులు రాగి రేకులపై లిఖింపించి, భద్రపరచడం వల్ల అన్నమయ్య రచించిన చాలా పదాలు ఈనాడు లభ్యమవుతున్నాయి. 1934లో ఆరంభించి తిరుమల తిరుపతి దేవస్థానం వారు ప్రకటిస్తూ ఉన్నారు. పురందరదాసు 4,75,000 పదాలు రచించినట్లు ప్రతీతి ఉన్నా ఈనాడు సుమారు ఐదారు వందల పదాలు మాత్రమే లభ్యమవుతున్నాయి. ఇద్దరు హరినామస్మరణంతో తరించిన భక్తాగ్రేసరులు. ఇద్దరు తమ తమ భాషలో పదరచనచేసి సామాన్య ప్రజల్ని ఉద్బోధించిన మహాపురుషులు. భక్తి జ్ఞాన నీతి వైరాగ్యాల్ని పదాల్లో ప్రకటించి, ప్రబోధించి ప్రజల్ని మేల్కొల్పిన వైతాళికులు; రామానుజుల అనుయాయి అన్నమాచార్య; మధ్వాచార్యుల మతానుయాయి పురందరుడు. అయినా జాతిమత కులాతీత వ్యక్తులు ఇద్దరు.

## 1.1 జీవిత విశేషాలు :

అన్నమయ్య మిక్కిలి చిన్న వయస్సులోనే విరక్తుడై కలియుగ వైకుంఠమైన తిరుమలలో వెలసిన శ్రీ వేంకటేశ్వర సందర్శనార్థమై వెళ్లి తెలియక కష్టాలను ఎదుర్కొని స్వామి దర్శనం చేసుకొని, అనేకపదాలు రచించి పాడడం, అచటి అర్చకుల్ని ఆశ్చర్యచకితుల్ని చేయడం మొదలైన విశేషాలు మనల్ని సంభ్రమాశ్చర్యాల్లో ముంచి వేస్తాయి. ఆ వెనుక తలిదండ్రులు వెదకి అన్నమయ్యను తాళ్ళపాకకు తీసుకొని పోయి యుక్త వయస్కుడు కాగా ఒకరు కాదని ఇద్దర్ని పెళ్లిచేయటం, ఆ వెనుక గూడా వైరాగ్యంతో భక్తి ప్రపత్తుల్ని ప్రకటిస్తూ క్రమంగా నివాసం తిరుమలలో శ్రీనివాసుని సన్నిధిలోనే స్థిరపరచుకోవడం, జీవితాంతం అనేక శృంగార, అధ్యాత్మ పదాలు రచించి, పాడి, ఆడి తరించడం జరిగింది. మహా సంపన్నుడైన వజ్రాల వ్యాపారి వరదప్ప పుత్రుడై, తండ్రి తదనంతరం తాను సైతం నవకోటి నారాయణుడనిపించుకొన్న శ్రీనివాసుడు తన జీవితంలో కలిగిన ఒకానొక సంఘటన మూలంగా వైరాగ్యంలోకి దిగిపోవడం జరిగింది. అతను మిక్కిలి పిసినారి. కానీ భార్య మాత్రం ఉదార హృదయ. పిల్లికి సైతం బిచ్చం వేయని పిసినారి శ్రీనివాసుడు. ఒకానొక పేద బ్రాహ్మణుడు సహాయార్థం వచ్చి తిరస్కృతుడై, శ్రీనివాసుని భార్య

వచ్చ మొక్కరసు దాహంమతిగా పొంది, తనికి దబ్బిస్కుని శ్రీనివాసుని దగ్గరకి వెళ్లగా, అది తనభార్య ముక్కుపుడక అని గుర్తించి వెంటనే ఇంటికి వెళ్ళిభార్యను గద్దించగా ఆమె నిస్సహాయస్థై. పూజాగృహంలో ప్రవేశించి విషాన్ని పానంచేసి మరణించ ఉద్యుక్తురాలు కాగా, అలాంటి పుడక గిన్నెలో లభించంగా దానిని భర్త కిస్తుంది. భర్త ఆశ్చర్యంతో జరిగిన సంగతి గ్రహించి,సంపదలపై వ్యామోహాన్ని తెంచుకొని, నిరుపేద జీవితాన్ని స్వీకరించి, ఆలుపిల్లలతో పురందరవిట్ఠలునిపై పదాలు పాడుతూ వెళ్లి విజయనగరంలో ఆధ్యాత్మికంగా, రాజగురువైన శ్రీ వ్యాసరాయని ఉపదేశం పొంది, పూర్వ నామం వదలి పురందరదాసు అనే పేరుతో పద రచన చేస్తూ భక్తి జ్ఞాన వైరాగ్య నీతి బోధచేస్తూ బిచ్చమెత్తుకొని జీవితంగడుపుతూ ఉండేవాడు. అదే సందర్భంలో తిరుపతిలో అత్యంత ప్రసిద్ధ పదకర్త అయిన అన్నమాచార్యుని సందర్శించి విష్ణుస్వరూపునిగా భావించి గౌరవించాడు. అదేరీతిని పురందరదాసుని సైతం అన్నమాచార్యుడు పురందర విట్ఠలునిగానే సంభావించాడు.

ఈ ఇద్దరు రాజులని ధిక్కరించినవారే. అన్నమయ్య వేంకట శైలపతిపై శృంగార పదాల రచన చేసి పాడుచూ ఎంతగా సంతోషించినవాడూ, అతని బాల్య స్నేహితుడూ, టంగుటూరు మండలాధిపతి, తిరువాతి పెనుగొండలో విజయనగరాధిపతీ అయిన సాళ్వ నరసింహారాయలు తనపై కూడ అలాంటి పదాలు రచించమని వేడగా తిరస్కరించిన కారణంగా రాజు అన్నమయ్యను సంకెళ్లు వేయించి, కారాగారంలో పెట్టించాడు. కానీ భగవంతునిపై

"ఆకటివేళల నలపైన వేళలను
తేకువ హరినామమే దిక్కు మరిలేదు"[1]

మొదలైన పదాలు పాడి భగవదనుగ్రహంతో సంకెల వదలించుకోవడం చూచి తన తప్పిదాన్ని క్షమించవలసిందిగా శరణు వేడుకొన్నాడు. అన్నమాచార్యుని అనుగ్రహానికి పాత్రుడైన రాజు అన్నమయ్యను ఘనంగా సత్కరించాడు.

ఇలాగే సరస్వతి వ్యతిరేకి పురందరదాసు. అన్ని సంపదల్ని పేదలకు దానం చేసి తాను పేదరికాన్ని తెచ్చుకొని బిచ్చమెత్తి జీవిస్తూ ఉండేవాడు. ఎవరి ఆశ్రయాన్ని కోరలేదు. పైపెచ్చు సరస్వతి వైముఖ్యాన్ని ఈ పదంలో ప్రకటించాడు.

"హింబెల్లా స్వామి ముందిల్లాగో
వింద నీ నిల్లదె ఇహ పరవిల్ల ॥పల్లవి॥
పరర పేటిప్పంతె గతియాయితల్ల
సరరస్తులిసి వాలిగె బరువాయి తల్ల

పరవిన ఇహవిల్ల నరజన్మస్థిరవిల్ల
నరగె పామరగె పాపద పంజరగె ॥హిందెల్లా॥
తనవుతన్నదల్ల తన్నవరారు తనగిల్ల
అనుకూల విరవాగ సతిసుతరెల్ల
అనువుతప్పి మన తల్లణిసువాగ
వనజనాథ నీ నల్లదె యారిల్ల ॥హిందెల్లా॥
మాతాపితృ బంధుగళు ముంతాగి సం
ప్రీతియోళిరలు మన్నిగిరై ఎల్ల
కాతర నాగ్యమ కొంపొయ్యు వాగ సం
గాత ఇన్యారయ్య పురందరవిఠల ॥హిందెల్లా॥

(పురందరదాస పదగళు-102)

ముందు వెనుకా ఏమీలేదు; గోవిందుడు లేకపోతే ఇహపరాలు లేవు. ఇతరులను స్తుతించడం నాకు చేతకాదు. నరులను స్తుతించే నాలుక నిస్సారమైనది. తనువు తనది కాదు. తన వారు తనతోడరారు. అనువు తప్పినప్పుడు నీవే దిక్కు అంటూ స్మరించినవాడు పురందరదాసు. ఇలాంటి అన్నమయ పురందరదాసుల పదాల్లోని సాదృశ్యాల్ని పరిశీలిద్దాం.

## 1.2 పద రచన :-

అన్నమాచార్య పదాలు రెండు రకాలు. శృంగార సంకీర్తనలు: ఆధ్యాత్మ సంకీర్తనలు. పదరచనా పద్ధతికి తెలుగులో స్థిరత్వమేర్పరచిన మహా నుభావుడు అన్నమయ్య. పద్యయుత ప్రౌఢకవితకే, పండితులకు మాత్రమే పరిమితమైన కవికే ప్రాధాన్యముండగా, అన్నమయ్య తన హయాంలో పదకవితలకి పట్టంగట్టి పాడి ఆడి తరించాడు. పామర జన సందోహా నికి ఉపకరించే పదరచన చేశాడు. అంతేకాదు అంతకు ముందే జానపదుల వాడుకలో బహుళ ప్రచారంలో ఉన్న అనేక గానపదగేయ రీతులకు తన పద రచనలో ప్రాణ ప్రతిష్ఠచేసిన మహానుభావుడు. ఎన్నో రకాల రాగాల్లో పదాలు రచిం చాడు. దీనినే సంకీర్తన పద్ధతిగా తెలిపి తన రచనల్ని శృంగార, ఆధ్యాత్మ సంకీర్త నలుగా పేర్కొన్నాడు. వేంకట శైలవల్లభుని అమర శృంగార లీలా విశేషాలు, మధుర భక్తి శృంగార పదాల్లోను, భక్తిజ్ఞాన వైరాగ్య నీతి ప్రబోధం అధ్యాత్మ సంకీర్తల్లోను వర్ణించి తరించాడు: ఆంధ్ర దేశంలో పద కవితా పితామహా, సంకీర్త నాచార్య బిరుదులతో ప్రసిద్ధికెక్కాడు అన్నమయ్య. సంస్కృతంలో సంకీర్తన లక్షణం రచించిన మహానుభావుడితడు.

పురందరదాసు కొన్ని లక్షల్లో పదరచన చేసినా ఈనాడు కొన్ని వందలు మాత్రమే లభిస్తున్నాయన్న సంగతి పూర్వోక్తం. "సూళాదులు, ఉగాభోగాలు" అనే రచనలు చేశాడు పురందరదాసు. వీటిలో స్తుతి పరగీతాలు, శ్రీకృష్ణలీలా ప్రసంగ శృంగార పదాలు, భక్తి జ్ఞాన నీతి ప్రబోధాత్మకాలైన తత్వపరగీతాలు, ఉగాభోగాలు ఉన్నాయి. "సంగీతాభ్యాసపరులకు క్రమ తరగతులలో శిక్షణ గరపటానికి వీలుగా సరళిజంట స్వర వరుసలనూ, అలంకారములనూ, పిళ్లారి గీతాలనూ, ఘనరాగ గీతాలనూ, ప్రబంధాలనూ ఇతడు రచించాడు. వీటిలో చాలా మట్టుకు ఈనాటికీ కర్ణాటక సంగీత ప్రాథమిక విద్యార్థులకు నేర్పుతూ ఉండడం మనం గమనించవచ్చు ............ఈ రచనలన్నింటి వల్లా ఇతనికి ఆదిగురువనీ, కర్ణాటక సంగీత పితామహుండని పేరు వచ్చింది."[2] ఇతని రచనల్లోని ఉగాభోగాలు రెండురకాలు - ఉగాభోగాలు, తాత్విక (వచన) ఉగాభోగాలు. పురందరదాసు ఉగాభోగాలమీద బసవేశ్వరుని వచనాల ప్రభావం ఉందని సాహిత్య విమర్శకుల అభిప్రాయం.[3] ఇలాంటి అన్నమయ్య పురందరుల పదాల్లో అనేక సాదృశ్యాలు గోచరిస్తాయి.

## 1.3 ఆరాధ్య దేవతలు :

అన్నమాచార్యుని ఆరాధ్యదేవత తిరుమలలో వేంచేసిన శ్రీవెంకటేశ్వరుడు. శ్రీ వేంకటేశ్వరుని ముద్ర ప్రతి పదంలోను ఉండితీరుతుంది. ఇలాగే పురందరదాసు ఆరాధ్యదేవత పురందర విట్ఠలుడు. "పురందర విట్ఠల" అనే ముద్ర పురందరదాసు పదాలన్నింట తప్పనిసరిగా ఉంటుంది. అన్నమయ్య పురందరుల ఆరాధ్య దేవతలు వేంకటేశ్వర, పురందర విట్ఠలులే అయినా వైష్ణవులకు ఆరాధ్య దేవతలైన ఇతర దేవతల్ని సైతం తమ పదాల్లో స్మరించడం జరిగింది. సకృత్తుగా దశావతార, శ్రీరామ, అహోబల,నారసింహ, హనుమంతులను స్మరించినా అత్యధికంగా శ్రీకృష్ణ లీలా ప్రసంగాల్ని వర్ణించి తరించాడు అన్నమయ్య. దీనికితోడు పురందర విట్ఠలుని సైతం స్మరించి ఉండడం విశేషం. పురందరదాసు ఆరాధ్యదేవత అయిన పురందర విట్ఠలునేగాక దశావతార, శ్రీరామ, అహోబల,నారసింహ, హనుమంతులని స్మరించి అత్యధికంగా శ్రీకృష్ణలీలా విశేషాలను, ఇంతేగాక శ్రీ వేంకటేశ్వరుని విరివిగా స్మరించి ఉండడం విశేషం. అంటే అన్నమయ్య పురందరుల ప్రధానారాధ్య దేవతలు శ్రీ వేంకటేశ్వర పురందర విట్ఠలులైనా సకృత్తుగా ఇతరదేవతలను స్మరించినా ఇద్దరు అత్యధికంగా శ్రీకృష్ణ లీలల్ని వర్ణించడంతోపాటు పురందరుని ఆరాధ్య

దైవమైన పురందర విట్ఠలుని అన్నమయ్య, అన్నమయ్య ప్రధానారాధ్య దైవమైన శ్రీ వేంకటేశ్వరుని పురందరదాసు స్మరించి ఉండడం ముఖ్యంగా గమనించదగ్గ విషయం. ఈ ఇద్దరు స్మరించిన శ్రీ వేంకటేశ్వర, పాండు రంగ విట్ఠలులకు సంబంధించిన ఒక్కొక్క పదాన్ని పరిశీలిద్దాం.

అన్నమాచార్యుడు పాండురంగ విట్ఠలుని స్మరించిన పదం :

"మొక్కలీడవయ్య నీవు ముద్దు విట్ఠలామా
పక్కవాయ వెప్పుడును పండరంగి విట్ఠలా ॥పల్లవి॥

చిక్కని చల్లలమ్మగా జేరి విట్ఠలా మా
జక్కవ చన్నులంటేవు సారె విట్ఠలా
తొక్కేవు మా పాదాలు దొమ్మి విట్ఠలా
పక్కన మై చెమరించె బండరంగి విట్ఠలా ॥మొక్క॥

వేళగాచి వచ్చేవు మా వెంట విట్ఠలా కడు
మేలము లాడ జేరేవు మేటి విట్ఠలా
కోలుముందై చెనకేవు మేటి విట్ఠలా
పాలుగాంచి (చే?) వేళనే పండరంగి విట్ఠలా ॥మొక్క॥

సారిది గచ్చకాయలు చూపి విట్ఠలా
సరిబేసులాడేవు జాణ విట్ఠలా
గారవై శ్రీ వేంకటాద్రి గూడి విట్ఠలా
పరగ మావద్ద నుంటి పండరంగి విట్ఠలా ॥మొక్క॥

(శృం. సం. 24-247 369,248)

పురందరదాసు శ్రీ వేంకటేశ్వరుని స్మరించిన పదం :

"వేంకటాచల నిలయం వైకుంఠపుర వాసం
పంకజ నేత్రం పరమ పవిత్రం
శంఖచక్రధరం చిన్మయ రూపం ॥పల్లవి॥

అంబుజోద్భవ వినుతం అగణితగుణ నామం
తుంబురు నారదగాన విలోలం
అంబుధి శయనం ఆత్మాభిరామం

॥వేంక॥

పాహిపాండవ పక్షం కౌరవమదహరణం
బాహుపరాక్రమ పూర్ణం
అహల్యాశాపభయ నివారణం ॥వేంక॥

సకల వేద విచారం సర్వజీవనికరం
మకర కుండల ధామ మదన గోపాలం
భక్తపోషక శ్రీపురందర విఠలం ॥వేంక॥

(పురందరదాసర పదగళు-71)

**ఇలాంటిదే మరో పదం :**

"తిరుపతి వేంకప రమణా నినిగేతకేబారదు కరుణ ॥ప॥
నంబిదె నిన్నయచరణ పరిపాలిస బేకోకరుణ ॥అ॥

(పు॰ ప. 134)

## 2.0 పద సాదృశ్యం :

అన్నమాచార్య పదాలను చూచి పురందరదాసు పదరచన చేశాడని ఒక ఉదాహరణ చూపించారు వేటూరి ప్రభాకర శాస్త్రిగారు.[4]

**అన్నమయ్య పదం :**

మాళవి రాగం

"శరణు శరణు సురేంద్ర సన్నుత శరణు శ్రీసతి వల్లభా
శరణు రాక్షస గర్వ సంహార శరణు వేంకట నాయకా॥"

దీన్ననుసరించి పురందరదాసు రచించిన పద్యం ;

మాళవి రాగం

"శరణు శరణు సురేంద్ర వందిత శరణు శ్రీ పతిసేవిత
శరణు పార్వతి తనయ మూరుతి శరణు సిద్ధివినాయకా॥"

ఇలాంటిదే మరో పురందరదాస పదం :

"శరణు శరణు సురేంద్ర వందిత శంఖచక్రగదాధర ॥ప
శరణు సర్వేశ్వరనె అహోబల - గిరియ నరసింహమూర్తిగె ॥అ
(పు. ప. 71

ఇలా ఆరంభమవుతుంది.

**2.1** మరికొన్ని ఉదాహరణల్ని పరిశీలిద్దాం :

భజన పద్ధతిలో బాగా ప్రచారంలో వున్న అన్నమయ్య ప్రసి

పదం :

రాగం: పాడి

"నారాయణతే - నమోనమో
నారద సన్నుత - నమోనమో ॥నారా

మురహరభవహర - ముకుందమాధవ
గరుడగమనపం - కజనాభ
పరమ పురుషభవ - బంధవిమోచన
నరమృగ శరీర - నమోనమో ॥నారా॥

జలధి శయన రవి- చంద్ర విలోచన
జలరుహాభవనుత - చరణయుగ
బలి బంధన గోప వధూవల్లభ
నళినోదర తే - నమోనమో ॥నారా॥

ఆదిదేవ సకలాగమపూజిత
యాదవకుల మోహనరూప
వేదోద్ధర శ్రీ - వేంకటనాయక
నాద ప్రియ తే - నమోనమో ॥నారా॥

(అధ్యా. సం. XI-17)

ఇలాంటిదే పురందరదాస పదం :

రాగం-మధ్యమావతి: ఆదితాళం
"నారాయణతే నమోనమో - భవ
నారదసన్నుత నమోనమో ॥ప॥

మురహరనగధర ముకుంద మాధవ
గరుడగమన పంకజనాభ
పరమ పురుష భవభంజన కేశవ
నరమృగ శరీర నమోనమో ॥నారా॥

జలధిశయన రవిచంద్రలోచన
జలరుహ భవనుత చరణయుగ
బలిబంధన గోవర్ధనోద్ధార
నళినోదరతే నమోనమో ॥నారా॥

ఆదిదైవ సకలాగమ పూజిత
యాదవకుల మోహనరూప
వేదోద్ధార శ్రీ వేంకటనాయక
పురందర విఠల నమోనమో ॥నారా॥

(పు. ప. 72)

ఈ పద సామ్యాన్ని గూర్చి డా॥ ఆనందమూర్తిగారు "దీనినే కడపటి చరణమున గల "నాద ప్రియతే నమోనమో" అను దానిని 'పురందర విఠల నమోనమో' అని మార్చి పురందరదాసుల పదముగా కర్ణాటకులు కొందఱు పాడుచున్నారు.[5] అని

పేర్కొన్నారు. కానీ పురందరుని పదంలో మరికొన్ని మార్పులు కనిపిస్తాయి. పల్లవిలో 'నారాయణతే నమోనమో-భవ నారద సన్నుతన మోనమో'-అనీ; మొదటి చరణంలో 'మురహర నగధర ముకుంద మాధవ; పరమపురుషభవ భంజన కేశవ,' అనీ రెండో చరణంలో 'బలిఇంధన గోవర్ధనోద్ధార' అనీ, మూడో చరణంలో 'అధిదైవ సకలాగమ పూజిత; పురందర విఠల నమోనమో' అనీ మార్పులుచేసి అన్నమాచార్యుని మీద తనకుగల గౌరవాన్ని ప్రకటించాడు పురందరదాసని మనము గ్రహించడమే సముచితమని నా భావన. ఈ గౌరవాన్ని మరోపదంలో సైతం పురందరదాసు స్పష్టంచేశాడు:

ఇప్పుడిటు కలగంటి నెల్లలోకములకు
నప్పడగు తిరువేంకటాద్రీశు గంటి ॥పల్లవి॥

అతిశయంబైన శేషాద్రి శిఖరము గంటి
ప్రతి లేని గోపుర ప్రభలుగంటి
శతకోటి సూర్య తేజములు వెలుగగంటి
చతురాస్య బొడగంటి జయ్యాన మేలుకంటి ॥ఇప్ప॥
కనకరత్న కవాట కాంతు లిరుగడ గంటి
ఘనమైన దీప సంఘములు గంటి
అనుపమ మణిమయ మగు కిరీటము గంటి
కనకాంబరము గంటి గ్రక్కున మేలుకంటి ॥ఇప్ప॥

అరుదైన శంఖచక్రాదు లిరుగడ గంటి
సరిలేని యభయ హస్తము గంటిని
తిరువేంకటాచలాధిపుని జూడ గ గంటి
హరి గంటి గురు గంటి నంతట మేలుకంటి ॥ఇప్ప॥"

(అధ్యా.సం.38)

అన్ని విధాల చక్కటి సాదృశ్యంగల పురందరదాసు శ్రీ వేంకటేశ్వరుని గాంచి వర్ణించిన పదం :

"కండె కండె స్వామియ బేడి కొండె ॥ప॥

కండె తిరుపతి వేంకటేశన - కారుణ్యాత్మక సార్వభౌమన
కామితార్థగళీవ దేవనె - కరుణానిధి ఎందెనిసి మెరెదెవన
॥అ॥

కోటి సూర్య ప్రకాశవెనిప కిరీటవన్ను మస్తకది కండెను
నోటకాశ్చర్యవాద నగెముఖ నొసలినలి తిరుమణెయ కండెను
సాటి యిల్లద శంఖచక్రవ చతురహస్తదిం కండెను
బూటకదమాతల్ల కేశిరోభూరి దేవరగండనంఘ్రియకండెను ॥కండె॥

తప్పుకాణికెకప్పవను సమస్త ద్వీపగళింద తరిసువ
ఉప్పు ఒగరగళనె మారిసి ఉచిత దిందలి హణవగళిసువ
ఇప్పత్తుదుడ్డిగె సేరుతీర్థ ఒప్పదలి క్రయమాడి కోడిసువ
సర్పశయనన సార్వభౌమన అప్పవేంకట రమణనంఘ్రియ ॥కండె॥

ఉరది శ్రీదేవియళ కండెను ఉన్నతద కౌస్తుభవకండెను
గరుడ కిన్నెర నారదాది గంధర్వర ఎడబాలిదల్లి కండెను
తరతది భక్తరిగె వరగళకరెదు కోడువుదు నిరత కండెను
శరధి శయనన శేషగిరివరద పురందర విఠలనంఘ్రియ ॥కండె॥

(పు. ప-183)

ఇలాగే అన్నమయ్య పురందరులు తిరుమలలో వేంచేసిన వేంకటేశ్వరుని గాంచి పరవశత్వంతో వర్ణించి తరించారు.

ఇలాంటిదే పురందరదాసు మరోపదం ఉంది :

"కండెనాకనసినలి గోవిందన ॥ప॥
కండెనా కనసినలి కనకరత్నద మణిమకు
నందన కండె ముకుందన చరణ ॥అ॥

(పు-ప-35)

విషయం వేరైనా అన్నమయ్య పురందరుల పదాల్లోని పల్లవులలో సాదృశ్యం గోచరిస్తుంది :

అన్నమయ్య పదం :

"ఇదిగాక సౌభాగ్య మిదిగాక తపము మ
యిదిగాక వైభవంబిక నొకటి కలదా ॥ "

(శృం.సం.XII-17)

పురందరదాసు పదం :

"ఇదుభాగ్య విదు భాగ్యవయ్య ॥ప॥

పదుమనాభన పాదభజనె సుఖవయ్య ॥అ॥

(పు.ప.7)

కాగా కొన్ని ఇతర పద రీతులలో సామ్యం గోచరిస్తుంది. అన్నమయ్య జోలపాట:

"జోవచ్యుతానంద-జోజో ముకుంద
రావె పరమానంద-రామ గోవింద ॥జోవ॥

పురందరదాసుని జోలపాట:

జోజో శ్రీకృష్ణపరమానంద
నంద గోపియ కందముకుంద ॥జోజో॥

(పు.ప-58)

అన్నమాచార్యుని శోభనం పదం :

"శోభనమే శోభనమే
వైభవముల పావన మూర్తికి ॥పల్లవి॥

అరుదుగ మును నరకాసుడు
సిరులతో, జెరలు దెచ్చిన సతుల
పరువపు వయసుల పదారు వేలను
నొరిది బెండ్లాడిన సుముహూర్తికి ॥శోభ॥

చెందిన వేడుక శిశుపాలుసు
అంది పెండ్లాడగ నవగళించి

విందువలెనె తావిచ్చేసి రుకుమిణి
సందడి పెండ్లాడిన సరసునికి ॥శోభ॥

దేవ దానవులు దీరటసు
దావతి పడి వార్ధి దరుషగను
శ్రీవనితామణి జెలగి పెండ్లాడిన
శ్రీ వేంకటగిరి శ్రీనిధికి ॥శోభ॥
(శృం.సం.XII-18)

పురందరదాసు రచించిన శోభనం ఇదం :

శోభాన శోభానవే
భూదేవియరస వేంకటరాయగె శోభన శోభానవే ॥ప॥

అంబు క్షీరాంబునిధి మొదలాగి ఇందిరె హరుషదిందుదిసి బందు
కందర్పకోటి లావణ్య మూరుతియాద
మందార మాలెయ హాకిద దేవగె ॥శోభాన॥
(పు.ప.352)

అన్నమయ్య పాడిన మరోపదం :

"మాధవునకు మంగళము
సాధు ప్రియునకు జయమంగళము ॥మాధ॥
(శ. సం. III- 227)

పురందరదాసు పాడిన ఒక మంగళం :

"జయమంగళ నిత్యశుభ మంగళం ॥ప॥
ఇందివరాక్ష గె ఇభరాజ వరదగె........" (పు.ప.312)

ఇలాగె అన్నమయ్య పురందరుల పద రచనా సాదృశ్యానికి ఇంకా ఎన్ని ఉదాహరణలైనా ఇవ్వవచ్చు.

## 3.0 భావాలు :

అన్నమయ్య పురందరులలో భావ సామ్యం గోచరిస్తుంది. ఇందుకెన్ని ఉదాహరణలైనా చూపించ వీలవుతుంది. మచ్చుకు ఒకటి రెండు ఉదాహరణల్ని పరిశీలిద్దాం :

జీవాత్మ పరమాత్మల అల్పత్వానల్పత్వాన్ని గూర్చి అన్నమయ్య అనవద్యంగా వర్ణించిన పదం.

"కొసరనేల నా గుణములివి
రసికత నీవిన్నిటా రక్షించుకొనుమా ॥పల్లవి॥

నేరమి నాది నేరుపు నీది
దూరునాది బంధుడవు నీవు
కోరుదునేను కొమ్మనియిత్తువు
కారుణ్యాత్మక గతి నీవు సుమా ॥కొస॥

నేను యాచకుడ నీవే దాతవు
దీనుడ నే బరదేవుడవు
జ్ఞాన రహితుడను సర్వజ్ఞ నిధివి
శ్రీనిధి యిక ననుజేరి కావుమా ॥కొస॥

అరయ నే జీవుడ నంత ర్యామివి
యిరువుగ దాసుడ నేలికవు
చిరజీవిని నే శ్రీ వేంకట పతివి
వరదుడ నను జే వదలకుమా ॥కొస॥

(అధ్యా.సం.X-176)

ఇలాంటిదే చాలా చక్కటి సాదృశ్యం గల పురందరదాసు పదం :

"మందమతియో నాను మదన జనకను నీను
కుందుగళ నెణిసదె దయమాడి సలహో ॥ప॥

పాపకర్తను నాను పాపనాశను నీను
కోపమదమత్సరది సుళివెనాను
తాపవనుతరిదు నిర్భయవ మాడువెనీను
రూపఘాయకే మరుళ గొంబెనో నాను ॥మంద॥

శరణ రక్షక నీను పరమ పాతకి నాను
దురిత పర్వతద పరిహరిపె నీను
మరుళ గొంబెను నాను అరితురక్షిపె నీను
గురువాహంకరినాను అగమ్యనీను ॥మంద॥

మంద భాగ్యనునాను ఇందిరాపతి నీను
హిందుముందిన సుద్ది అరియదవనాను
తందె శ్రీ పురందరవిఠలన రాయెనె
ఎందెందు భక్తరను సలుహువెయో నీను ॥మంద॥
(పు.ప.160)

ఇలాంటిదే మరో ఉదాహరణ :

అన్నమయ్య పదం :

"నీవే నేరవుగాని నిన్ను బండించేము నేము
దైవమా నీకంటె నీదాసులే నేర్పులు ॥నీవే॥

పట్టి భక్తి నీ మీద వళకు వేసి నిన్ను
బట్టి తెచ్చి మదిలోన బెట్టుకొంటిని
పుట్టెడు తులసి నీపాదములపై బెట్టి
జట్టికొనిరి మోక్షము జాణలు నీదాసులు ॥నీవే॥

నీవు నిర్మించినవె నీకే సమర్పణ సేసి
సోవల నీకృపయెల్ల జూర గొంటిమి
భావించొక మ్రొక్కు మ్రొక్కి భారము నీపైవేసిరి
పావనపు నీదాసులే పంతపుచతురులు ॥నీవే॥

చెరువుల నీళ్ల దెచ్చి చేరెడు నీపై జల్లి
పరము వడసితిమి వలసినట్టు
యిరపై శ్రీ వేంకటేశ! "యిటువంటి విద్యలనే
దరిచేరి మించిరి నీదాసులే యీ ఘనులు"[8] ॥నీవే॥

దీనికి అన్ని విధాల సమానమైన పురందరదాసు పదం :

"కెరెయ నీరను కెరెగె చెల్లి
వరవపడెదవరంతె కాణిరో
హరియ కరుణవొళాద భాగ్యవ
హరి సమర్పణె మాడి బదుకిరో
శ్రీ పురందర విఠలరాయన
చరణ కమలవ నంబి బదుకిరో"[9]

ఇలాగే అన్నమయ్య పురందరుల భావాల్లో చక్కటి సాదృశ్యం స్పష్టమవుతుంది.

4.0 ఇంతేగాక ఈ మహానుభావులు ఇద్దరి భావనల్లో, శృంగారం, భక్తి, మధుర భక్తి, జ్ఞానం, వైరాగ్యం, నీతి మొదలైన వాటి వివరణల్లో అత్యంత సాదృశ్యం గోచరిస్తుంది. తాము సంలీనం చెంది, తమ పదాలవల్ల ఇతరుల్ని సైతం సమ్మోహన పరచి, పరవశుల్నిగావించి, ఆనందాబ్ధిలో ముంచి తేల్చిన మహా భక్తాగ్రేసరులు, తన్మూలకంగా తాము తరించి తదితరుల తరణోపాయార్థం అనేక పద రచన చేసి మార్గోపదేశం గావించిన మహనీయులు. ఈ మహావాగ్గేయ కారుల్లో సాదృశ్యవివరణమిది.

సూచికలు :


1) అన్నమాచార్య జీవిత చరిత్ర - ప్రీరిక - పు. 57,58

2) ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము - పు. 144, 145

3) శ్రీ యం. చిదానందమూర్తి ; ఉగాభోగగళు మత్తువచనగళు; ప్రబుద్ధ కర్ణాటక : స.46. క్రోధి సం. చైత్ర సంచికె–1; 1964-65.

4) పై 1వ సూచికలోనిదే. పు. 66-68
5) తాళ్లపాక కవుల పదకవితలు , పు.48
6) పై 1వ సూచికలోనిదే. పు 4,5
7) పై దే. పు. 61, 62
8) పై 5వ సూచికలోనిదే. పు. 556, 557
9) శ్రీ ఎం. మరియప్పభట్ట : సంక్షిప్తకన్నడ సాహిత్య చరిత్రె-పు. 224

# క్షేత్రయ్య పదకవిత

క్షేత్రయ్య ఉత్తమ వాగ్గేయకారుడు. కేవలం పదరచన మాత్రమే చేసినా, కవికి ఉండవలసిన ప్రతిభావ్యనేక లక్షణాలు కొల్లలు క్షేత్రయ్య పదకవితా శిల్పి. మనోజ్ఞపదరచన చేయడంలో అతనికతడే సాటి. ఒక చక్కటి ఉదాహరణ :

చాలు చాలు ఈ చిన్నెలతో నాదు సరసకు చేరకురా ॥పల్లవి॥

ఈ చిన్నెలు సాగవు నావద్ద ! మువ్వగోపాల ! ॥అను॥

కన్నుల వీడెముతో - కొటుక మోవితో
వెన్నునకీల్జడ - వేటుతోను
కన్నియకెంపుల - గాజుల నొక్కులతోను
వన్నెకాడ ! నుదుటను - నున్నలత్తుక తోను ॥చాలు॥

నిదుర మబ్బుతోను - నిండుబడలిక తోను
ముద్దియ కలసిన - మోదముతోను

నిద్దంపు చెక్కిళ్ల - నెలవంకలతోను
వద్దురా పద్దులు - వగకాడ ! నాతోను ॥చాలు॥

అలదాని కుచముల - నలదిన జివ్వాజి
కల యురస్థలమును - నంటి నన్నంటరాకు
బలిమిచేసేవేల - బాల మువ్వగోపాల
అలనాడె గూడిన - చెలిమి పదివేలు ॥చాలు॥

ఇందులో మొదటి చరణంలోని భావాన్ని, ధ్వనిని చిత్రకారుడు చిత్రించలేడు; శిల్పి చెక్కలేడు. కవి మాత్రం తనపదునైన మాటలతో చక్కగా చెప్పగలడు. 'కన్నుల వీడెము', 'కాటుక మోవి' గడుసు ప్రయోగాలు. వినగానే ఎంతో అసహజం అనిపిస్తుంది. కాని అందులోని వ్యంగ్యం భావిస్తే మనోహరమై, మంజులమైన భావం స్ఫురిస్తుంది. నాయికా నాయకులు పరస్పరం కళ్లతో ముద్దు గోన్నారన్న ధ్వని ఇందులో వుంది. కళ్లలో వీడెమూ, మోవిని కాటుకా ఉన్నాయి. వెన్నునకీల్జడ వేటు తగిలిన గుర్తుంది. కెంపుల గాజుల నొక్కులు శరీరం మీద వున్నాయి. లత్తుకనుదుట ఉన్నదట ! అంటే నాయకుడు నాయిక పాదాలకు మొక్కాడన్నమాట. 'నిద్దుర మబ్బు', 'నిండు బడలిక', 'ముద్దియ కలసిన ముదము', 'చెక్కిళ్లపై నెలవంకలు; నాయికా నాయకుల సురతక్రీడా చిహ్నాలు. నాయిక స్తనద్వయంపై అలదిన జివ్వాజి గుర్తు నాయకుని ఉరో భాగాన ఉంది. ఇందులోని చమత్కారం, వ్యంగ్యం, అడంబరంలేని శబ్ద సముచ్చయం, నిసర్గమనోజ్ఞ భావాలు క్షేత్రయ్య ప్రతిభకు ప్రతీకలు. ఇంతటి మనోజ్ఞమైన భావానాబలంతో కూడిన పదరచన చేయడానికి కారణం క్షేత్రయ్య తానే నాయికగా మువ్వగోపాలుని మధుర భక్తితో ఆరాధించటం.

పురుష వర్ణనలుగల పదాలలో, "ఎంత చక్కని వాడే ! నా స్వామి వీడెంత చక్కనివాడే !" అన్న పదం ఎంతో మనోజ్ఞం. నఖశిఖ పర్యంత వర్ణనలుగల ప్రబంధ కవితలకంటే క్షేత్రయ్య పదాలలోని ఈలాంటి నిసర్గ మనోజ్ఞ వర్ణనలు మనల్ని అలరిస్తాయి.

ఇంతేగాక క్షేత్రయ్య పదాల్లోని కొన్ని శబ్దాల సముదాయంతో ముచ్చటైన ముద్దులొలుకు భావచిత్రాలు మనోనేత్రాల్లో బొమ్మకట్టి మనల్ని ఆశ్చర్యంలో ముంచివేస్తాయి. "విడిచిపోలేక నడవడిగొన్న నరులతో" అనే పదంలో విడిచిపోలేక నడ

వడిగొన్న సరులతో ముడిగొన్న చనుగవ, జీరుకొప్పునను సడలి యూడెడు విరుల చేరు, నుదిటిపై నిడిన కస్తూరి చెమటచే కన్నులమీదికి జారడం; ముంగురులు చెదిరి కనుబొమ్మలను సొంపు గులికించడం; అవే ఎడనెడ నడుముపై పొదలడం; ఎడలేని పిరుదుల భారంతో తడబాటుపడు అడుగుల నడక; కూటముల ఎడబాటు పైట కడ తొడల జీరాడుతున్న తీరు; అన్న భావ చిత్రాలు క్షేత్రయ్య భావుకతకు నిదర్శనాలు.

సాభిప్రాయంగా పదప్రయోగం చేసి, సున్నిత భావాల్ని ప్రకటించడంలో అందె వేసినచేయి క్షేత్రయ్య. విరహోత్కంఠిత అయిన ఒక నాయిక "తలపువాని మీద నాయె-తల వాకిలి ఇల్లాయె" అని వాపోతుంది. 'తలవాకిలి ఇల్లాయె' అనడం సాభిప్రాయ రచన. ఇలాగే మరో నాయిక "ఇంతలో నీవీడకు రాకుంటే కన్నీరు కావేరికాలువసుమీ" అంటుంది. ఉల్ల మలరగ తన యెదపైనను మల్లె పూవలె నుంచుకొన్నవల్లభుడు" రాడే యని వాపోతుంది - ఇంకొకా నాయిక. ఈ సున్నిత భావాల వ్యక్తీకరణలో ఎంతో నవ్యత గోచరిస్తుంది. అల్పాక్షరాలతో అనల్పార్థ రచన చేయగలదిట్ట క్షేత్రయ్య. ప్రయోగించిన ప్రతి శబ్దమూ అర్థవంతమై ఉండడం ఈతని పదకవితలోని మహత్తర శక్తి.

ఇంక తెలుగు పలుకు బళ్లను, సామెతలను ప్రయోగించడంలో అతనికతడే సాటి. "బాగాయె నీ పగలెల్ల మా బాగాయె" అనే పదంలో ప్రధాన భావం ఈ పల్లవిలో ఇమిడి ఉంది. నాయకుడు చేసిన వగలను నాయిక నిందిస్తున్నది. బాగాయె అన్నది తెలుగు పలుకుబడి. ఇలాగే అంగడి పెట్టకుము, అడుగులకు మడుగులొత్తిన, అదురుబెదురు లేక, అపురూప దర్శనం బాయె- నాటి కాయెపోయె, చాలుచాలు పది వేలు, చిటుకున వచ్చెనే, దృష్టితాకు, నా మనసు హాయి చేసుకొన్న మొదలైన పెన్న యినా ఉదాహరించవచ్చు. సాహిత్యానికి బలం సామెతలు. క్షేత్రయ్య పదాలలో ఈ సామెతలకు కొదవలేదు. ఈనిన పులివంటి కోపమెందుబోయెనో, కలిమిలేములన కావిడికుండలు, తలవ్రాలెవరికి తప్పించ వశమే, మేక వన్నె పులివంటి చెలులే ఇట్లుసందర్భోచితంగా సామెతల్ని వాడి తన పదకవితకెంతో వైశిష్ట్యాన్ని చేకూర్చు కున్నాడు క్షేత్రయ్య.

ఇంక క్షేత్రయ్య పదాల్లోని సంగీతాన్ని గూర్చి తెలుప ప్రయత్నిస్తే అనుభవజ్ఞులు, సంగీతవేత్తలూ అయిన పలువురు పెద్దలు క్షేత్రయ్య సంగీ గూర్చి వివరించిన మాటలను పరిశీలిద్దాం. క్షేత్రయ్య పదాల సంగీత సౌరభా మొట్టమొదటిసారిగా తెలియజేసినవారు సుబ్బరామ దీక్షితులవారు. "(క్షేత్రయ్య) పదములవలె శృంగార రసములొలుకునట్లు కైశికీరీతిగాను, అర్థ తోను, సందర్భాలకు తగినట్లు రాగములతోను, ధాతువులతోను ఇతనికి మునుపు వెనుకగాని పదములు జూడదగిన వారెవరు లేరని నిశ్చయముగా చెప్పవచ్చు ఈతని పదములు శబ్దార్థముల చక్కగా నెరిగి రసానుభవముతో నెవరు (చౌకమ విలంబముగా పాడుచున్నాడో ఆ పదములు రుచించును. ధాతువులను వ్రాసి జూ వచ్చినదే వచ్చినట్లుండును. ఇట్లుండుటయే పదసాహిత్యముల శయ్య. ధాతు వచ్చినవి గాక యుండుట కీర్తనముల శయ్య"[1]

కాని, క్షేత్రయ్య పదాలను విలంబకాలంలో పాడాలన్న అభిప్రాయ శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు అంగీకరించడం లేదు. "ఇటీవల దరు గాయక విద్వాంసులు పదగానము విలంబకాలమందే పాడవలయునని తలి చున్నారు. కాలలయ ప్రమాణమును ఎంత ఈడ్చిపాడుదురో అంత రాగ రచ గమకముల స్ఫురణకు అవకాశమెక్కువ లభించునని వారి యాశయము నిజమే. కూర్పులో ప్రధానమైన సాహిత్య రచన చాలా భాగము తెగసాగి, తునిగి, వాక్యముల పరస్పర సాపేక్షత అంతరించును. విలంబము పాడే వారికన్న నర్త కెక్కువ అవశ్యకము. నర్తకులు ఒక్కొక్క శబ్దమునకును లయబద్ధమై ము అర్థము నభినయించి భావమును ప్రదర్శించవలసిన వారు. కనుక సాత్త్వికమ అంగికముగా వారు స్పష్టముగా అభినయమును సాగించుటకు వాచకమును క విలంబ విన్యాసము ముఖ్యసాధనము. పదవాక్యముల యర్థము విలంబము కొంత స్పష్టత పోగొట్టుకున్నను ఆ లోపమును అభినయముచేత తీర్చు అవకా వారికున్నది. కనుక సభ్యులకు రస భావాస్వాదమునకు కొరతయుండదు. ... పాడే వారి గొడవ వేరు. పదముల సాహిత్య రచనయే వారికి జీవాతువు. క పదములకు వాక్యములకును గల సంబంధము చెడనీయక సభ్యులకు భావముల చుటకు విళంబకాలము గాయకులకంతగా ప్రయోజనపడదు."[2] కాని క్షేత్ర

స్వరకల్పన గావించిన శ్రీ మంచాళ జగన్నాథరావుగారు మాత్రం శ్రీ రాళ్లపల్లి వారితో ఏకీభవించక, సుబ్బరామ దీక్షితులు చెప్పినట్లు విలంబ కాలంలోనే క్షేత్రయ్య పదాలను పాడాలంటారు. 'కొందరు పెద్దలు అభినయం చేసేటప్పుడు మాత్రం విలంబ కాలంలో పదం పాడినా ఫరవాలేదు కాని కచ్చేరీలలో పాడేటప్పుడు అంత మరీ కాలప్రమాణం దించేస్తే ఏమిబావుంటుంది ? అని అనడం నేను విన్నాను. కాని కచ్చేరికి ఒకలాగ, అభినయానికి ఒకలాగ పదం పాడడం అనేది మా గురువులు మాకు చెప్పలేదు........విలంబకాలంలో క్రియకు 4 అక్షరముల చొప్పున త్రిపుట తాళంలో ఎక్కువగా పాడుకోవలసిన పదములు, చాపు తాళంలో మధ్యమ కాలంలో పాడుకుంటే ఏనుగుని గుర్రంలాగా పరిగెత్తించడమే అవుతుంది. ఇది గాయకులు తమ అనుభవంతో తెలుసుకొని పాడి వినిపించాలి."[3] అయితే విలంబకాలంలో పాడడం కృతుల విషయంలో సముచితంగా ఉంటుంది. పదాలను మధ్యకాలంలో పాడడమే చక్కగా వుంటుంది. ఏమైనా ఈ రెండు పద్ధతుల్లోనూ పాడే సంగీత విద్వాంసులూ ఈనాడు ఉన్నారు.

పదంలోని మాటలకు తగిన విధంగా రసభావాలకు అనుగుణంగా రాగ స్వరూపం రూపొందించడంలో క్షేత్రయ్యకు అతడే సాటి. క్షేత్రయ్య సంగీతజ్ఞతను గూర్చి శ్రీ బాలాంత్రపు రజనీ కాంతరావు గారు చెప్పిన మాటల్ని పేర్కొనడం సముచితం. "కరుణ రసంలో బాహ్యమాత్రమైన దుఃఖమూ, ఉపశమించు కోగల దుఃఖము, దుర్భరమైన దుఃఖమూ, హృదయ విదారకమై బావురుమనే విలాసంతో కూడిన దుఃఖమూ, ఈ వివిధ దుఃఖావస్థలు గల పదాలకు ముఖారి, ఘంటా, నాద నామ క్రియ, పున్నాగవరాళి, కాంభోజి వంటి రాగాలను (క్షేత్రయ్య) వాడుకొన్నాడు. ప్రస్తారానికి పూర్తి అవకాశం లేని ఆహిరి, ఘంటా, సైంధవి, కర్ణాటక కాఫి, నవరోజు వంటి రాగాలను కూడా బహు సూక్ష్మ ప్రయోగాలలో వాడి, ఒడలు ఝల్లుమనిపించగలిగిన మహాశిల్పి. ఇతని ప్రతి పదంలోనూ రాగ భావం మీగడ పలెపైన తెర కట్టి ఆచ్ఛాదించి వుంటుందని విద్వాంసుల అభిప్రాయం. ఒక పదం పూర్తిగా పాడునప్పటికి దానికి జతపరచిన రాగము పూర్తిగ అన్యగతులకు ప్రసృతమవుతుంది".[4] ఇంతేగాక క్షేత్రయ్య 'పద సంగీత పితామహుడని కీర్తించిన శ్రీశ్రీ గోపాల కృష్ణమూర్తిగారిమాటఋజుకించడం

అవసరం. "అన్నమయ్య పద కవితా పితామహుడు. క్షేత్రయ్య పద సంగీత పి మహుండు ! ఈయన పద సంగీత మాధుర్యమే సంగీత రచనను శంఖలీల, సిం తళాటము వంటి తాళ భేషజాల నుంచి పదములపైపు తిప్పినదేమో అనిపిస్తుంది.. క్షేత్రయ్య కర్ణాటక సంగీత వికాస కాలములో భేషజాలు లోపించి మాధుర్య ప రందము చిందించే శుభ సమయానికి ఉషస్సువంటి వారు ....... సాహిత్యా ఒక్కొక్క చోట సభలలో వినిపించరానంత లాలసను తరచు ధరిస్తున్న సంగీ మాధుర్యము అగండాశ్మములను ముంచి నిండుగా ప్రవహిస్తుంది క్షేత్రయ్య ప లలో. అవి ఇక్షు ఖండాలు; సాహిత్యము కాదు వాటి జీవము, మరి సంగీత మధ రసము."[5]

ఇలా సాహిత్యానికి, సంగీతానికి సమాన ప్రతిపత్తి నిచ్చి పదరచన గావిం అభినయం సైతం జోడించిన మహాకవి, సంగీత వేత్త, అభినయాచార్యుడుక్షేత్రయ పదాలలో సంగీత సాహిత్యాలు సమ్మిళితమైన పద్ధతిని గూర్చి రాళ్లపల్లి వారు " రాగ తాళములు రెంటిని కలిపి, హృదయంగమములైన భావములను వెలువర భాషను అలకరించుటయే పదరచనకు పూర్ణ స్వరూపము; దాని పూర్ణానుభవమ మనకప్పుడే, ప్రకృత విషయమైన క్షేత్రయ్య పదము, కవిత్వము రాగ తాళముల పరస్పర సౌహార్దముతో కలిసి తయారైన నిండురచన"[6] అన్నది అక్షరాలా పత్య పదకవితా చక్రవర్తి అయిన క్షేత్రయ్య అమృతుడు: అతని కవిత అజరామరం

సూచికలు :

1) సంగీత సంప్రదాయ ప్రదర్శిని -పు.9

2) సాహిత్యోపన్యాసములు 3, క్షేత్రయ్య పదసాహిత్యం-పు-24-26.

3) నాట్యకళ-జనవరి, 1973,-పు.52

4) ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము-పు.251.

5) భారతి - 1963 అక్టోబరు: పుటలు : 63-64.

6) పై 2వ సూచికలోని పే. పు. 13-16.

# క్షేత్రయ్య పదాలు-సంస్కృతీకరణాలు

ఆంధ్ర సాహిత్యం అనువాదంతోనే ఆరంభమైందన్న అంశం మనకందరికీ అవగతమైందే. అనువాదమనేసరికి ఉభయ భాషా పాండిత్య ప్రకర్ష, ఉభయ భాషల్లోని పలుకుబడ్లు, సామెతలు, వాటి ఆంతర భావాలు గుర్తించిన మహా పాండితీగరిమ కవికి అత్యవసరమన్న సంగతి స్పష్టం కాక పోదు. ఇది మనం నన్నయ, తిక్కన, ఎర్రాప్రెగ్గడ, శ్రీనాథాదుల సాహిత్యాన్ని గమనిస్తే సులభంగా అర్థమయ్యే విషయం. కానీ కొన్ని తెలుగు రచనలు ఇతర భాషల్లోకి అనువదించబడడం మరో విశేషం. అప్పుడు ఆ రచయితలకు తెలుగు లోనేగాక అనువదించదలచిన భాషా ప్రాధాన్య స్వభావాల్ని సైతం బాగా గుర్తించడం అవసరమనేదీ నిర్వివాదాంశం.

రామరాజ భూషణుని వసుచరిత్ర సంస్కృతీకరించబడింది. అదే రీతిని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పక్షాన మను చరిత్రను అస్మద్గురువర్యులు శ్రీ మాన్ కుంటిమద్ది శేషశర్మ గారు 'మను సంభవమ్' పేరిట, కీ.శే. సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారు కళాపూర్ణోదయాన్ని సంస్కృతీకరించారు. అలాగే శ్రీ శేష శర్మగారు సుమతీ శతకాన్ని, ఆముక్తమాల్యదని సంస్కృతీకరించారు. ఇదే రీతిని కీ.శే. గిడుగు వేంకట సీతాపతిగారు క్షేత్రయ్య పదాలను కొన్నింటిని సంస్కృతీకరించడం జరిగింది. ఇదొక విశేషం. ఏదో కావ్యాన్ని అనువదించడం వేరు కానీ క్షేత్రయ్య పదాల్ని సంస్కృతీకరించడం విశేషం. దీనికి కారణముంది. 'పదకవితా పితా మహుడనీ', 'సంకీర్తనాచార్యు'డనీ ప్రసిద్ధి పొందిన తాళ్ళపాక అన్నమాచార్యుల (1408-1505)తో ఆరంభమైన ఈ పదరచన క్షేత్రయ్య (1590-1675)లో సమున్నత స్థానం పొందింది. ఇతడు పదంలో సంగీత సాహిత్యాలకు సమ ప్రాధాన్యమిచ్చి, అభినయం జోడించాడు. పదాభినయం అప్పటినుంచే ఆరంభమైంది తెలుగులో. పైపెచ్చు తిక్కన తరువాత తెలుగు తేటని,తీయందనాన్ని దాని మర్మాన్ని గ్రహించిన మహావేత్త క్షేత్రయ్య. అంటే తెలుగు పలుకుబడి నుడికారం మొదలైన గుణాల్ని బాగాగుర్తించిన భాషావేత్త అనడం సముచితం. అలాంటి క్షేత్రయ్య పదాల్ని సంస్కృతీకరించడం అంటే అసామాన్య విషయం.అ

పదాలపై ఉన్న మోజు, ఆసక్తి, అత్యంతమైన అభినివేశమూ కీ. శే. గిడుగు వేంకట సీతాపతి గారికి అర్హతను కలిగించి ఉంటాయి. అంతేగాదు ఈ రెండు భాషలసార మతి వీరు. అందుకే ఆ ప్రయత్నం చేసి సఫలీకృతులయ్యారు. శ్రీ పిఠాపురం మహా రాజా వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దర్ వారి సమాదరణతో 1952లో సీతాపతి గారు క్షేత్రయ్య పదాల్ని పరిష్కరించి ప్రకటించారు. ఆ సందర్భంలో వారి మనస్సును ఆకర్షించిన కొన్ని పదాలను వారు సంస్కృతీకరించడం జరిగింది. కొన్ని స్రవంతిలో ప్రకటితమయ్యాయి. అందులో ప్రధానంగా మూడు పదాల్లోని వారి సంస్కృతీకరణ విధానాన్ని చూపడమే ఈ వ్యాసోద్దేశం.

మొదట క్షేత్రయ్య పదమూ, ఆ వెనుక గిడుగువారి తత్సంస్కృతీకరణ పేర్కొని వాటి వివరణ పరిశీలించడానికి ప్రయత్నిస్తాను.

రాగం-శంకరాభరణం: తాళం-చాపు
ఎవ్వడే ? ఎవ్వడే ? ఓ భామ ! నీ-డెవ్వడే ? ॥పల్లవి॥

ఎవ్వడే నేను - పవ్వళించిన వేళ -
పువ్వు బాణమేసి-రవ్వ చేసి పోయె ॥అను ప.॥

పట్టపగలు - వాడువచ్చిబలు
దిట్టడయి నా యిల్లు చొచ్చినా
డట్టె నన్ను - చెట్టబట్టి కౌగిలించి-
గట్టిగా నా మోవి - గంటు చేసి పోను ॥ఎవ్వడే॥

గరిత ! వానికి నేను సతమా ? నన్ను-
గద్దించి పలుకుటుచితమా ? నా
పురుషు డూరలేని - ప్రొద్దు మాపటివేళ-
సరసానదేలించి సన్న జేసిపోయే ॥ఎవ్వడే॥

వెన్న తిన్న - పిన్న తనమా ? గొల్ల -
కన్నెల వలపించు గుణమా ? నన్ను
కొన్న మగనివలె-కొంగుబట్టి తీసి -
చన్నులొడిసి పట్టి-చలమేటి కనిపోయె ॥ఎవ్వడే॥

పేదసాదల కిది యూరా ? యిందు
పిన్న పెద్దలెవరు లేరా ? యీ
వీథి వారలెల్ల - వింత చూడనె కాక -
దాదు ఫిర్యాదేది ? ధరణిలో లేదామె ॥ఎవ్వడే॥

నీలమేఘ శ్యామలాంగుడు మంచి -
మేలు పీతాంబర ధరుడు వాడు
లీలతో పదియారు వేల గోప -
స్త్రీల నేలిన మువ్వగోపాలుడని పోమె ॥ఎవ్వడే॥

ఈ పదంలోని నాయిక పరకీయ: నవోఢ, సురత గోపన; నాయకుడు మువ్వ గోపాలుడు బలాత్కరించి చేసిన శృంగార విషయాన్ని నాయిక తన చెలికత్తెతో చెప్పుకొంటూన్న సందర్భం. విషయం మనోహరం అలా చేయడం తన కిష్టమే అయినా కోపం నటించి, పిన్న పెద్దలు లేరా ? దాదు ఫిర్యాదు లేదా ? అని గద్దించినట్లే చెప్పి నీలమేఘశ్యాముడని, మంచి మేలు పీతాంబరధరుడని మెచ్చుకొంటూంది. "లీలతో పదియారువేల గోప స్త్రీల నేలిన మువ్వగోపాలుడని"గొప్పగా చెప్పుకొంటూ వెల్లడంటూనే తాను మనస్సులో మెచ్చుకొంటూంది. ఈ పదంలోని మాధుర్యానికి పులకితులైన గిడుగు వారు దీన్ని సంస్కృతీకరించారు. అది ఇది :

### శంకరాభరణ - చాపు

అయం కః కోఽయం హే భామే - అయం కః కోఽయమ్
॥పల్లవి॥

మమశయన సమయ ఆగత్యాసౌ
కుసుమశరం మయి విక్షిప్య యయౌ॥ ॥అ.ప॥

సవితరిభాస్వర తేజసి సహసా - ప్రవిశ్య మమసదనమ్
కరేణధృత్వామామాలింగ్య - అధరం మమ సందశ్యయయౌ॥
కిం నవనీతాస్వాదన దశయా - గోప్యాకర్షణ చతురతయా
ఫలితిశిఖ ఘనాఘన యతి నిహోలిం - కుచమర్దన మపి కృత్వాగచ్ఛతి॥

గ్రామోఽయం కిం నిర్ధనాక్షమః ? ఆర్యగురుజనాః సంతివా నవా ?
కౌతుకేన మాం పశ్యంతిజనాః - అభియోగ ఫలం కిం నవిద్యతే ?॥
తస్యాఽహం కిం సతత స్వీయా ? అధికారీవతు పృచ్ఛతి మాం
గ్రామేభర్తరి అవిద్యమానే - ప్రియంవదన్ మాం పరిచుంబ్యయయౌ॥
నీలమేఘ ఇవ శ్యామలవర్ణః - పీతాంబర ధర ఏవాఽసౌ
షోడశసహస్రగోపీ నాథో - మువ్వగోపాల ఇతి వదన్ యయౌ॥

సంస్కృతీకరణంలో గిడుగు వారు రెండో చరణాన్ని నాలుగుగాను, నాలుగో చరణాన్ని రెండుగాను మార్పుచేశారు. బహుశా వారు అలా ఉంటేనే బాగుంటుందని భావించారేమో ! పోతే సంస్కృతీకరణం చాలా వరకు మూల విధేయమే. క్షేత్రయ్యలోని భావస్ఫోరకతని తీసుకొనిరావడానికి ప్రయత్నించినట్లు తెలుస్తూంది. అయినా కొన్నింటిని కొనిరావడం కష్టమనిపించింది.

కొన్ని ఉదాహరణలు :

పేదసాదలకిది యూరా ? - గ్రామోఽయం కిం నిర్ధనాక్షమః ?
పిన్న పెద్దలెవరు లేరా ? - ఆర్య గురుజనాః సంతివా నవా ?
దాది ఫిర్యాదేది ధరణిలో లేదాయె - అభియోగ ఫలం కిం నవిద్యతే ?

వీటిలో సంస్కృతీకరణం జరిగిందేగాని ఆ తెలుగు పలుకు బడిలోని సున్నితమైన భావం రాలేదనిపిస్తుంది. 'రవ్వచేసి' సంస్కృతీకరించబడలేదు. ఇది తెలుగులో బహు మనోరంగా, అర్థయుక్తంగా ప్రయుక్తమైన సంగతి స్పష్టం. ఈ విషయం గిడుగువారికి తెలియకకాదు. కానీ సమంగా దీన్ని సంస్కృతంలోకి తీసుకొని రావడం కష్టం. "బలుదిట్టడయి" - కి సంస్కృతం లేదు. అయితే 'సహసా' అని మాత్రం ప్రయుక్తం. తక్కినదంతా సమంగా అనూదితం. పెన్నతిన్న పిన్న తనమా - లోని 'పిన్న తనమా' అనే తెలుగు పదబంధానికి సమానమైన సంస్కృతమేది ? అందుకే గిడుగువారు 'దశయా' అని మాత్రం అన్నారు. 'గొల్ల కన్నెల వలపించుగుణమా? - గోప్యాకర్షణ చతురతయా? ఇక్కడ 'చతురతయా' శబ్దం ప్రయోగించబడింది. 'చల మేటికి' 'మంచి మేలు' — సంస్కృతంలో రానే లేదు. అయినా చాలావరకు అనువాదంలో తమ ఉభయ భాషా పాండిత్య ప్రకర్షని ప్రకటించారు గిడుగు వారు.

ఇక రెండో పదం :

సురట రాగము - తిశ్రత్రిపుట తాళము.
ఎవరి వల్ల దుడుకు మా - యిద్దరిలో సఖియా? ||పల్లవి||

వివరింపుమమ్మా - విధముదెలిసి యిపుడు ||అ.ప||

రమణిరో! బంగారు మం - చముపై నిద్దరము చాలా
మమతతో సరసంపు - మాటలాడే వేళ
కమలాక్షి పేర నన్ను - ఘనుడు పిల్వగ కోప
శమనము లేక నాదు - జడకొద్ది కొట్టితి నమ్మా ||ఎవ||

ఘనుడని వాని పై - కాని నేను నెనరున
మొనగుబ్బలెదను గ్రు - మ్ముచు నుండే వేళ
కనకాంగి రతికిట్టి - పనులకు జాణయనగ
విని పదింటిలో సగ - మొనరించితి నమ్మా ||ఎవ||

కలికి! మువ్వగోపాలు - కలసి మునుపటి వలెనె
తలిరాకు వంటి పా - దము లొత్తే వేళ ఆ
చెలియ పెట్టిన మందు - తలకెక్కి నా పక్క
గలువరింపగ మోవి - గంటు జేసితినమ్మా ||ఎవ||

ఇందులోని నాయిక స్వీయ; ప్రౌఢ; ఖండిత. శృంగార చేష్టలన్నీ ఇందులో వర్ణితం. దీని సంస్కృతీకరణ :

సురటి రాగ - రూపక తాళ

అత్రకస్మిన్ ఆవయోస్సఖి నిర్ఘృణత్వం వర్తతే|| ||పల్లవి||
నిర్ణయ త్వం భవతి విశదం - ఆవయోర్గుణ తారతమ్యమ్|| ||అ.ప||

హేమఖట్వా సుఖశయ్యాత్వోః - ఆవయోస్సల్లాపసమయే
అన్యకాంతానామతో మా - మాహ్వయంతం దోషిణం తం

షమజటాగ్రేణైవ తీవ్రం - దుర్భరాగ్రహ కోప చిత్తా
విగత సహనా ఏకవార మండయమ్॥
సఘన ఇతి తం చింతయంతీ - మద్ఘటిత సంశ్లేషసమయే
తస్య వక్షసి మత్పయోధర - పీడితే సతి మోహాభరితే
ఈదృగభిగమరతి విశేషే-సైవ చతురతేతి లపతి
రోషకలుషా అర్థ మాత్రం - రతి కలాప మకల్పయమ్॥
ముష్కగోపాలస్య పాహి - కోమలౌ సంవాహయంత్యాః
మమ సమాగమ మోద సమయే - అన్యకాంతా ప్రసముక్తోషధ
మహిమ్నాసౌ మమ సమీపే - కించిదప్రియమబ్రవీదితి
తస్య మధురాధర విదారణ - మహమాకర్షం హే ప్రియే॥

ఈ అనువాదం చాలవరకు మూల విధేయమే. క్షేత్రయ్య పదంలోని 'రమణి' సంబోధన సంస్కృతంలో వదలి వేయబడినా అర్థ స్ఫూర్తికి అవరోధం కాలేదు. 'కమలాక్షిపేర' అనే తెలుగుసు సంస్కృతంలో 'అన్య కాంతా నామతః అని ప్రయుక్తం. శృంగారంలో ఒకటైన గోత్రస్ఖలనం ఈ పదంలోని విషయం. 'ఘనుడు' శబ్దానికి బదులు 'దోషిణం తం' సంస్కృతంలో ప్రయోగించడం జరిగింది. 'కోపశమనము లేక' అనే తెలుగుకు 'దుర్భరాగ్రహ కోపచిత్తా విగత సహన' అని చాల చక్కగా గిడుగువారు సంస్కృతీకరించారు. 'నాదు జడకొద్ది కొట్టితినమ్మ' అనే వాక్యాన్ని 'మమ జటాగ్రేణైవ తీవ్రం ఏకవార మండయమ్' అని వారు సంస్కృతీకరించినా 'జడకొద్ది' అనే తెలుగు పలుకుబడి సంస్కృతంలో రాలేదనిపిస్తుంది. రెండో చరణంలోని 'నెనరున' 'కనకాంగి' సంస్కృతంలో లేవు. పైగా 'సతిమోహాభరితే' లేనిది వచ్చింది. 'రతినిబట్టి పనులకు జాణయనగ'- 'ఈదృగభిగమ రతి విశేషేసైవ చతురతేతి లపతి; అన్నీ, 'వీని పదింటిలో సగము నరించితినమ్మ'-రోషకలు షా అర్థమాత్రం కలాప మకల్పయమ్' అని సంస్కృతీకరించారు. మూడోచరణంలో మొదటేగల 'కలికి' సంబోధన లేదు. 'మునుపటి వలెనే' సంస్కృతంలో లేదు. కానీ దీనికి 'కలిసి' అనే పదాన్ని కలిపి 'మరుసమాగమ మోద సమయే' అని, 'ముష్కగోపాలు తలిరాకు వంటి పాదములొత్తేవేళ'

'మువ్వగోపలస్య పాదౌ కోమలౌ సంవాహయంత్యాః' అని ఉచిత రీతిని గిడుగువారు అనువదించడం జరిగింది. 'చలి పెట్టిన పందు తలకెక్కి'- 'అన్య కాంతా ప్రయుక్తౌషధ మహిమ్నాసౌ' అనీ, 'నాపక్క గలుపరింపగ' - 'మమ సమీపే కించిద ప్రియ మబ్రవీ దితి', అనీ, 'మోవి గంటు చేసితివమ్మా' - 'తస్య మధురాధర విదారణ మహామాకర్షం హా ప్రియే' అని బహు సముచిత రీతిని అనువదించారు.

మూడోది చివరిదీ అయిన క్షేత్రయ్య పదం ;
దర్బారు రాగము - రూపక తాళము.

చల్లనాయె నా మనసు - చల్లనాయె నేడు ॥పల్లవి॥
చల్లనాయె ప్రాణేశ ! సామి ! మువ్వగోపాల ! ॥అ ప॥

వద్దికి రావేమోయి - వాడిన ముఖ మేడవోయి
నిద్దుర కనురెప్పలపై - నిండియున్న దేమోయి
అద్దపు చెక్కిలి నొక్కి - ముద్దిడుకొన్న దెవతోయి
దిద్దిన కస్తూరి బొట్టు - చెదరెనింక - తెలుపవోయి ॥చల్ల॥

విరులు జుట్టిన సిగను - వెగటువాస నేడదోయి
గరితెవతో నీదుమోవి - గంటు జేసెనేమోయి
ఉరమున గుబ్బలపోటు - లున్న ముద్ర లేడవోయి
మరుగేల చేసేవు — మగువపేరు దెలుపవోయి ॥చల్ల॥

పలుచని గంధము మేన - పడతెవతో అలదెనోయి
చలువ పన్నీటి వా - సన లేడవోయి
వలచియున్న దానివలెను - కలసియున్న దెవతోయి
పలుమారు మువ్వగో-పాల! నీ వగలు దెలిసెనోయి ॥చల్ల॥

ఈ పదంలోని నాయిక స్వీయ; ఖండిత; ధీరాధీర. శృంగార చేష్టలు వర్ణితం. దీన్ని గిడుగు వారిలా సంస్కృతీకరించారు.

దర్బారు - ఆది

అపి కిం చేతస్తాపశాంతమ్॥ ॥పల్లవి॥
ప్రాణేశ మువ్వగోపాల స్వామిన్ ! తవ శాంతం కిమ్ ? ॥అ ప॥

కస్మాత్ త్వం ప్రియ! నోపయాసి హం-కస్మాన్మ్లానం తవ వదనం?
కస్మాన్ని ద్రాహ్వాా వివతే నేత్రి పుటాదృశ్యతే ?
కాసాయా తవ కపోల ముకురా - ఘూయో ఘూయశ్చుచుంబ
హే ప్రియ ?
రచిత కస్తూరీతిలకస్తవ-ఫాలే కస్మాద్వికృతః ? కథయ. ॥అ.ప॥

తవ సుమ మంజర్యాత్ర శిఖాయాం-దుర్గంధాఃకథమాయాంతి ?
కాసాయువతీయా తవాధరం-తీవ్ర మదంశత్ ప్రాపేశ !
వక్షస్తవ కస్మాద్వక్షోజ ప్రహరణ - ముద్రాంకిత మభవత్ ?
నామధేయ మస్యాః కిం ? వద - కస్మాత్ స్థగయసి మేనాథ ?
॥అ.ప॥

యాకాఽపి మదవతీదేహం-చందనోదకైశ్చర్చితమకరోత్
కస్మాచ్ఛీతల కుబ్జ కజల యుత గంధాః-ఉదయంతి తవ శరీరే
కాసాయాభవతా ప్రేమ్ణా బద్ధైవ యుతా ?
బహుశస్తు మువ్వగోపాల ! విదితా తవరతి లీలా' ॥అ.ప॥

ఈ పదంలోని పల్లవిలోని అర్థం సంస్కృతంలో ఉంది. 'చల్లనాయెమనసు చల్లనాయె' అని తెలుగులో పునరుక్తంకావడం తెలుగుదనాన్ని స్పష్టం చేస్తుంది. కానీ అది సంస్కృతంలో రావడం కష్టం. అను పల్లవి సమానంగానేఉంది. మొదటి చరణంలోని అద్దపు చెక్కిలి'-'కపోలముకురా' చాలా చక్కగా కుదిరింది. అదే రీతిని 'నొక్కి ముద్దిడు కొన్న దెవతోయి'- 'ఘూమోఘూయశ్చుచుంబ హేప్రియ'అని అనువదించారు. అలాగే 'దిద్దిన ........ వోయి'- 'రచితం......... కథయ' సము చితం గానే ఉంది. రెండో చరణం ఎంతో చక్కగా గిడుగు వారు అనువదించారు. మూడొ చరణంలోని 'పలుచని గంధము'-'చందనోదకైః' అని తెలుగులో లాగానే అనువదించారు. 'వలచియున్న....దెలిసెనోయి'-రెండు పాదాలను 'కాసా.........రతి లీలా' అని సంస్కృతీకరించారు.

మూల భావం చెడకుండా తెలుగులోని క్షేత్రయ్య పదాలను గిడుగు వేంకట సీతాపతిగారు ఎంతో చక్కగా సంస్కృతీకరించినట్లు స్పష్టమవుతుంది. ఇలాగే మొత్తం పదాలన్నీ అనువదించి ఉంటే వారెంతగానో సంస్కృతాంధ్ర భాషలకు సేవచేసి ఉండేవారు. కానీ ఇలా కొన్నింటిని మాత్రమే వారు అనువదించారు. ఈ

పని సంగీత సాహిత్యాల రెండింటిలోనూ, సంస్కృతాంధ్రోభయ భాషల్లోను అనన్య సామాన్యమైన పాండిత్యం, భావుకత మొదలైన గుణాలు గల వారికే సాధ్యం. అలాంటి పనికి పూనుకొని పండితులెవరైనా చేస్తే బాగుంటుందని భావిస్తున్నాను.

# అన్నమయ్య క్షేత్రయ్యల పదకవితలు

తెలుగు వాగ్గేయకారులలో ప్రప్రథమంగా పేర్కొనదగిన వారు తాళ్లపాక అన్నమాచార్యుడు. పద కవితా పితామహుడు, సంకీర్తనాచార్యుడు అనే బిరుదులు గల్గి ప్రఖ్యాతి పొందిన వాడు. శరణాగతి సంప్రదాయంతో శ్రీ వేంకటేశ్వరునియెడ అత్యంత భక్తి ప్రపత్తులతో అనేక సంకీర్తనాలు రచించి ముక్తి పొందినవాడు. ఇతడు 15వ శతాబ్దికి చెందిన వాగ్గేయకార శ్రేష్ఠుడు. అన్నమయ్య తర్వాత అంతటి వాడు క్షేత్రయ్య. బహుశా అంతకంటే ఘనుడు అని ప్రశంసినవారునూ లేకపోలేదు. క్షేత్రయ్య 17వ శతాబ్దికి చెందిన వాగ్గేయకారుడు. భగవద్భక్తి అంటే మధుర భక్తి సంప్రదాయంతో మొవ్వలో వెలసిన మువ్వగోపాలునిపై అనేక పదాలు రచించి ప్రసిద్ధి కెక్కిన వాడు క్షేత్రయ్య. ఈ ప్రఖ్యాత పదకర్తలిద్దరిలో అనేక సాదృశ్యాలున్నాయి. వీరి పద కవితల్లోని అలాంటి సాదృశ్యాల పరిశీలనమే ఈ వ్యాసోద్దేశం.

తెలుగు పదకవితకు 15వ శతాబ్ది వసంతకాలం. ఆనాడు వేలకువేలు పదాలు రచింపబడ్డాయి. తెలుగు పదకవితకు అనవద్యుడు అన్నమాచార్యుడు. ఇతడు 1408లో జన్మించి 1503లో దివ్యధామం పొందినట్లు తెలుస్తుంది. వీరి కుటుంబమంతా కవి కుటుంబం. 16 శతాబ్దం చివరి వరకు వీరి పదకవితా ప్రాగల్భ్యం ప్రబలింది. తాళ్లపాక వారి పదకవిత తెలుగు తల్లి కెనలేని మణి భూషణ నికరం. అన్నమాచార్యులు రచించిన 32,000 సంకీర్తనలలో సుమారు నేడు 15,000 లభ్యమవుతున్నాయి. ఇవి ఆధ్యాత్మిక సంకీర్తనలని, శృంగార సంకీర్తనలని రెండు విధాలు. శ్రీ వేంకటేశ్వరుని కంకితాలు. మరి అన్నమయ్యకు పూర్వం వాడుకలో నున్న

జానపద గీతాలు, జాజరలు, చందమామ పదాలు, తుమ్మెద పదాలు, గొబ్బి పదాలు లాలలు, ఉయ్యాలలు, తందనాలు మొదలైనవి ఆయన రచనల్లో కనిపిస్తాయి.

అటు జయదేవుని గీత గోవిందము, ఇటు ఆళ్వారుల పాశురాల మహిమ, మరో ప్రక్క దాసర కూటముల మహిమాన్విత వైశిష్ట్యమూ, ఇంకో ప్రక్క తెలుగు లోని కృష్ణమాచార్యులు మొదలైనవారి వచనాలు అన్నమయ్య పదరచన కుపకరించాయి. "తాను స్మార్త బ్రాహ్మణుడయ్యును, విశిష్టాద్వైత సామర్థ్యమునకు, నర్చ నావతార వైభవమునకు, శరణాగతి మాధుర్యమునకు, శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్య మునకు లోబడి యహోబిల మఠాధీశ్వరుడైన ఆదివన్ శఠకోపయతి శిష్యుడై వైష్ణవ మతమును స్వీకరించినాడు. పరాంకుశయతి ప్రభృతులు ద్రవిడ వేదాంతమును వెలయించినట్లుగా నాళ్వార్ల సంప్రదాయమును చక్కగా ననువర్తించి యుపనిషదర్థ ప్రతిపాదనములతో, స్వానుభవనివేదనములతో, సరసని భాషతో, సరస సంగీత కళా విలాసములతో సర్వసులభముగా సంకీర్తనాత్మకముగా నాంధ్ర వేదాంతము నవతరింప జేసినాడు" [1] "ఆళ్వారుల దివ్య ప్రబంధంలో 4000 పదాలుండగాఅన్న మాచార్యుడొక్కడే రచించిన ఆంధ్ర వేదంలో 32,000 పదాలున్నాయి" [2] 'తెలుగు కన్నడ వాఙ్మయములలో 15వ శ.లో ఈ పదరచన విస్తారముగా సాగినది. తెలుగు లో ఇప్పటికి మనకు తెలిసినంత వరకు తాళ్లపాక అన్నమాచార్యులు ప్రాచీన పద కవిగదా ! అతని కాలమందే, అతడున్న సాళువ నరసింహరాయని ఆస్థానమందే ఉన్న శ్రీ పాదరాయస్వామి కన్నడ పద కర్తలలో ఇప్పటికి ప్రాచీనుడు. ఆయన శిష్యుడు శ్రీవ్యాసరాయస్వామి, అతని శిష్యుడు శ్రీ పురందర విట్ఠలుడు. శ్రీపాద రాయలది విష్ణు పరంపర." [3] "అన్నమయ్య చిన్ననాటి నుండి 'ఆడిన మాటెల్ల అమృత వాక్యముగా, పాడిన పాటెల్ల పరమ గానముగా' నమరినాదట. ఆయి ప్రేరణ ఎట్లున్నను శ్రీపాదరాయల పదములే రచనోత్సాహమును కల్గించి యుండును." [4] అనే రాళ్లపల్లి, పుట్టపర్తి వారి మాటలు ఆళ్వారుల ప్రభావంతో పాటు "దాసర కూటముల" ప్రభావం అన్నమయ్యపై కలదని నిరూపిస్తున్నాయి. అంతేకాదు అన్నమయ్యను పురందరదాసు తిరుపతిలో దర్శించినట్లు తెలియవస్తూంది." [5] "అన్న మాచార్యునివార్ధక్యమున బురందరదాసుల వారుచాల చిన్నవారై దర్శించియుందురు,' [6] కాని "కర్ణాటక హరిదాస సాహిత్య"ను గూర్చి వ్రాసిన ఆర్.యస్. పంచముఖిగారు అన్నమయ్య-పురందరుల సమాగమాన్ని సందేహించారని, అది సముచితం కాదనీ

డా॥ వేటూరి ఆనందమూర్తిగారు వ్యాఖ్యానించారు.[7] అన్నమయ్య మనుమడు చిన్నన్న చెప్పాడు గనుక ఇందు అనుమానానికి ఆస్పదం లేదు. ఇట్లు మహా భక్తాగ్రేసరుడై పదకవితకు పట్టంగట్టి తెలుగున పదకవితాపితామహుడై ప్రసిద్ధి పొందిన మహానుభావుడు, అన్నమయ్య.

క్షేత్రయ్య పూర్వనామం వరదయ్య. అనేక పుణ్యక్షేత్రాల సందర్శనం వల్ల క్షేత్రయ్య అని పేరు కలిగింది. దక్షిణ దేశంలో అతనిని క్షేత్రజ్ఞుడనడమే ప్రసిద్ధం. క్షేత్ర జ్ఞానం గలవాడు గనుక క్షేత్రజ్ఞుడని అర్థం. క్షేత్రయ్య నివాసం మొవ్వ. ఇది కృష్ణామండలంలోని కూచిపూడి, పెదపూడి, ఘంటసాలలకు దగ్గరలోనే వున్న మొవ్వ. ఆ మొవ్వలో వెలసిన మువ్వగోపాల స్వామిపై భక్తి శృంగార రస భావాలతో రచించిన పదాలే మువ్వ గోపాల పదాలు. "మొవ్వ గోపాల"లో ప్రసిద్ధమైన "మొవ్వ" శబ్దమే మువ్వ మొవ్వగా వ్యవహారంలో మారిపోయి వుంటుంది. మువ్వగోపాల మకుటంతో రచితమైనవే క్షేత్రయ్య పదాలు. క్షేత్రయ్య కేవలం గొడ్ల కాపరిగా, అల్లరిచిల్లరిగా తిరుగుతూ వుండేవాడని, ఒక యోగి వల్ల గోపాల మంత్రోపదేశం పొంది, జపించి ఆ శృంగారాదిదేవత చేత అనుగ్రహించబడి—

"శ్రీపతి సుతు బారికి నే - నోపలేక నిమవేటికే

కోపాలా ? మువ్వగోపాలా"—అనే పదంతో ప్రారంభించి పద కవితలల్లినట్లు తెలుస్తూంది. కాని బాల్యంలో గొడ్ల కాపరి అయితే కావచ్చు. కాని క్రమంగా చక్కటి పైదుష్యం సంపాదించాడు. శృంగారియయిన క్షేత్రయ్య మువ్వ గోపాల మకుటంతో ఎంతో చక్కటి శృంగార రస ప్రధానాలైన పదాలు చెప్పనారంభించాడు. విజయనగర పతనానంతరం తెలుగు కవుల్ని, సాహిత్యాది కళల్ని పోషించే నాథులు లేకపోవడం వల్ల క్షేత్రయ్య దక్షిణ దేశానికి వెళ్ళవలసివచ్చింది. దక్షిణ దేశంలో తంజావూరు, మధురా నాయకులు తెలుగు సాహిత్యాన్ని పరిపోషిస్తూ ప్రసిద్ధికెక్కారు. పైగా అంతకంటె పూర్వం నుంచి కూడా కూచిపూడి భాగవతులు తంజావూరుకు వలసపోయినట్లు చరిత్ర చెపుతుంది. క్షేత్రయ్య మేరువ పదం అనే ఈ క్రింది పదం వల్ల తాను దర్శించిన రాజులు కొంత వరకు తెలుస్తున్నారు.

"వేడుకతో నడుచుకొన్న-విటరాయడే!"

ఇందులో మధుర తిరుమలేంద్రుడు, విజయరాఘవ నాయకుడు, గోలకొండ

పాదుషా-అన్న రాజుల నాశ్రయించినట్లు తెలుస్తుంది. వీరినేగాక తుపాకుల కృష్ణ భూపతిని, రఘునాథ రాయలను క్షేత్రయ్య ఆశ్రయించాడు. చెంజినేలిన తుపాకుల వేంకట కృష్ణప్పనాయకుని (1580-1620) మొదట ఆశ్రయించి అనేక పదాలు రచించాడు. కాని ఇతనిపై చెప్పిన మూడు పదాలు మాత్రమే లభించాయి. ఇతని మరణానంతరం రఘునాథ నాయకుని (1614-1633) క్షేత్రయ్య ఆశ్రయించాడు. సంగీత సాహిత్యాది కళా సంపన్నుడైన రఘునాథుడు ఉత్తమ వాగ్గేయకారుని ఆదరించి ఉంటాడు. తరువాత మధుర తిరుమల నాయకుని (1623-1659) ఆశ్రయించాడు క్షేత్రయ్య. మేరువ పదంలో చెప్పినట్లు రెండు వేల పదాలు రచించి ఇవ్వగా తిరుమలేశుడెంతో సంతోషించి క్షేత్రయ్యను సత్కరించాడు. ఆ వెనుక ఉత్తమ సాహిత్య కళా పోషకుడైన విజయరాఘవ నాయకుని (1633-1673) ఆస్థానం చేరాడు క్షేత్రయ. మేరువ పదంలో పేర్కొన్నట్లు తమ శత్రువైన మధుర తిరుమల నాయకుని ఆశ్రయించాడన్న కోపంతో ఉండగా ఆకోపం తీరినవెనుకక్షేత్రయ్య అతనిని ఆశ్రయించి ఆశువుగా వేయిపదాలు అలవోకగా చెప్పి విజయ రాఘవనాయకునిచే సన్మానింప బడ్డాడు. విజయ రాఘవుని ముద్రగల పదాలు పంద్రెండు మాత్రమే లభించాయి. ఆ వెనుక గోలకొండ పాదుషా (1672-76)ను క్షేత్రయ్య దర్శించి అతని ఆస్థానంలోని తులసి మూర్తిని ఓడించి నలభై రోజులలో 1500 పదాలు చెప్పాడట. పాదుషా సత్కారానికి పాత్రుడయ్యాడు. ఆంధ్ర దేశమేగాక దక్షిణ దేశమంతా తిరిగాడు. వివిధ దేవాలయాలను సందర్శించాడు. సందర్శించిన ప్రతి దేవునిమీద - ఆ దేవుని ఉపముద్రతో - ప్రధానమైన మువ్వగోపాల ముద్ర గల పదాలు రచించాడు. కంచివరదునిపై 17 పదాలు చెప్పాడు. తిరుపతి వేంకటేశ్వరునిపై ఐదు పదాలు, చిదంబరం తిల్లా గోవిందస్వామిపైన, తిరువళ్లూరు వీర రాఘవునిపైన, చెవ్వంది లింగనిమీద మూడేసి పదాలున్నాయి. చెలువ రాయడు, వేదపురి నిలయుడు, సత్యపురి వాసుదేవుడు అనే దేవతలపై రెండేసి పదాలున్నాయి. చెలువ చక్కెర పురనిలయుడు, కోవళ్లూరు మువ్వగోపాలుడు, కడప వేంకటేశ్వరుడు, పాలగిరి చెన్నుడు, హేమాద్రిస్వామి, మధుర పురీశుడు, శ్వేతవరాహుడు అనే దేవతలపై ఒక్కొక్క పదం చొప్పున ఉన్నాయి. మొదట పరమ శృంగారి అయి, తరువాత మధుర భక్తుడైన క్షేత్రయ్య, 1590లో జన్మించి 1675 వరకు జీవించి ఉంటాడని భావించ వచ్చును. అయితే ఇతని జీవిత పరిసమాప్తి ఎప్పుడు ఎక్కడ ఎలా జరిగింది చెప్పడం సాధ్యం కాని విషయం.

అన్నమాచార్యుడు పరమభాగవతాగ్రేసరుడు. అతని పదాలన్నీ శ్రీ వేంకటేశ్వ రాంకితాలు. నరాంకితాలు లేవు. సాళువనరసింగరాయలు తనపై శృంగార పదాలు రచింపుమని కోరగా తిరస్కరించి కారాగృహంలో ఉండవలసివచ్చినా వెనుదీయ లేదు. అంటే అన్నమాచార్యునికి భక్తే ప్రధానం.

క్షేత్రయ్య జీవితం ద్వివిధా విభక్తం. ఇతని జీవిత పూర్వభాగం రక్తితోను, ఉత్తరభాగం మధుర భక్తితోను గడిపినట్లు స్పష్టమౌతుంది, అంటే మొదట భోగి తర్వాత యోగి. అన్నమాచార్యులు శృంగార, అధ్యాత్మ గేయాలు రచించినట్లు పూర్వోక్తం. క్షేత్రయ్య పదాలు కేవలం శృంగార సంబంధి. అన్నమాచార్యుని శృంగార పదాలలో శృంగారమున్నా అది భగవత్పరమైనది. తక్కిన వాటిలో భక్తి వైరాగ్యాల్ని వేదాంత రహస్యాన్ని ప్రకటించాడు. క్షేత్రయ్య శృంగారంతో పాటు మధుర భక్తి ప్రకటించి తరించాడు. మువ్వగోపాలుడు నాయకుడు. తానే నాయిక.

పదకవితకు ప్రాతిపదిక వేసినవాడు పదకవితా పితామహుడైన అన్నమయ్య. ఆ బాటను పూలబాటగా మార్చినవాడు క్షేత్రయ్య. అన్నమయ్యను క్షేత్రయ్య ప్రగాఢంగా అనుకరించాడన్న విషయం గోచరిస్తుంది వారిద్దరి పదాల్ని సూక్ష్మంగా పరిశీలిస్తే.

పలుకు దేనెల తల్లి - పవళించెను ||పల్లవి||
కలికి తనముల విభుని - గలసినదిగాన ||అ.ప||

నిగనిగని మోముపై - నెఱులు గెలకులజెదర
పగలైన దాక దైలి - పవళించెను
తెగని పరిణతులతో - తెల్లవారినదాక
జగదేకపతి మనసు - జట్టిగొనెగాన ||పలుకు||

కొంగుజారిన మెఱుగు - గుబ్బలొలయగ దరుణి
బంగారు మేడపై - బవళించెను
చెంగలువ కనుగొనల - సింగారములు దొలక
అంగజుగురుని తోడ - నలసినది గాన ||పలుకు||

మురిపెంపు నటనతో - ముత్యాలమలగుపై
పరవశంబున తరుణి - పవళించెను
తిరువేంకటాచలా - ధిపుని గౌగిట గలసి
అరవిరై సుమమెసుట - నంటి నదిగావ ॥పలుకు॥

— అనే అన్నమయ్య ఈ పదం, క్షేత్రయ్య పదం -

మగువ తన కేళికా - మందిరము వెడలెన్ ॥పల్లవి॥
వగకాడమూకంచి - వరద తెల్లవారెననుచు ॥అ.ప॥
విడజారు గొజ్జంగి - విరదండ జడతోను
కడు చిక్కువడి పెనగు - కంట సరితోను,
నిడుద కన్నులచేరు - నిదుర మబ్బుతోను
తొడరి పద యుగమున - తడబడెడు నడతోను ॥మగువ॥

సొగసి సొగయని వలపు - సొంపుటూపులతోను
వగవగల ఘనసార - వాసనలతోను
జగిమించు కెమ్మోవి - చిగురు కెంపులతోను
నగము కుచముల విడియు - చందురులతోను ॥మగువ॥

తరితీపు సేయు సమ - సురత బడలికతోను
జరుత పావడ చెఱగు - జార్పైటతోను
ఇరుగడలకై దండ - లిచ్చు తరుణులతోను
పరమాత్మ మువ్వగో - పాల తెల్లవారెననుచు ॥మగువ॥

— చక్కటి అనుకరణ మనడం సముచితం. ఈ పదాల్లో రచనా నైపుణ్యం మొదటి అన్నమయ్య కంటె తరువాతి క్షేత్రయ్యలో అధికం. పదరచనలో బిగబిగి, బింకపొంకాలు, క్షేత్రయ్యలో అత్యంత రమణీయమై సహృదయ హృదయ రంజకమై ఒప్పారుతున్నాయి. ఇలాంటి ఉదాహరణలు ఎన్నైనా ఇవ్వవచ్చు.

అన్నమయ్య శృంగార అధ్యాత్మ పదాలు రచించినట్లు పూర్వోక్తం. క్షేత్రయ్య వన్నీ శృంగార పదాలే. అన్నమయ్య పదాల్లో శృంగారానికి త్రివిధ నాయికలలో స్వీయా నాయికకే ప్రాముఖ్యం. పరకీయ నాయికను గూర్చిన పదాలు

కొన్ని మాత్రమే ఉన్నాయి. సామాన్య నాయికా చిత్రణకు అవకాశమే లేదు. కాని క్షేత్రయ్య పదాల్లో స్వీయా నాయికకే ప్రాధాన్యం ఉన్నా పరక్రీయా, సామాన్య నాయికలకు సంబంధించిన పదాలు కూడా ఉన్నాయి. అంటే త్రివిధ నాయికలను క్షేత్రయ్య పోషించాడు. అన్నమయ్యలో లేని సామాన్య నాయికా చిత్రణం క్షేత్రయ్యలో కన్పిస్తుంది. అన్నమయ్య వేంకటేశ్వరుని పరమ భక్తుడు. నరస్తుతి విముఖుడు. విష్ణు భక్తి విషయంలో సామాన్య నాయికకు తావుండదని విశ్వాసం కాబోలు అలాంటి పదరచన చేయలేదు. కాని క్షేత్రయ్య తన జీవిత పూర్వార్ధంలో అనేక శృంగార పదాలు రాజనామాంకితాలు రచించి శృంగార రసపై విశ్వాన్ని వివరించాడు. అన్నమయ్య ఆదినుంచి భక్తుడై, భక్తి, వైరాగ్యపదాలు రచించి తరించాడు. క్షేత్రయ్య తన జీవితోత్తరార్ధంలో యోగిగా మధుర భక్తిని ప్రకటిస్తూ అనేక పదాలు రచించాడు. అన్నమయ్య పదాల్లోని భాషాపరంగా పర్యాలోచించి నప్పుడు తెలుగుదనానికి కొదవలేదు. అయితే క్షేత్రయ్య పదాల్లోని తెలుగుదనానికి అంతులేదు. చక్కటి తెలుగు పలుకుబళ్ళ, నుడికారాలు, సామెతలు వాడడమేకాక తెలుగుపదాల్లోని మార్దవమూ, అర్థ నిర్భరత చాలా సొగసుగా తీసుకొని రావడం క్షేత్రయ్యకే సాధ్యమైంది.

అన్నమయ్య పదాల్లో సంగీత సాహిత్యాల్లో సాహిత్యానికే ప్రాధాన్యం అన్న విషయంపూర్వోక్తం. కానిక్షేత్రయ్యపదాల్లోసంగీతసాహిత్యాలరెంటికిసమప్రాధాన్యం ఉంది. పద కవితా పితామహుడు, అన్నమయ్యే అయినా అతడు వాడిన రాగాలు పరిమితమైనవి. కాని క్షేత్రయ్య అపూర్వ రాగాలు వాడి వాటికెంతో సొగసును ఆపాదించాడు. "క్షేత్రయ్య పదాలలోని పల్లవి, అనుపల్లవి, చరణములలో క్రమముగా రాగవృద్ధి ఎట్లు చేయబడినదో ఒకే రాగమందలి వివిధ పదములలోని స్వర సంచారములు, గమక భేదములు, అలంకారములు పదము యొక్క భావానుగుణముగా రసము పోషించుచు ఎట్లుండునో ఎన్ని భావభేదములకు ఒకే రాగమే ఎన్ని విధముల వాడబడినదో, బాగుగా పరిశీలించినచో క్షేత్రయ్య సంగీతానుభవము ఎంత ప్రతిభావంతమైనదో వ్యక్తము కాగలదు. ఎత్తుగడ, తర్వాత నడక, స్వర

సంచారములు, పోకడలు రాగము యొక్క జీవకళలను సరిగమపదములో చిప్పి
జేయు చుండును."[8] "క్షేత్రయ్య తన పదాలను అన్నమయ్య పదాలను అనుస
చినాడు. కాని నృత్యాభినయాలలో వినిపించవలసినవి కనుక చౌకకాలములో సంగీ
తము ధారాళముగా ప్రవేశపెట్టి అన్నమయ్య సంకీర్తనలలో సమ్మర్దముగలిసి గా
తులో గిజగిజమంటూ అడ్డుపడే అక్షరాలను తగ్గించి అందము చేకూర్చాడు.
కాలానికి అనుపల్లవి, పల్లవి పొడవుకు రెండు రెట్లు పొడవైంది. చరణాలలో
చివరి రెండు పాదాలు అనుపల్లవి స్వరాన్ని అవలంబించాయి. పల్లవికీ చరణాల
సంగీతబంధం ఎక్కువైనది. అనుపల్లవికి చక్కని హోదా వచ్చింది."[9] "అన
మయ్య పదకవితా పితామహుడు. క్షేత్రయ్య పద సంగీత పితామహుడు. ఈయ
సంగీత మాధుర్యమే సంగీత రచనను శంఖలీల, సింహతలాటము వంటి తాళ
జాల నుంచి పదముల వైపు తిప్పినదేమో అనిపిస్తున్నది.... ......ఎవరి పదము
తంజావూరులో, మధురలో, కంచిలో ముఖరితములైనవి ? ఎవరి పదముల శ
విజయరాఘవుని కొలవు యక్షగానాలలో అన్నిటిలోను ప్రతిధ్వనించింది ? అత
సంగీత పితామహుడు క్షేత్రయ్య. ఈయన తరువాత సంగీత రచన నిబంధ పద్ధ
లను బట్టి పెరిగినది. త్యాగయ్య రచనలు ముప్పాతిక మూడు పాళ్లు నిబంధపద్ధ
"క్షేత్రయ్య కర్ణాటక సంగీత వికాసకాలములో భేషజాలు లోపించి మాధుర్య మకర
దము లందించే శుభ సమయానికి ఉషస్సువంటి వాడు....సాహిత్యము ఒక్కొక్క
చోట సభలలో వినిపించరానంత లాలసను తరచు ధరిస్తున్నా సంగీత మాధుర్య
ఆగండాళ్ళములను మించి నిండుగా ప్రవహిస్తుంది క్షేత్రయ్య పదాలలో. అ
ఇక్షు ఖండాలు. సాహిత్యము కాదు వాటి జీవము మరి సంగీత మధుర రసము."
సంగీత సాహిత్యాల్లో సముచిత రీతిని తన పదాల్లో అభినయాన్ని సమ్మేళనం చేసి
అభినయాచార్యుడు క్షేత్రయ్య. "క్షేత్రయ్య నాట్య విద్యా విశారదుడు. కైశికీ విధా
ప్రధానమగు నాట్యకళయందు - అభినయ కళయందు సంపూర్ణ ప్రజ్ఞ నేర్చినవాడ
చెప్పవలసియున్నది. ఇతడు పదములను పాడి, అభినయము నటించుచు అ
నృత్య గీత నాట్యాత్మకమగు సంగీతమును అనుభవించి రస సిద్ధిపొందిన సంగీ

నేత్రయని చెప్పుటకు ఏమియు సందేహమక్కరలేదు."[11] "తన పద కవితలో ఒక నూతన అభినయ కళా సృష్టి చేసి, దేవదాసీల అభినయ కళపై ఒక "నూతన వెలుగు" ను ప్రసరించి అమర మూర్తి అయినాడు క్షేత్రయ్య."[12]

ఇలాగ అన్నమయ్య క్షేత్రయ్యల పదకవితా వైభవం మనోజ్ఞమూ, మంచి లమూనని స్పష్టమయింది. పద కవితా నిర్మాత అన్నమయ్య. దాని అందచందాల్ని, లగువు బిగువుల్ని ఆపాదించి అనుదిద్దినాడు క్షేత్రయ్య. ఈ పద కర్తలు ఇద్దరినీ గూర్చి వివిధ రీతుల ఇంకా లోతుగా తులనాత్మక అధ్యయనం చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది.

సూచికలు :


1) వేటూరి ప్రభాకరశాస్త్రి : సింహావలోకనం : పు.84

2) వేటూరి ప్రభాకరశాస్త్రి : అన్నమాచార్య జీవితచరిత్ర : పు 116

3) సాహిత్యోపన్యాసములు-3 : క్షేత్రయ్య పదసాహిత్యము : పు. 19

4) ఆంధ్ర సారస్వత పరిషత్తు : తెలుగులో పదకవిత : పు; 2

5) పై 2వ సూచికలో నిదే : పు. 44, 45

6) పై దే. పు. 63

7) శ్రీపాద గోపాలకృష్ణమూర్తి : భారతి; నవంబరు 1971 : పు. 21, 22

8) విస్సా అప్పారావు : క్షేత్రయ్య పదములు - పీఠిక · పు. 66

9) శ్రీపాద గోపాలకృష్ణమూర్తి : భారతి: సెప్టెంబరు, 1961 - పు. 91

10) శ్రీపాద గోపాలకృష్ణమూర్తి : భారతి అక్టోబరు, 1973 - పు. 63, 64

11) విస్సా అప్పారావు : సంగీత నృత్య వ్యాస రత్నావళి పు. 112

12) శ్రీపాద గోపాలకృష్ణమూర్తి : నాట్యకళ-నవం డిసెం 1967:పు 19, 20

# త్యాగయ్య, క్షేత్రయ్య, అన్నమయ్యలు

తెలుగులో మహా వాగ్గేయకార త్రయం త్యాగయ్య, క్షేత్రయ్య, అన్న
మయ్యలు. ధాతు మాతువులకు ప్రాధాన్యమిచ్చి పద రచన చేయగలవాడు వాగ్గేయ
కారుడు. ఈ లక్షణానికి చక్కటి నిదర్శనం అనదగిన వారు త్యాగయ్య, క్షేత్రయ్య
అన్నమయ్యలు. తెలుగులో పద కవిత పుట్టుక అన్నమయ్య పుట్టుకతోనే అ
చెప్పడం సముచితం. ఆ వెనుక పద కవిత మూడు పూవులారుకాయలుగా వికాస
పొందిన తెలుగులో తన ప్రత్యేకతను నిలబెట్టుకొంది. పద కవితా పితామహుడు
అన్నమయ్య అయితే పద కవితా జనకుడు క్షేత్రయ్య. ఆ తరువాత రామదాసు
సారంగపాణి, మునిపల్లె సుబ్రహ్మణ్య కవి, త్యాగరాజు మొదలైన వాగ్గేయకారుల
ఈ పద కవితను తెలుగులో సుసంపన్నం చేశారు. మహా వాగ్గేయ కారులుగా నిరూ
పించుకొన్నారు. వీరందరిలోను కమనీయ కవిత, పరిపూర్ణమైన భక్తిప్రపత్తి, సరస
సంగీతం అనేక మార్గాల్లో సమున్నత స్థానం ఆక్రమించిన మహా వాగ్గేయకారుల
త్యాగయ్య, క్షేత్రయ్య, అన్నమయ్యలు.

త్యాగయ్య కర్నూలు మండలంలోని కాకర్ల గ్రామం నుంచి దక్షిణ దేశానికి
వెళ్లిన బ్రాహ్మణ కుటుంబానికి చెందినవాడు. తాత తండ్రుల నుంచి భక్తి, సంగీ
సాహిత్యాలు త్యాగయ్యకు అబ్బడంలో అబ్బురం లేదు. త్యాగయ్య తంజావూరు
మండలంలోని తిరువూరు గ్రామంలో 1767 లో జన్మించి 1847లో సిద్ధి పొందినట్లు
తెలుస్తూంది. నాదోపాసనా భక్తిపరుడు త్యాగయ్య. త్యాగయ్య కృతులలో సం
గీతం ప్రధానంగా, సాహిత్యం గౌణంగా ఉంటుందన్నది పండితాభిప్రాయం. తన
కృతుల ద్వారా కవిత, భక్తి, గానం అనే మూడు అంశాలను వరాలుగా మనకు
ప్రసాదించిన మహా భక్తాగ్రేసరుడు త్యాగయ్య.

త్యాగయ్య ఏ భావాన్ని చెప్పినా అది సహజ సుందరమై, అకృత్రిమంగా
ఉండడం విశేషం. దీనితో ఆయన కీర్తనలకు నవ్యత, భావాలకు విలాసమూ,
భాషకు ధారాళతా అలవడి శ్రోతల హృదయాల్ని ఇట్టే ఆకర్షించే గుణం తనకుతానే
సంతరించుకొంది. అచంచలమూ, ప్రగాఢమూ అయినది అతని రామభక్తి. తన్మూ
లంగా ముక్తిని పొందడం ధ్యేయం. ఆత్మ ప్రబోధంతో సమస్త భక్త కోటిక

తరణోపాయాన్ని సూచించిన మార్గదర్శకుడు. ఎంతమంది దేవతల్ని ఆరాధించినా శ్రీరామునే పరమాత్మునిగా ఆరాధించాడు త్యాగయ్య.

"నా జీవనాధార నానోము ఫలమా
రాజీవలోచన రాజరాజ శిరోమణి"

అని పాడినపుడు కాదు అతని భక్తి ప్రసక్తి.

"నా చూపు ప్రకాశమా, నా నాసికా పరిమళమా
నా జప వర్ణ రూపమా, నాదు పూజా సుమమా
త్యాగరాజనుత"

అని పాడినపుడు తెలుస్తుంది. అయినా శ్రీ వేంకటేశ్వరుని ఆరాధించిన తీరును మనం ఈ సందర్భంలో సంస్మరించడం సముచితమే.

"తెర తీయగ రాదా లోని ||తె||
తిరుపతి వెంకటరమణ మచ్చర మను ||తె||
పరమ పురుష ధర్మాది మోక్షముల
పారదోలు చున్నది నాలోని ||తె||

............................
మత్స్యము ఆకలిగొని గాలముచే
మగ్నమైన రీతి యున్నది
........................
వాగురయని తెలియక మృగ గణములు
వచ్చి తగులు రీతి యున్నది
వేగమే నీ మతము ననుసరించిన
త్యాగరాజనుత మద మత్సరమను ||తె||

ఇందులో లోక సహజమైన విషయాల్ని చెబుతూనే ఎంతో విశిష్టంగా తన లోని మదమత్సరమనే తెర తీయగ రాదా అంటూ శ్రీ వేంకటేశ్వరుని ప్రార్థించడం త్యాగయ్య భక్తి ప్రతిపత్తితో పాటు, ఆధ్యాత్మిక చింతనకు చక్కటి నిదర్శనం.

త్యాగయ్య నాదోపాసకుడు. ఆయన కృతులన్నీ దీనికి సాక్ష్యాలే.

"నీ దయచే రామ నిత్యానందుడై తి
నాద బ్రహ్మానంద రసాకృతి గల"

అని ప్రస్తుతించడమే గాక

"నాద సుధా రసంబిలను నరాకృతాయె మనసా ||నా||

వేద పురాణాగమ శాస్త్రాదుల కాధారమౌ" ||నా||

అని నాద సుధారసమే శ్రీరాముడని ఆరాధించడం అతని నాదోపాసనకు నిదర్శనం.

ఈ పద రచనలో సిద్ధహస్తుడు క్షేత్రయ్య. త్యాగయ్య కంటే రెండువందల సంవత్సరాల ముందే సంగీత సాహిత్యాలకు సమ ప్రాధాన్యమిచ్చి, అభినయం జోడించి, పదాభినయం వస్తే పద్ధతికి మార్గ దర్శకుడయ్యాడు క్షేత్రయ్య. 1590లో జన్మించి 1675లో శ్రీకృష్ణునిలో ఐక్యం పొందినవాడు క్షేత్రయ్య. కృష్ణా మండలం దివి సీమలోని మొవ్వ ఊతని జన్మస్థానం. తంజావూరు, మధుర మొదలైన రాజుల నాశ్రయించి శృంగార పద కవితలతో వారిని మెప్పించి సన్మానాలు పొందాడు. కానీ చివరికి దేవదాసీ మూలంగా మధురభక్తి పరుడుగా మారిపోయి సర్వం మధుర భక్తి ఉన్ముఖంగా తానే నాయికయై మొవ్వ గోపాలుడనే ప్రియుని పై చాళిగాని నాయికా లక్షణాలతో పదరచన చేసి తరించాడు. తెలుగు పలుకుబళ్లు, నుడికారాలు, సామెతలు, పలుకు పలుకున తేనెలూరు తీరున తమకు తామే క్షేత్రయ్య పదాల్లో చేరిపోయాయి. ఇంతగా తెనుగుదనాన్ని పరి రక్షించిన కవి తెలుగు కవుల్లో తిక్కన తరువాత ఇతడొక్కడే అంటే అత్యుక్తి లేదు. క్షేత్రయ్య పద కవితా శిల్పి. మనోజ్ఞ పద రచనలో క్షేత్రయ్యకు సాటి

అతడే. ఓ చక్కటి ఉదాహరణ :

"చాలు చాలు ఈ చిన్నెలతో నాదు - సరసకు జేరకురా" ||పల్లవి||

చాలు ఈ చిన్నెలు - సొగసు నావద్ద ! మువ్వగో
పాల ! భామవద్దికేగోర ||అ. ప||

కన్నుల వీడెముతో - కాటుక మోవితో
వెన్నున కీల్జడ - వేటుతోను
కన్నియ సంపుల - గాటుల నొక్కులతోను
వన్నెకాడ ! నుదుటను - నున్న లత్తుకతోను ॥చాలు॥

నిద్దుర మబ్బుతోను - నిండు బడలికతోను
ముద్దియ కలసిన - మురిపముతోను
నిద్దంపు చెక్కుల - నెలవంకల తోను
వద్దురా వద్దులు - వగకాడ ! నాతోను ॥చాలు॥

ఇందులోని మొదటి చరణంలోని భావాన్ని, ధ్వనినీ చిత్రకారుడు చిత్రించలేడు, శిల్పి చెక్కలేడు. కవి మాత్రం తన పదునైన మాటలతో చక్కగా చెప్పగలడు. కన్నులవీడెము, కాటుక మోవి గడుసు ప్రయోగాలు. వినగానే ఎంతో అసహజం అనిపిస్తుంది. కాని వ్యంగ్యం భావిస్తే మనోహరమూ, మంజులమూ విదితమై, పరస్పరం కళ్లు ముద్దుగొన్నారన్న ధ్వని ఇందులో తెలుస్తుంది. కళ్లలో వీడెమూ, మోవిని కాటుకా వున్నాయి. వెన్నున కీల్జడ వేటు తగిలిన గుర్తుంది. కెంపుల గాటుల నొక్కులు శరీరం మీద ఉన్నాయి. లత్తుక నుదుట నున్నదట. అంటే నాయిక పాదాలకు నాయకుడు మొక్కాడన్నమాట. ఇంత మనోజ్ఞంగా, భావపూర్ణంగా వ్యంగ్యంగా చెప్పగలగడం క్షేత్రయ్యకేని గొప్పదనం.

17, 18, శతాబ్దాల నాటికి ఇంత ప్రసిద్ధి పొందిన తెలుగు పదకవితకు ఆద్యుడు అనవద్యుడు అన్నమాచార్యుడు. 1408లో తాళ్లపాకలో జన్మించి 1503 దివ్యధామం పొందిన తాళ్లపాక అన్నమాచార్యుడు వేనకువేలు శ్రీ వేంకటేశ్వరుని ముద్రతో పదాలు రచించి తరించాడు. భక్తులకు తరణోపాయం చూపించాడు. తెలుగు పద కవితకు పదిహేనో శతాబ్ది వసంతకాలం. అన్నమాచార్యుని పదాలు శృంగార సంకీర్తనలు, అధ్యాత్మ సంకీర్తనలని రెండు విధాలు. శ్రీ వేంకటేశ్వరుని శృంగార లీలా విలాసాలని ఎన్నెన్నో రీతుల అభివర్ణించి తానే నాయికయై, శ్రీ వేంకటేశ్వరుని నాయకునిగా భావించి మధురభక్తి ప్రతిపత్తిని ప్రకటించాడు. అదే రీతిగా వేదాంతపరంగా అధ్యాత్మ సంకీర్తనలు రచించాడు. అంటే వాస్తవానికి ప్రవృత్తి భోగాన్ని ఎంతగా ఆయన ప్రదర్శించాడో, అంతే వేదాంతం కంటే

ఎక్కువగానే నివృత్తి భోగాన్ని సైతం ప్రబోధించాడనడం సముచితం. పదకవితా పితామహుడనీ, సంకీర్తనాచార్యుడనీ అన్నమాచార్యునకు అన్వర్థ బిరుదులున్నాయి. అన్నమయ్య సంకీర్తనల్లో సాహిత్యం ప్రధానంగాను, సంగీతం గౌణంగాను ఉంటుందని విమర్శకుల అభిప్రాయం. అన్నమాచార్యుడు కేవలం పద రచన చేసినా, పద్యకవులలో ముఖ్యంగా ప్రబంధ కవులతో తీసిపోని రీతిని నవనోన్మేషమూ, అనన్య సామాన్యమూ అయిన భావుకత, చమత్కారం, శ్రోతల మనస్సులకు చక్కిలిగింత పెట్టి ఆనంద పరవశుల్ని చేసేట్టుగా కవిత చెప్పడం అతనికే సాధ్యమైంది.

ఓ ఉదాహరణ :

"అతివ జవ్వనము రాయలకు బెట్టిన (ట్టని) కోట
పతి మదన సుఖ రాజ్య భారంబు నిలువ ॥పల్లవి॥

కాంత కనుచూపు మేఘంబు లోపలి మెఱుగు
కాంతుని మనంబు చీకటి వాపను
ఇంతి చక్కని వదన మిందు బింబము విభుని
వంత కనుదోయి కలువల జొక్క జేయ ॥అతివ॥

అలివేణి ధమ్మిల్ల మంధకారపు భూమి
కలికి రమణునకు నేకత మొసగను
బొలతికి బాహువులు పూవు దీగెల కొనలు
బొలసి ప్రాణేశు వలపుల లతల బెనచ ॥అతివ॥

పంకజానన రూపు బంగారులోనిగ్గు
వేంకటేశ్వరు సిరులు పెద చల్లగా
చింక చూపుల చెలియ చేత మదనుని చేత
యింకా నతనిని మోహించ చేయగను ॥అతివ॥

చెప్పదలచిన భావానికి అనుగుణమైన భాష తనకు తానే ఎక్కడా తడుముకోకుండా రావడం అన్నమయ్యలోని మరో మహత్తర గుణం. ఇలా అన్నమాచార్యుని కవితా శిల్పానికి ఎన్ని ఉదాహరణలైనా చూపవచ్చు.

ఇందాక త్యాగయ్య, క్షేత్రయ్య, అన్నమయ్యల కవితా మాధుర్యాన్ని చవి చూశాం. ఇక వారి జీవిత స్వభావాల్ని, భక్తి తత్వాన్ని గూర్చి కూడా క్లుప్తంగా తెలుసుకొందాం.

అన్నమాచార్యుడు పరమ భక్తాగ్రేసరుడు. అతని పదాలన్నీ శ్రీ వేంకటేశ్వరాంకితాలు : నరాంకితాలు లేవు. సాళువ నరసింగ రాయలు తనపై పదాలు రాయమని కోరగా తిరస్కరించి శిక్షకు గురయ్యాడు; అది అతని అచంచల ప్రగాఢ భక్తి. క్షేత్రయ్య జీవితం ద్విధావిభక్తం. ఇతని జీవిత పూర్వభాగం రక్తితోను, ఉత్తరభాగం భక్తితోను గడచినట్టు స్పష్టమవుతుంది. అంటే మొదట భోగి, ఆ వెనుక యోగి. త్యాగయ్య జీవితం అన్నమయ్యతో పోల్చదగింది. "సీతమ్మ మాయమ్మ శ్రీరాముడు మాదుతండ్రి" అని సర్వం శ్రీరామ మయంగా భావించి స్మరించి, తరించినవాడు త్యాగయ్య. తన అన్న మాటల్ని సైతం పెడ చెవిని బెట్టి రాజసన్మానాల్ని సంపదల్ని తిరస్కరించిన మహాయోగి, శ్రీరామ భక్తాగ్రేసరుడు.

అన్నమయ్య శృంగార ఆధ్యాత్మ సంకీర్తనలు రచించాడు. క్షేత్రయ్య కేవలం శృంగార పదాలు మాత్రమే రచించాడు. త్యాగయ్య భక్తి ప్రపత్తితో కీర్తనలు రచించాడు. అయితే శ్రీకృష్ణ పరంగా కొన్ని శృంగార విలసితమైన రచనలు లేక పోలేదు. అయితే అన్నమయ్య శృంగారం అలౌకికమైన భగవత్పరకమైనది. అధ్యాత్మ సంకీర్తనల్లో భక్తి వైరాగ్యాల్ని వేదాంత రహస్యాల్ని క్రోడీకరించి చెప్పడం జరిగింది. క్షేత్రయ్య లౌకిక శృంగారంతోపాటు మధుర భక్తి యుతంగా శృంగార పదరచన చేసి తన విశిష్టతని ప్రకటించాడు. త్యాగయ్య భక్తి ముక్తిదాయకమని ప్రతి కీర్తనలోను చూపించాడు. ఈ విషయములో త్యాగయ్య అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తనల్లోని ఉపనిషత్సారాన్నంతటిని అందించినట్లు తెలుస్తుంది.

అన్నమయ్య తెలుగులోనే గాక సంస్కృతంలో సైతం పదరచన చేశాడు. క్షేత్రయ్య కేవలం తెలుగులోనే పదరచనచేశాడు. త్యాగయ్య తెలుగు, సంస్కృతం రెండు భాషలలోను కీర్తనలు రచించాడు. పల్లవి తరువాత అనుపల్లవి క్వచిత్తుగా మాత్రమే ఉంటుంది అన్నమయ్య పదాల్లో. పల్లవి అనుపల్లవి సక్రమ రీతిని ప్రయోగించడాన్ని ఆరంభించిన వాడు క్షేత్రయ్య. ఇదే రీతి త్యాగయ్య కృతులలోను మనం చూడవచ్చు.

అన్నమయ్య శృంగార పదాల్లో స్వీయ నాయికకే ప్రాధాన్యం. క్షేత్రయ్యలో స్వీయ, పరకీయ, సామాన్య నాయికా శృంగారం అభివర్ణితం. కేవలం భక్తిపరమైన పదాలే అధికం త్యాగయ్యలో. కొన్ని శృంగార పదాలు లేకపోలేదు. వాటిలో స్వీయా నాయికాపరమైన శృంగారం వర్ణితం.

అన్నమయ్య పదాల్లోని భాషలో తెలుగుదనానికి కొదవలేదు. కానీ క్షేత్రయ్య పదాల్లోని తెలుగుదనం మరింత పరిపూర్ణమై ఉంటుంది. పలుకు పలుకున తెలుగు తేట ఊటలూరు తూంటుంది. తెలుగు పలుకు, పలుకుబడ్లు, నుడికారాలు, సామెతలు వాటి వాటికీ మనోహరత్వాన్ని ఆపాదించాడు క్షేత్రయ్య. త్యాగయ్య ఎప్పుడో తెలుగుదేశం నుంచి దక్షిణదేశం తరలిపోయిన కుటుంబంలోని వాడు కావడం వల్ల త్యాగయ్య కీర్తనల్లో ఇంత వెలుగుదనం ఉట్టిపడడం లేని మాట వాస్తవం. దీనికి మరోకారణం కూడ లేకపోలేదు. భక్తి పారవశ్యంతో అశువుగా చెప్పడం మూలాన సైతం తెలుగు పలుకులు నాణ్యమూ, నాజూకును గురించి ఆలోచించే అవకాశం లేకపోయి ఉండవచ్చునని పండితాభిప్రాయం. అయితే తెలుగు సామెతలకు త్యాగయ్య కీర్తనల్లో అవకాశం లేదని చెప్పడం సాహసం.

అన్నమయ్య పదాల్లో సంగీత సాహిత్యాలలో సాహిత్యానికే ప్రాధాన్యమన్న విషయం పూర్వోక్తం. కాని క్షేత్రయ్యలో సంగీత సాహిత్యాలకు సమప్రాధాన్యం ఉంది. పదకవితాపితామహుడు, సంకీర్తనాచార్యుడని ప్రసిద్ధికెక్కిన అన్నమయ్య తన వేలపదాల్లో వాడిన రాగాలు పరిమితమే. కాని క్షేత్రయ్య అపూర్వరాగాలు వాడి వాటికెంతో సొగసుందనాన్ని ఆపాదించినట్లు తజ్ఞుల అభిప్రాయం ; ఈ సంగీత సాహిత్యాలకు అభినయం జోడించిన అభినయాచార్యుడు క్షేత్రయ్య. త్యాగయ్యలో సాహిత్యం కంటే సంగీతం ప్రాముఖ్యం వహిస్తుంది. రాగసంచార స్వరూపాలకు, సంగీత శిల్పానికి చక్కటి నిదర్శనం త్యాగయ్య కీర్తనలు. అనేక రాగాలను, ప్రచారంలోనికి తెచ్చిన ఘనత ఆతనికే చెందుతుంది. మన సంగీతం ఈ నాటికీ మిగిలిందంటే త్యాగయ్య పెట్టిన భిక్ష అని సూత్రం మనం భావించడం సముచితం. అయితే ఈ పద రచన తెలుగులో ఆరంభించిన అన్నమయ్యకు తెలుగు జాతి ఋణ పడిందనే సంగతి గూడా ఈ సందర్భంలో మరవకూడదు.

ఇలాగ అన్నమయ్య, క్షేత్రయ్య, త్యాగయ్యలు తెలుగులోని మహావాగ్గేయ కారత్రయం. అన్నమాచార్య శృంగార సంకీర్తనాంశం రెండు వందల ఏండ్లకు క్షేత్రయ్యగానూ, అటు తరువాత నూరేండ్లకు అన్నమాచార్య అధ్యాత్మిక సంకీర్తనాంశం త్యాగయ్యగాను అవతరించినట్లు కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రి గారు భావించడం ప్రత్యక్షర సత్యం !

# సారంగపాణి పదసాహిత్యం

సహజంగా చిత్తం పరమేశ్వరుని పాదారవిందాల దగ్గరకు పోవడాన్ని 'భక్తి' అంటారు శంకరచార్యులు. నారద భక్తి సూత్రాలలో 'సాత్వస్మిన్ పర (మ) ప్రేమ రూపా' (సూ.2) (ఆ భక్తి పరమేశ్వరుని యెడల పరమ ప్రేమ రూపంగా ఉంది) అని చెప్పబడింది. అంటే ఈశ్వరుని యందు గల పరమ ప్రేమనే భక్తి అంటారు. ఇట్లే శాండిల్య భక్తి సూత్రాల్లోను 'సా పరానురక్తిరీశ్వరే' (సూ.2) అంటే భగవంతునిపై గల పరమ ప్రీతి (గాఢానురాగం) భక్తి అని చెప్పబడింది. భగవంతుని యందుగల పరమ పూజ్యమైన ప్రీతియే భక్తి. ఇది తొమ్మిది విధాలు. ఈ భక్తిని రసమని నిరూపించినవాడు రూపగోస్వామి. నవరసాలకు మూలం భక్తి అని తెలిపి, దాన్ని సాంగోపాంగంగా నిరూపిస్తూ 'ఉజ్జ్వల నీలమణి' గ్రంథ రచన చేశాడు రూపగోస్వామి. ఆ వెనుక మధుసూదన సరస్వతి తన భగవద్భక్తి రసాయనంలో భక్తికి రసత్వాన్ని స్థాపించాడు. ఈ ఇద్దరి మహానుభావుల సిద్ధాంతాల ప్రకారం 'భక్తి రసమునకు నాలంబన విభావము భగవంతుడు; తచ్చరిత్రలు విభావములు; భగవదాకార చిత్తవృత్తియే స్థాయి భావము, అదియే భగవద్రతి. అనుభావములు తత్కాలమున బుట్టిన నేత్రాది వికారములు, వ్యభిచారులు నిర్వేద శంకాహ్లాదులు. ఇది పరమానంద స్వరూప మగు భక్తిరసముగా పరిణమించును."
(సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి : కావ్యాలంకార సంగ్రహం - పు. 306)
ఇలాగే భక్తి రసంగా ప్రతిపాదించబడింది. "గేయ రచనా సామ్రాజ్య పట్టాభిషిక్తులగు త్యాగయ్య గారిని విడిచితే భక్తి వైరాగ్య రచనలో రెండవ స్థానము గోపన్న గారికే ఈయవలసి ఉంది .......అయన తాను రచించిన కీర్తనలలో ఎదుటివారిని పరవశుల్ని చేసి తాను పరవశుడగును. 'సకలేంద్రియులారా! యిపుడు సమయము గాదు. సద్దుసేయక యుండరే' అని గోపన్నగారు అంటూ ఉంటే ఇంద్రియములకు ఏకాగ్రత గోపన్న గారికే కలుగుతుందో మనకే కలుగుతుందో చెప్పలేము........ త్యాగయ్య గారి కుండే సర్వతోముఖ ప్రతిభగాని, గోపన్న గారికుండే భక్తి తాదాత్మ్యము గాని, సారంగపాణి గారికి లేకపోయినా, భక్తికి తగిన భావన, భావనకు తగిన భాష ఒకదానికొకటి తులతూగుతూ సారంగపాణి గారి భక్తి వైరాగ్యకీర్తనలు

చాలా హృదయంగమములుగా ఉంటాయి" (సారంగపదములు-సమీక్ష పు. 20,21 అని మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు అభిప్రాయపడ్డారు; కానీ ఇక్కడ మన ఓ విషయం గమనించాలి. భక్తిభావనలో త్యాగయ్య రామదాసులతో ఇత వాగ్గేయకారులను పోల్చడానికి వీల్లేదని నా భావన. వీరిద్దరూ ఆ జన్మ శ్రీరా భక్తాగ్రేసరులు. సారంగపాణి క్షేత్రయ్యలాగా మొదట రక్తిగలిగి ఆ వెనుక భ వైరాగ్యాలను ప్రకటించాడు. అంతేగాక సారంగపాణి కీర్తనల్లో తాదాత్మ్య లేదంటే త్యాగయ్య కృతులకు, రామదాసు కీర్తనలకు ఉన్నంత ప్రచారం సారం పాణి కీర్తనలకు లేకపోవడమేనని భావించవచ్చు. అయినా నవవిధ భక్తుల్ని వైరాగ్య కీర్తనల్లో ప్రకటించాడు. సారంగపాణి ఇష్టదైవం వేణుగోపాలుడు.

"వేణుగోపాలుని విడువము - మరి
వేరే వక్కరి పేరునుడువము
.........................
పతితపావనుడే మాకు చుట్టము
గోపబాలుని భజనె దిట్టము
.........................
హరిని వినా వేరే పాడము....
.....................పరం
ధాముని మదిలో బంధింతుము
నారాయణ దివ్య నామము నె
న్నటికీ మరువమీ నీమము
తారకమిది మాకు క్షేమము శ్రీ
ధరునిసేవే పూర్ణ కామము" (కీర్తన - 158)

అని విష్ణుభక్తి, కీర్తన, స్మరణ, సేవనాదుల్ని ప్రకటించాడు.
ఇలాగే "అన్నిటికిది సులభమార్గము సుధీ
హరినామస్మరణా
పన్నగశయనుడైన వేణుగో
పాలుని సన్నిధికి జేరేటందుకు" (కీర్తన - 183)

అని తెలిపి, జపతపాలు యజ్ఞయాగాలు, వేద వాదాలు, వ్రత తీర్థయాత్రలు, దాన ధర్మాలు అరంలేదనీ వివరించి, చివరికి తాపసిమై గుహలు చేరకాన్ని ఖండిం ఛాడు. అదేవిధంగా వేణుగోపాలుని పాద భక్తి ప్రధానమని 'భక్తి లేని వ్రతము లెన్ని జేసిన ఫలములేదు సుమ్మీ" (కీ. 184) అని చాటి, పైపై ఆడంబరాల్ని ఖండించాడు. ఇంకా "నీ దివ్య మంగళమూర్తి ధ్యానము, భక్తి నిత్యము కృప సేయరే" (కీ. 185) అని వేడుకొంటాడు.

ఇంకా "పట్టవలెనయ్యా - గట్టిగ మనసు
పట్టవలెనయ్యా
పట్టవలె వేణుగోపాలు పదములు
కట్టవలెను వైకుంఠానికి మెట్లు" (కీర్తన - 165)

అని భక్తి మార్గాన్ని ప్రబోధించాడు. పూజ అవసరమే. కాని అది భక్తి సహితమై నప్పుడే దానికి విశిష్టత: చేసినందుకు సార్థకత ; సఫలత. అందుకే సారంగపాణి :

"భక్తి లేని పూజలేమిటికి పత్రిహారకగానే
భక్తి లేని పూజలేమిటికి" (కీర్తన - 180) అని అంటాడు.

మహా భక్తాగ్రేసరులైన కుబ్జ, శబరి, కుచేలుడు, విదురుడు, నారదుడు, విభీష ణుడు, ధ్రువుడు, హనుమంతుడు, గుహుడు మొదలైన వాళ్ల చరిత్రల్ని పేర్కొని అంతటి భక్తి తనలో లేదంటూనే తన భక్తి ప్రపత్తిని ప్రకటించాడు సారంగపాణి.

"నిన్ను నే విడువాను నీ పేరు మరువను
నీ బంటు బంటైనాను" (కీర్తన - 179) అనీ
"హరి నారాయణ గోవిందాయని
స్మరణ సేయవే ఓ మనసా
పురుషోత్తమ దామోదర కేశవ
భోగిశయన వేణుగోపాల" (కీర్తన - 175)

అనీ భగవన్నామ స్మరణ ప్రాధాన్యాన్ని చెప్పి నిర్మల భక్తి కావాలని వివ రించాడు. "కర్మ ఫలము రాముని కర్పించి" అని భగవద్గీతలో శ్రీకృష్ణుడు అర్జును

నకు ఉపదేశించిన ప్రధాన విషయాన్ని వివరించాడు. 'ఎంత పేదవాడే' (173) అని నిందాస్తుతి చేసి, "నిన్ను గొల్చి" (177) 'నన్ను నీవిక' (178) అని ప్రార్థించి భగవద్భక్తిని ప్రకటించాడు. 'మనసా చపలము మానవా' (182) 'మనసానమ్మ బాకే' (150), 'అద్దెకొంప నంటిది యీ దేహ మనిత్యమే మనసా' (199) అని వైరాగ్యం ప్రబోధించి, ఆధ్యాత్మిక చింతనను గూర్చిన ఆలోచనకు అవకాశం కల్పించిన మహాభక్తుడుగా, వైరాగ్య ప్రబోధకుడుగా, ఆధ్యాత్మిక చింతనాపరుడుగా సారంగపాణి మనకు దర్శనమిస్తాడు.

భాగవతంలోని భక్తి మధుర భక్తి. భాగవత భక్తి సంప్రదాయం శ్రీకృష్ణ సంబంధి భక్తి మార్గాల్లో శ్రేష్ఠమైంది. భాగవతంలోని మధురభక్తి రసావలంబను లైన గోపికా కృష్ణులు ఆలంబనగా వెలసింది వల్లభాచార్యుని పుష్టిమార్గం. ఇది చైతన్యస్వామి మధుర భక్తి. భగవంతుడనే నాయకుడొక్కడే పురుషుడు: మానవ కోటి స్త్రీ సమూహం. ఈ స్త్రీ పురుషుల అనంత శృంగార లీలయే విశ్వం. ఇలాంటి అలౌకిక మధురభావం గల మధుర భక్త్యుపాసకులు జయదేవుడు, విద్యాపతి, మీరా, అన్నమయ్య, క్షేత్రయ్యలు. కానీ అన్నమాచార్యుడు, క్షేత్రయ్యల మధుర భక్తి సారంగపాణిలో కనిపించదు. శృంగార పదాల్లో లౌకిక శృంగారాన్ని, కీర్తనల్లో భక్తినీ ప్రకటించాడు. అయినా

కులకాంతలు విడవడి నలుదిక్కుల
చెలరేగిందేటి పాపమో అయితే ॥పల్లవి॥

వెలయాండ్లకు జీవనమేమిక శ్రీ
వేణుగోపాలా సంకరమై ॥అ.ప॥

ఉగదెలిసుని బిడ్డలనెడబాసి - పున్న మూలముంత దాటవేసి
మగని పేరు కారాదని రోసి - మన్నె కాపురము వ్యర్థముచేసి
॥కుల॥

..........................................................

తల్లిదండ్రుల మది తల్లడబెట్టి-తమ జాతులకపకీర్తి బుట్టె
తలపరాని నిందలకొడిగట్టె - ధర్మశాస్త్రముల రోచిక బుట్టె
(ప్ర. 138) ॥కుల॥

అనే పదంలో లౌకిక శృంగారం కనిపించినా, భాగవత గోపికా మధుర భక్తిచ్ఛాయలు కనిపిస్తున్నాయి. ఇంతేగాక ఈ పదం క్షేత్రయ్య మధురభక్తి ప్రాధాన్యంగల ప్రసిద్ధ పదం -

"చూడరె అది నడిచే సొగాయలు
.... .. ................
కూడునటె అది మనిషా ప్రూకా"

అనే దాన్ని గుర్తుకు తెస్తుంది. కొంతవరకు సారంగపాణి పదం దీనిలోని మధుర భక్తిచ్ఛాయల్ని తెలుపుతుంది.

అన్నమయ్య శృంగార సంకీర్తనలతో పాటు అధ్యాత్మ సంకీర్తనలు రచించి తరించాడు. క్షేత్రయ్యవి కేవలం శృంగార పదాలు మాత్రమే. సారంగపాణి శృంగార పదాలతో పాటు కీర్తన రచనచేసి, అందులో భక్తి, వైరాగ్యం వేదాంతం, ఆధ్యాత్మిక చింతన, తాత్విక చింతన మొదలైన విషయాలను వివరించి, లౌకిక విషయాల్ని తెలిపి మంచిని పెంచుకోవాలని మానవాళికి నీతి ప్రబోధం చేశాడు. సారంగపాణి లోకరీతుల్ని, వ్యక్తుల తత్వాల్ని బాగా గుర్తించిన వాడు కావడంవల్ల భక్తి లేని పూజ అనవసరమని "జీతము ముట్టని కొలువేమిటికి" (180) అని అనేక విషయాల్ని, 'గుత్త లంజలను మరిగిన వారికి' (191) కలిగే పర్యవసానాన్ని, "పోరాని తావులకు పోరాదు బుద్ధిమంతుడైతే" (181) అని చెప్పి, "కడుపా నీవంత ఘనమైతివా .......కోటి విద్యలు నీ కొరకే గదవే" (192) అని అనేక జీవిత సత్యాలను వివిధ రీతుల వివరించాడు. "పాపాత్ములకెక్కడ దీ కాలము" (103) అంటూ పాపాత్ముల పాపపు కార్యాల్ని తెలిపి, "దాతను వాడాలు జరిపే దబ్బిలి కలమీదనె సొమ్ము" (167) అంటూ ఏనో వంక జూపి తప్పించుకోవడం ఉత్తమలక్షణం కాదని నిరూపించి, "మంచి వాడనుచు కీర్తి వహించే మానవుడే ఘనుడు" (171) అని మంచివాడుగా మారడానికి కావలసిన సమస్త విషయాలు వివరించి, "భక్తితో పిలిచి పెట్టిన యన్నము పట్టైనా చాలు" (176) అంటూ అంతశ్శుద్ధి, ఆత్మ సంతృప్తి ప్రధానమని ప్రబోధించాడు.

"అక్షయపాత్రకు పోతే కలదని వొక భిక్షవేయరయ్యా" (194) అనే

పదంలో అక్షయ పాత్రతో భిక్షమెత్తుకొని జీవించే సర్వసంగ పరిత్యాగుల్ని లెక్క-చేయని దుష్టుల దౌష్ట్యాన్ని మిక్కిలి గర్హించాడు సారంగపాణి.

భక్తి, వేదాంతం, వైరాగ్యం, ఆధ్యాత్మిక చింతన, తాత్త్విక చింతనలను చక్కగా వివరించాడు సారంగపాణి. "హరి తానే వున్నాడన్నిటికీ యే వెరపులేదిక మాకు" (189) అని అంతటికీ ఆ పరమాత్ముడని వివరించాడు. ఇంకా —

"అద్దెకొంప వంటిది యీ దేహ
మనిత్యమే మనసా ||పల్లవి||

మిద్దెమీది పరుగులు వెళ్లాళ్లను
మీ వేణుగోపాలుని సాక్షిగా ||అ.ప||

బండెగొడ్ల వంటిది సంసారము
భ్రమయకే మనసా
యెవరున్న నదపుంత్రమె జీవుని
కెవరులేరు మనసా మున్మాటికి ||అద్దె||

పువ్వువంటిది యౌవనమనగా
పొంగకే మనసా
నవ్వుగాదు సిరులు మెరుపు వంటివి
నమ్మకే మనసా మున్మాటికి ||అద్దె||
(ప. 190)

అని శరీరమనిత్యమన్న సత్యాన్ని హృదయానికి హత్తుకొనేట్లు నీతి వైరాగ్యాలను ప్రబోధించాడు సారంగపాణి. ఇలాగా భక్తి, నీతి, వైరాగ్యాలను తన పదాల్లో చాటి ప్రసిద్ధిపొందాడు సారంగపాణి.

21]

# తెలుగు, తమిళ, కన్నడ పద కవిత్వాలు

సాహిత్యాధ్యయనం కాలక్రమానుసారంగా గానీ, తులనాత్మకంగా గానీ చేయవచ్చు. ఇది ఒకే సాహిత్యానికి సంబంధించిన అంశం. అదే రీతిగా రెండు మూడు సాహిత్యాలను తులనాత్మకంగా అధ్యయనం చేయవచ్చు. వాటిని సరిపోల్చి పరిశీలించినప్పుడు వాటి సామ్య వైషమ్యాలు, సంబంధ బాంధవ్యాలు వ్యక్తమవుతాయి. ఈ తులనాత్మక అధ్యయనం ఆధునిక యుగంలో ఆరంభమైంది. సాహిత్యాన్ని తులనాత్మకంగా అధ్యనం చేయడం వల్ల అనేకానేక నూతనాంశాలు వెల్లడవుతాయి. ప్రత్యేకించి వాటిలో కనిపించే సాదృశ్యాల మూలంగా వాటి సన్నిహిత సంబంధ బాంధవ్యాలు, భేదాల మూలంగా వాటికి సంబంధించిన ప్రత్యేకతలూ మనకు స్పష్టమవుతాయి. ఇంతవరకు తెలుగు, కన్నడం, తెలుగు తమిళం జానపద గేయాల తులనాత్మక అధ్య నం జరిగిన సంగతి మనకు తెలిసిందే. అయితే అన్నిటి కంటే ముందు ముఖ్యంగా ద్రావిడ భాషల తులనాత్మక అధ్యయనం చేసిన ఘనత కాల్డ్వెల్ పండితునికే దక్కుతుంది. ఆ వెనుక తెలుగులో కోరాడ రామకృష్ణయ్యగారు, ఆచార్య గంటిజోగి సోమయాజిగారు తులనాత్మకాధ్యయనం చేసిన విషయం మనకు తెలుసు.

అయితే పూర్వోక్తమైనట్లు జానపద సాహిత్యం తప్ప తక్కిన సాహిత్య శాఖల్లో తులనాత్మక అధ్యయనం జరగవలసి ఉంది. అంటే ద్రావిడ సాహిత్యాలైన తెలుగు, తమిళ, కన్నడ సాహిత్యాల్లోని వివిధ శాఖల్లోను ఈ తులనాత్మక అధ్యయనం జరగవలసిన అవసరం ఎంతయినా ఉంది. అలా జరిగిననాడే తెలుగు, తమిళ, కన్నడ భాషా సాహిత్యాల సన్నిహిత సంబంధ బాంధవ్యాలను మరింత చక్కగా నిరూపింప వీలవుతుంది. వీటిలోని సమానతల్ని సమీక్షించ సాధ్యమవుతుంది. వైషమ్యాలు వింగడించి వివరించ వీలవుతుంది. తన్మూలంగా ఆయా సాహిత్యాలను, వాటిలోని సూక్ష్మాంశాల్ని సమవగాహన చేసుకోడానికి సాధ్యమవుతుంది. ఇదే విధంగా తెలుగు, తమిళ, కన్నడ పద కవిత్వాన్ని గూర్చిన

తులనాత్మక అధ్యయనం ఎంతైనా అవసరం. ఈ దృక్పథంలో నా "తెలు పదకత"[1] గ్రంథంలో కొంత ప్రయత్నం చేయడం జరిగింది. ఇంతకంటే మధ్యనే వెలువరించిన నా గ్రంథం 'అన్నమాచార్య, ప్రముఖ వాగ్గేయకా -తులనాత్మక అధ్యయనం' 1992 - తెలుగు విశ్వవిద్యాలయం సాహితీ పురసా నికి నోచుకున్నది. దీనిలో ఈ తులనాత్మక అధ్యయన విశిష్టతను పరిశీలించవచ

తెలుగు, తమిళ, కన్నడ సాహిత్యాలలోని కవిత పదకవిత, పద్య అని రెండు విధాలు. వాస్తవానికి తమిళం కంటే తెలుగు కన్నడాలకది త వర్తించే లక్షణం. కారణం తమిళంలోని కవిత చాలా వరకు పద కవిత గుర్తించడం జరిగింది. అంటే తమిళంపై, తెలుగు కన్నడాలపై తన పై నెరపిన సంస్కృత ప్రభావం తక్కువని భావం. తెలుగు కన్నడాలపై సం తందే పై చేయి కాగా, తమిళం సంస్కృతాన్ని సైతం తనలోనే ఇముడ్చుకొని దైన స్వరూపాన్ని నిలబెట్టుకొంది.

ఇంతకు మనం గుర్తించవలసిన ప్రధానాంశం ఒకటుంది. సాహి మార్గదేశి అని ద్వివిధం. ఆయా ప్రాంతాల్లో ఆయా పామర ప్రజలచేత వాడ పాడబడుతూ పరివ్యాప్తమైంది దేశి. లక్షణబద్ధమై పండిత పరమైంది మార్గ. మార్గదేశి విభాగం మొదట సంగీత పరంగాను, ఆ పిసుర నృత్య పరంగాను, తరువాత సాహిత్య పరంగాను నిరూపించబడింది. బహుశ :

"సంగీతమపి సాహిత్యం సరస్వత్యా స్తనద్వయం
ఏకమాపాత మధురం అన్యదాలోచనామృతమ్" అనే శ్లో

ఈ సంగీత సాహిత్యాలకున్న సంబంధాన్ని స్పష్టం చేస్తుండడం గూడా కారణమై ఉండవచ్చు. అంటే సామాన్య ప్రజానీకంలో ప్రచారంలో ఉన్న సం లక్షణ బద్ధమైనట్లె సాహిత్యం సైతం మార్గదేశి విభాగాన్ని సంగీత దర్పణము సంగీత రత్నాకరమూ [2] నిరూపిస్తున్నాయి. ఈ విభాగం దశరూపకంలో [3] నృ పరంగా చెప్పబడింది. దీనివల్ల తేలిన సారాంశం — "నియమబద్ధమై, శిష్టసమ మును, శాస్త్ర సమ్మతమును అయి ఉత్తమ ఫణితిని రచింపబడినది మార్గకవి నియమరహితమై శాస్త్రమునకెక్కక కేవలం ప్రజారంజకమునకై రచింపబడి దేశికవిత"[4]. దీన్నే మనం పద్య కవిత్వానికి, పదకవిత్వానికి సమన్వయించ

వచ్చు. పైపెచ్చు ఇది తమిళం కంటే తెలుగు కన్నడ పదకవితలకు సమంగా సరి పోతుంది. ఈ విషయం తమిళ కన్నడ తెలుగు పదకవితల్ని పరిశీలిస్తే స్పష్టమవు తుంది.

సమస్త సాహిత్యాల్లోను పద్యంకంటే పదమే ముందు ఆవిర్భవించిందన్న విషయం సర్వ పండితాంగీకృతం[5]. అంతేగాక పదకవిత నుంచే పద్య కవిత్వ ముద్భవించిందని పదమే ప్రాచీనమని రాళ్లపల్లివారి అభిప్రాయం సముచితమే[6]. అదే విధంగా తెలుగులోను పదమే ప్రథమంగా పుట్టింది. నన్నయ కంటే ముందు ఎంతో దేశి కవిత అనబడే జానపద కవిత ఉండి ఉంటుంది. అది లిఖితం కాకపోవటం తెలుగు జాతి దురదృష్టం. తమిళంలో ప్రాచీన కవిత అంటే లిఖిత మైన ఈ పదకవితలే. కన్నడంలోను బసవేశ్వరుని వచనాదులు ప్రసిద్ధమే. ఇవి పేరుకు వచనాలే కాని పాడుకోడానికి ఉపకరించేవే. ఇంకా కన్నడంలో దాస సాహిత్యమనబడే పదకవిత కెంతో ప్రసిద్ధి, ప్రాచుర్యమూ ఉన్న సంగతి స్పష్టమే.

తెలుగు, తమిళ, కన్నడ పదకవితల గూర్చి తెలుసుకొనే ముందు సంస్కృతమూ, హిందీ మొదలైన ఇతర ఔత్తరాహ సాహిత్యాల్లోని పదకవితల్ని వికాసాన్ని సైతం క్లుప్తంగా తెలుసుకోవడం అవసరం. భక్తిభావన భారతీయ తత్వం. భక్తితో పాటు పదకవిత ప్రారంభమైంది. నిజానికి వేద సూక్తాలే మొట్ట మొదటి పదాలన్న రాళ్లపల్లి వారి మాటలు పూర్వోక్తం. సామవేదం గానయోగ్య మైందన్న సంగతి సర్వ పండిత లోకానికి విదితమే. భరతముని నాట్య శాస్త్రం లోను, శార్ఙ్గదేవుడు సంగీత రత్నాకరంలోను, అభినవ గుప్తాచార్యుడు అభినవ భారతిలో సంగీత విషయాలను వివరించారు. క్రీ.శ. 11–12 శ. కాలంలో వెలసిన జయదేవుని గీత గోవిందంలోని అష్టపదులలో రచితమైనదీ పదకావ్యం. ఆ వెనుక లీలాశుకుడు శ్రీకృష్ణ కర్ణామృతం శ్లోకాల్లోనే రాసినా అవి పండిత సభల్లో పాడబడు తూనే ఉంటాయి. ఇలాగే సంస్కృతంలో ఎందరో మహానుభావులు పదరచన చేసి తరించారు.

ఇదే రీతిని భారతీయ భాషల్లో భక్తి గీతాలు రచితం కావటానికి జైన, బౌద్ధ సిద్ధుల తాన్త్రిక చర్య గీతాలే కారణమంటారు రాఘవన్‌గారు.[7] కృష్ణ భక్తికి వంగ దేశం ఆటపట్టు. దీనికి మూలవిరాట్టు వల్లభాచార్యుడు. తరువాత పేర్కొనదగ్గ

మహనీయుడు చైతన్యస్వామి. కృష్ణ భక్తితో మైమరచి, మైయమరిపించిన మహా కృష్ణ భక్తుడు సూరదాసు. ఆ వెనుక చెప్పదగ్గ భక్తులు తులసిదాసు, కబీరుదాసు పదకర్తలు. విద్యాపతి, చండీదాసులు, మీరాబాయి మహాభక్తురాలు. మహారాష్ట్రలో 50 మంది మహా భక్తులుండేవారు. వారిలో జ్ఞానదేవనామదేవులు క్రీ॥ శ॥ 13, 14 శ.ల కాలంలో ఉండేవారు. నామదేవుడు అభంగవృత్తాలనబడే భావగీతాలు రచించాడు. భక్త రామదాసు, భక్త తుకారామ్ పేర్కొనదగ్గ మహనీయులు. వీరి అభంగులు పదాలే. ఇలాగా ఉత్తర భారతంలో భక్తి కారణమైన పదకవిత విరాజిల్లింది.

దక్షిణ భారతంలో తెలుగు, తమిళ, కన్నడాలలో అత్యున్నత స్థితిలో ఈ భక్తి పూర్వకమేగాక, శృంగార, మధురభక్తి, నీతి వైరాగ్య తాత్వికచింతనా పూర్వకమైన పద కవితలు కోకొల్లలు వెలిశాయి. తెలుగు పదకవిత కంటే ముందు తమిళ కన్నడ పద కవితలు గూర్చి తెలుసుకోవడం అవసరం.

పూర్వోక్తమైనట్లు తమిళం ఇతర సాహిత్యాల్లోలాగాక తనదైన పద్ధతిన, మౌలికతని నిలబెట్టుకొన్న సాహిత్యం. అందుకు ప్రభువులు సైతం ఉపకరించడం మెచ్చుకోదగ్గ అంశం. "తమిళ ప్రదేశములో పండితులకు, కవులకు తగిన ప్రోత్సాహమిచ్చుటకై, వారి వారి రచనలను పరిశీలించి, ఆయా రచనల విలువలను నిర్ణయించు నిమిత్తమై, ఆ దేశ ప్రభువులు ఒక పండిత పరిషత్తు నేర్పరిచిరి. ఆ పరిషత్తును "సంఘమ్" అని వ్యవహరించుచుండెడివారు. తమిళ వాఙ్మయ చరిత్రను బట్టి ఈ పరిషత్తు క్రీ.పూ. 500 సం॥ల నుండి, క్రీ.శ. 2వ శ. వరకును అమలులో నున్నట్లు తెలియవచ్చుచున్నది. అందువలన, ఆ నడుమగాగల కాలమంతయు 'సంఘ కాలము' అని వ్యవహరింప బడుచుండెడిది. అటుపిమ్మట 3వ శ. నుండి 5వ శ. వరకు గల కాలము "సంఘోత్తర కాల" మనియు, "జైన, బౌద్ధ కాల" మనియు చెప్పబడుచున్నది. 6వ శ. నుండి 9వ శ వరకు గల కాలము 'భక్తి కాల' మని నుడవబడుచున్నది." [8]

"ఒకవైపు శైవము మరియొకవైపు వైష్ణవమును ప్రబలు చుండిన కాలమది. శైవ సమయాచార్యులకు నాయన్మారులనియు, వైష్ణవ మతాచార్యులకు అళ్వారులనియు వ్యవహార నామములు కలిగెను.... మత విషయక వాదోపవాధములలో

మునిగిపోయిన నాయన్మారులు గాని, ఆళ్వారులుగాని ప్రత్యేక గ్రంథములు సంతరించకపోయినను, భక్తిరస పరిపూర్ణములగు గీతములనేకములు వెలయించిరి. ఆ భక్తి గీతములే తరువాతి కాలమున సంకలనము చేయబడి గ్రంథ రూపమున వెలువడెను. శైవ గీత కదంబమునకు తిరుమరై అనియు, వైష్ణవ గీతికా సందోహమునకు నాలాయిర ప్రబంధము అనియు వ్యవహార నామములు కలిగెను. కనుక శైవ వైష్ణవ మతాచార్యుల యుగమున ప్రచారములోనికి వచ్చిన తమిళ సాహిత్యము మధుర గేయమయమై, భక్తిరస ప్రపూర్ణమై యున్నదనుట సమంజసం. ఆళ్వారులును, నాయన్మారులును సంస్కృత భాషాభిజ్ఞులైనను భక్త్యుద్రేకమున వారు ప్రజల భాషయందే గీతములు పాడిరి".[9] నాయన్మారులలో శ్రేష్ఠుడైన మాణిక్య వాచకరు దేశికవితా శాఖకు చెందిన అచ్చన గాయల పాటలు, గొబ్బి పాటలు, జోలపాటలు వంటి వాటితో మధుర కవిత వెలయించాడు. శైవంలాగా వైష్ణవం కూడా ప్రాచీన మతం. దక్షిణ భారతంలో ముఖ్యంగా తమిళ దేశంలో వైష్ణవ మత వ్యాప్తికి తోడ్పడినవారు ఆళ్వారులే.[10] ఆళ్వారులు పన్నిద్దరు వీరి విష్ణు భక్తి గీతాలు నాలుగు వేలున్నాయి. ఈ సంకలన గ్రంథానికి నాలాయిర ప్రబంధ మని పేరు. ఆళ్వారులలో నమ్మాళ్వారు శ్రేష్ఠుడని ప్రతీతి. వీరిలో మహావిష్ణు భక్తురాలు ఆండాళ్ 'గోదాదేవి' పెరియాళ్వారు పుత్రిక, భక్తి పారవశ్యంతో ముప్పై పాశురాలు పాడింది.[11] తమిళ శైవ వైష్ణవ కవులు అనేక భక్తిరస పూరితాలైన పదరచన చేయడమూ, అవి గానానుకూలంగా ఉండటమూ విశేషం.[12] తమిళంలోని దివ్య ప్రబంధాలు తేవారమ్ పదాలుగా దేవాలయాల్లో పరమ పవిత్రంగా వాద్యాలు తోడుగా కీర్తించబడేవి.[13] మళయాళం చాలాకాలం వరకు తమిళంతోనే కలిసి ఉండటంవల్ల అందులో అతి ప్రాచీన పదకవిత అని చెప్పవీలులేదేమో కానీ, జానపద కవితకు కొదవలేదు. కథకళి తరువాతి కాలంలో వెలసింది.

ఇలాగా తమిళంలో పదకవిత సహజమై, భక్తి పూరితమై, అనాది నుంచి ఉన్నదన్న విషయం స్పష్టం.

కన్నడ సాహిత్యం తొమ్మిదో శతాబ్దిలో ఆరంభమైంది. అయితే అంతకు ముందు, సమకాలికంగానూ జానపదకవిత పెల్లివిరిసింది. తమిళంలోలాగే కన్నడం లోను శైవ వైష్ణవ మతావలంబులు ఈ పదకవితల్ని వెలయించారు. పదకారుల్లో చెప్పుకోదగ్గ ప్రముఖుడు బసవేశ్వరుడు. అంతకంటే ముందు దాశిమయ్య, ఆ

తరువాత అక్కమహాదేవి వచన రచన చేసి దేశి సాహిత్యాన్ని పరిపోషించారు.[14] ఇవి పేరుకు వచనాలేగాని రాగయుక్తంగా పాడుకోదగిన పాటలే. ఆ తరువాత కృష్ణ భక్తి పూరిత పదరచన అంటే దాస సాహిత్యాన్ని పేర్కొనవలసి ఉంది. తమిళనాడులోని నాయన్మారులా, ఆళ్వారుల భక్తి కన్నడ దేశానికి ప్రాకి అక్కడ కూడా ఆయా మతాలు అభివృద్ధి చెందాయి.

మతంతో పాటు పదరచన పరాంకోటి కెక్కినది దాస సాహిత్యంలోనే. క్రీ. శ. 13వ శ.లో ఉడిపి దగ్గర ద్వైతమత ప్రవక్తలగు శ్రీ మధ్వాచార్యులు అవతరించి శైవ మతానికి బసవేశ్వరునిలాగా భాగవత ధర్మాన్ని వ్యాప్తిలోనికి తెచ్చాడు. ఇతని శిష్యుడు పద్మనాభతీర్థులు. ఇతని శిష్యుడే శ్రీ పాదరాయలు. కన్నడంలో దేవర నామములనబడే కీర్తనలను రచించి పూజాసమయంలో పాడించే పద్ధతిని ఆరంభించిన ఘనత ఇతనికి దక్కింది.[15] ఈ పదాల్లోని భక్తి శృంగారాదులు శ్రోతల్ని ఆకర్షిస్తూ ఉంటాయి. శ్రీ పాదరాయల ముఖ్య శిష్యుడు వ్యాసరాయస్వామి. నూర్ల కొలది మనోహరమైన కీర్తనల్ని రచించి దాస కూటాన్ని ఉన్నత స్థితికి తెచ్చిన ప్రముఖుడు[16]. వ్యాసరాయల ప్రియశిష్యులలో ప్రథమ గణ్యుడు పురందరదాసు; వాగ్గేయకార చక్రవర్తి, కర్ణాటక సంగీతానికి తన పద రచనతో చక్కని బాటలు వేసిన వాడు. తెలుగులో వేల కొలది పదాలు రచించిన అన్నమాచార్యుని సమకాలికుడు. "The great art of the pada-singers of this school, Purandaradasa (1480-1564) is revered as founder of Modern Karnataka music........His padas, the model and source of inspiration for Thagaraya,are remarkable for their devotion, moral teachings, popular, sayings, wit and philosophical truths."[17] అని అభివర్ణించిన డా. రాఘవన్ మాటలు స్మరించదగ్గవి.

వ్యాసరాయ ప్రియ శిష్యులలో మరో ఉత్తమ పదకర్త కనకదాసు ఇంకా గోపాలదాసు, విజయదాసు. జగన్నాదదాసులు పదరచన చేసి కన్నడ సాహిత్యంలో దాస సాహిత్యానికే ఎంతో పుష్టిని, తుష్టిని చేకూర్చిన పదకర్తలు. వారి నందరిని స్మరించడం సమంజసం.

తెలుగు సాహిత్యం క్రీ.శ. 11వ శ. లో వెలసింది. అయితే అంతకు ముంచే దేశిసాహిత్యమనబడే జానపద సాహిత్యం విరివిగా ప్రచారంలో ఉండే ఉం

టుంది. అది పండిత సాహిత్యమైతే ఇది పామర సాహిత్యం. అందుచే తెలుగు సాహిత్యాన్ని పండిత సాహిత్యమూ, పామర సాహిత్యమూననీ లేదా శిష్ట సాహిత్యమూ, శిష్టేతర సాహిత్యమూనని వింగడించ వచ్చు. శిష్ట సాహిత్యంకంటే ముందే శిష్టేతర సాహిత్య ముద్భవించినా, ప్రాచుర్యం పొందినా అది పామరులకు మాత్రమే పరిమితమైంది. రాజాదరణ లభించిన శిష్టసాహిత్యం పండిత లోకంలో ప్రబలింది; లిఖితమై చాలా వరకు నిలిచింది. పామర సాహిత్యం మౌఖికం కావటం వల్ల కాల గర్భంలో ఎంతో కలిసిపోయింది.

తెలుగు సాహిత్యంలో శిష్టేతర కవితాస్రోతస్విని మూడు పాయలుగా ప్రవహిస్తూ వచ్చింది. మొదటిది కేవలం జానపద కవిత. దాని పుట్టుక అనాది.లిఖితం కాలేదు. కేవలం మౌఖికం మాత్రమే.

రెండోది నన్నయ్యకు పూర్వం శాసనాల్లో అక్కడక్కడా చోటు చేసుకున్నా, పాల్కురికి సోమనాథునితో ప్రారంభమైన ద్విపద కవిత. దీనికి మళ్లీ జానపదులలో వ్యాప్తిలో ఉన్న ఏలలు, జోలలు మొదలైన జానపద రూపాలే ఆధారం. ద్విపదని గ్రహించడమే కాదు పాల్కురికి దీనికి కావ్యభాషా ప్రతిపత్తిని కల్పించాడు అంటే పండితులు సైతం గౌరవించేటట్లు పాటు పడ్డాడు. అనాడు పండిత లోకంలో సంస్కృతానికే గాని దేశి అయిన తెలుగుకు ప్రాధాన్యం లేకపోవటంవల్ల దాన్ని ప్రామాణికం చేయడం కోసం —

"తెలుగు మాటలనంగవలదు, వేదముల
కొలదియ కా జూడుడిల నెట్టులనిన
బాటి తూమునకు బాటి యౌనేని
బాటింప సోలయు బాటిరాదె"

(బసవ పురాణం-పు. 8, 9. 1951)

—అని పట్టుబట్టి అంగీకరింప చేసినట్లు తెలుస్తుంది. ఇక్కడ ఈ ద్విపద శైవ మత ప్రచారం కోసమే ఆరంభమైనా, ఆ వెనుక తెలుగులో ఆదరం లభించింది.

ఆ వెనుక మూడోది వైష్ణవ మత ప్రాధాన్యంతో అన్నమాచార్యుని (1408-1503) తో ఆరంభమైన పదకవిత. ఈ పదకవితకు పూర్వం కృష్ణమాచార్యుని

(1268-1323) సింహగిరి వచనాలు రచించి తరించాడు. అలాంటివే వేంకటేశ్వ వచనాలని పెద తిరుమలాచార్యుడు రచించాడు. ఆనాటి నుంచి పామర ప్రజల అలరిస్తూ వచ్చిన జానపద గేయరీతుల్ని గ్రహించి అనేక పదకవితల్ని కవితల్లో ఒక భాగంగా వెలయించి–పండిత ప్రశంసకు పాత్రమైన పద్యకవి పీఠం ప్రక్కనే పద కవితకు సైతం–సరిసీటం వేసిన ఘనత అన్నమాచార్యుని దక్కింది. పైపెచ్చు సంస్కృతంలో "సంకీర్తన లక్షణం" రచించి విశిష్టత గౌరవ ప్రతిపత్తిని కలిగించి, ప్రామాణికతను సంప్రాప్తింప చేశాడు. అంటే దీని నిబద్ధతని నిరూపించాడు. తాళ్ళపాకవారి పదాలు, తత్వాలు వచనాలు వచ్చాయి. అన్నమయ్య పద్ధతిలో పెద తిరుమలాచార్యుడు, చిన తిరుమలాచార్యుడు పదా రచించి తరించారు.

సంకీర్తన, పదమూ అని పిలువబడుతూన్న ఈ పదం క్షేత్రయ్య కాల నాటికి శృంగార పదమనే ప్రసిద్ధికెక్కింది. అభినయం జోడింప బడింది. ఆనా నుంచి పదాభినయం ప్రారంభమైంది. రామదాసు భజన కీర్తనలు రచించాడ సారంగపాణి పదాలు, కీర్తనలు రచించాడు. నాదోపాసనలో ముక్తి చెంది త్యాగరాజు రచనలు కృతులు. సాహిత్యం కంటే సంగీతమే ఇందు ప్రాధాన్య వహించింది. పోతులూరి వీరబ్రహ్మంగారు, సిద్ధయ్య మొదలైనవారు తత్వాలనబ పద రచన చేశారు ఇలాగా తెలుగులో పదకవిత మూడు పువ్వులారు కాయలు విలసిల్లి ఒక కవితా శాఖగా ప్రసిద్ధి చెందింది. ఎందరో మహానుభావులు ప కవితలకి పట్టంకట్టి పరిపోషించారు. ఇంకా ఈనాడూ కొనసాగుతూనే ఉంది.

తెలుగు, తమిళ, కన్నడ పద కవితలలో భేదాలకంటే సామ్యాలే అధికం కనిపిస్తాయి. కారణం ఈభాషా సాహిత్యాలు సుసంపన్నం కావటంలో కాల వ్యత్య మున్నా, ఇవి ఒకే కుటుంబానికి – అంటె ఆర్య భాషా కుటుంబం కంటె – దక్షి భాషా కుటుంబమైన ద్రావిడ భాషా కుటుంబానికి చెందినవి కావడమనే విషయ సర్వ పండిత లోకానికి విదితమే.

విశ్వసాహిత్యాలన్నిట జానపద కవిత్వం అనాది మాత్రమే కాదు. పునాది. ఆ తరువాతనే పద కవిత్వంగాని, పద్య కవిత్వంగాని వెలిసిందని అంశం పూర్వోక్తం. అదే రీతిగానే తమిళ, కన్నడ, తెలుగు సాహిత్యాల్లో

జానపద కవిత్వమే ఆరంభంలో ఉద్భవించింది. వాస్తవానికి తమిళంలో అతి ప్రాచీన గ్రంథాలనబడే సాహిత్యమంతా జానపద సాహిత్యమే అనే విషయం విశద మైంది. దానికి కారణం రాజుల పోషణమే. ప్రాచీన కాలంలో కళలు రాజపోషణ వల్లనే అభివృద్ధి చెంది ప్రచారమయ్యాయనే సంగతి మనకు తెలుసు. అలాగే తమిళంలో అభివృద్ధి చెందింది. అలాంటి అవకాశాలు లేని తెలుగు కన్నడ సాహిత్యా లలో జానపద కవితకు ఆదరణ లేకపోవడంవల్ల అది ఎంతో కాలగర్భంలో కలిసి పోయింది. జానపద కవితాచ్ఛాయలు ఈ రెండు సాహిత్యాల్లోని శాసనాల్లో అక్కడక్కడా కనిపిస్తాయి. తమిళ కవిత్వం కేవలం దేశీయతను నిలబెట్టుకొంటే. తెలుగు కన్నడ కవితలు రాజాదరణతో సంస్కృతానికి లేని తియ్యదనాన్ని, పరిమళాన్ని సంతరించుకొన్నాయి.

తెలుగు, తమిళ, కన్నడ పదకవితల్లో జానపద గేయరీతులు స్పష్టంగా తెలుస్తాయి. అందలి భాషలన్ని జానపదులకు అంటే పామరులకు సంబంధించిన భాషలు; పండిత భాష సంస్కృతం. సంస్కృత భాషాభిజ్ఞుడే పండితుడుగా పరిగణింపబడే ఆనాడు కేవలం ఆయా ప్రాంతాలకు సంబంధించిన తమిళ, కన్నడ, తెలుగు భాషల్లో ఈ జానపద గేయ రీతులు వెలిశాయి.

తమిళంలోని నాయన్మారుల్లో మాణిక్య వాచకరు అచ్చన గాయలు, గొబ్బి పాటలు, జోలపాటలు వంటి మధుర గీతాలు రచించినట్లు తెలుస్తుంది. ఆళ్వారుల నాలాయిర ప్రబంధమనబడే నాలుగు వేల వైష్ణవ గీతాలు, తేవారమ్ పాటలు దేవా లయాలలో కీర్తింపబడేవి. ఇవన్నీ పాడుకోవటానికి అంటే సంగీతాన్ని ఆశ్ర యించి ఉండేవని స్పష్టం. అలాగే శైవమత ప్రచారానికై యత్నించిన బసవేశ్వ రాదుల పాడుకోడానికి వీలైన పద్ధతిలోని వచనాలు ప్రసిద్ధి పొందాయి. వైష్ణవ భక్తులు పాడిన దాసర పదగళు అన్నీ పాడటానికి ఉపకరించేవే. పురందర దాసు, కనకదాసు పదాలలో బుడబుక్కల పాటల రీతులు, ఒగటు మొదలైన జానపద రీతులున్నాయి. తెలుగులోను వీరశైవ మత ప్రచారానికై జాను తెనుగులో రచించిన పాల్కురికి సోమనాథుడు తన బసవ పురాణానికి "ఆ తత సకల పురాతన భక్తి గీతార్థ సమితియే మాతృక" అని తెలిపి (బసవ పురాణం-పు 95) అనాటి శంకర, నివాళి, పర్వత పదాలు, గొబ్బి, వెన్నెల మొదలైన పదాలు (పండితారాధ్య

చరిత్ర - పు. 513) ఉన్నట్లు పేర్కొన్నాడు. ఇలాంటి పదాలెన్నో జానపద సాహిత్యంలో ఉండేవని స్పష్టమవుతుంది. పదకర్తల్లో ప్రముఖులైన అన్నమాచార్యుల పదాలలో జాజర, చందమామ, తుమ్మెద, లాలి, సువ్వి, గొబ్బి, ఉయ్యాల, జోల, శోభన, మేల్కొలుపు, నలుగు, కొట్నాలు, కూగూగు, ఆల్లో నేరెళ్ళు, వెన్నెల, తందనాన, ఛాంగుభళ మొదలైన జానపద గేయ రీతులు కోకొల్లలు. ఇలాగా తమిళ, కన్నడ, తెలుగు సాహిత్యాల్లోని పదకవితల్లో జానపద రీతులుండడం సహజ విషయమన్న సంగతి విశదమవుతుంది

తమిళ, కన్నడ, తెలుగులోని ఛందస్సహితీ రీతుల్ని కోరాడ రామకృష్ణయ్య గారు వివిధ రీతుల వివరించారు.[18]

తమిళ, కన్నడ, తెలుగు పదకవితలన్నిటా భక్తి ప్రధానం. ఇందులో శృంగారం, మధుర భక్తిసైతం ఉండటం గమనించదగ్గ అంశం. నీతి, వైరాగ్య ఆధ్యాత్మిక చింతనానుగుణమైన పద్ధతులు అందులో మనం చూడవచ్చు.

ఈ మూడు సాహిత్యాల్లోని పదకవితల్లో సంగీతం ప్రాధాన్యం వహించింది. భక్తికి, సాహిత్యానికి, సంగీతానికి విడదీయరాని బంధం. తమిళ సాహిత్యంలోని ఆళ్వారుల పాశురాలలో[19], కన్నడ దాసర పదాలలో, తెలుగులో అన్నమాచార్యులు మొదలు త్యాగరాజు వరకు ఈ సంగీతం ఆరంభమై, అభివృద్ధి చెంది, వికాసం పొందింది. సంగీతానికి ఒక ప్రత్యేకత ఏర్పడి, స్థిరస్థాయిగా నిలిచింది.

చివరగా తెలుగు, తమిళ, కన్నడ పదకవులు తామే యశోదగా భావించుకొని ఆ పరమాత్మునికై పాడిన జోలతో ముగించడం సముచితమని భావిస్తాను.

తెలుగులో ప్రసిద్ధమైన అన్నమాచార్యుల జోలపాట —

"జో అచ్యుతానంద — జోజో ముకుంద
రావె పరమానంద — రామ గోవింద" [20]

ఇది చాలా ప్రసిద్ధమైంది. తెలుగు జానపద సాహిత్యంలోను ఇలాంటి జోలపాట తెలుగు నాట వినిపిస్తూనే ఉంటుంది. తమిళ, కన్నడ సాహిత్యాల్లోను ఇలాంటి జోల పాట ఉండటం విశేషం. "ఈ జోల పాట వలెనే పెరియాళ్వారులు తమిళమున కొన్ని జోలపాటలను రచించియున్నారు తెలుగు జోలపాటలో 'జో జో,

అను శబ్దము పునరావృతమగు చుండుటచే, తమిళమున గూడ 'తాలేలో' అను శబ్దము నీరి జోలపాటలో పునరావృతమగుచుండును. పెరియాళ్వారులు రచించిన ఇట్టి జోల పాటలలోని — అన్నింటి కంటెను ముఖ్యముగా—కృష్ణుని ఉయ్యెలలో పరుండబెట్టి, యశోద పాడెడి జోలపాట ఒకటి అధిక ప్రచారములో నున్నది' పరిశీలింపుడు —

"మాణిక్కఙ్గట్టి నయిరమిడై కట్టి
ఆణిప్పొన్నాల్ శెయిద వణ్ణచ్చిఱుత్తొట్టిల్
పేణియునక్కు ప్పిరమన్ విడు తన్దాన్
మాణిక్కుఱళనే తాలేలో — వైయమళన్దానే తాలేలో"

శఙ్గిన్ వలయమ్పురియమ్ శేవడిక్కిణ్గిణియుమ్
అఙ్గచ్చరివళై యుకునాణా మరైత్తొడరుమ్
అఙ్గణ్ విశుమ్బిల్ అనుగర్ కళ్పోత్తన్దార్
శెఙ్గట్కరుముగిలే తాలేలో తేవకి శిఙ్గమే తాలేలో"

కానార్ నరుస్తుళాయ్ కైశియ్త కణ్ణియుమ్
వానార్ శోశు ఙ్మొలై కల్పకత్తిన్ నాశికైయుమ్
తేనార్ మలర్మేల్ తిరుమఙ్గై పోత్తన్దాళ్
కోనే యళేలశేల్ తాలేలో — కుడన్దైకిడన్దానే తాలేలో"[21]

అని ఈ విధంగా ఎంతో మనోహరంగా, మధురంగా, రచితమై ఉండడం సహృదయ హృదయాల్ని అలరిస్తుంది.

ఇలాగే దీనితో సమానమైన కన్నడంలోని పురందరదాసు జోలపాట ఉదాహరించ దగ్గది. పురందరదాసు సైతం యశోదామాతగా మారిపోయి తన్మయత్వంతో ఈ పదరచన చేసి పాడినట్లు స్పష్టమవుతుంది.

"జో జో శ్రీకృష్ణ పరమానంద —
నందగోపియకంద ముకుంద జో జో ॥పల్లవి॥

పాల్గడలొళు పవడిసిదపనె ఒల—

బాలదెలెయ మేలె వలగిద శిశువె.
శ్రీ లలితాంగియర చిత్తదొల్లభనె —
బాలనిన్న పాడి తూగువెనయ్య. ॥జో జో॥

హో శెవంద రన్నద తొట్టిలమేలె
ధళధళిసువ గురుగుంజియ మాలె
అళదె నీ పిడిదాడెన్నయ ముద్దు బాల -
నళిననాభనె నిన్నపాడి తూగువెను ॥జో జో॥

యారకంద నీనార నిధానీ -
ఆరత్నవూ నీనార మాణిక్యవో
సేరితు ఎనగొందు చింతామణి ఎందు -
పోరెనిన్నను పాడి తూగువెనయ్య. ॥జో జో॥

గుణనిధియె నిన్నను ఎత్తుకొండిద్దరే -
మనెయకెలసవారు మాడువరయ్య
మనకె సుఖనిద్రె తదుకో బేగ -
ఫణిశయననె నిన్న పాడి తూగువెను. ॥జో జో॥

అండజ వాహన అనంత మహిమ -
పుండరీకాక్ష శ్రీ పరమ పావన
హిండుద్దైవద గండ ఉద్దండనే -
పాండురంగ శ్రీ పురందర విఠల. ॥జో జో॥

ఇలాగా పురందరదాసు అమితానందంతో భక్తి ప్రపత్తితో పదరచన చేసినట్లు స్పష్టం.

ఈ విధంగా తెలుగు, తమిళ, కన్నడ పదాలలో ఎంతో సామ్యం గోచరిస్తుంది. ఆవులెన్ని రకాలైనా పాలవర్ణానలొక్కటే; పూలెన్నైనా పూజ ఒక్కటే; భాషలువేరైన భావన ఒక్కటే; అందలి భక్తి ఒక్కటే. తదుచిత రీతిని భాషలు వేరైనా తెలుగు, తమిళ, కన్నడ సాహిత్యాల్లోని పదకవితల్లో భావమొక్కటే, అందలి భక్తి ఒక్కటే. అంటే ఆయాపదకవుల అంతర్యమొక్కటే,

సూచికలు :

1. మార్గదేశి విభాగేన సంగీతం ద్వివిధం మతమ్
ద్రుహిణేన యదుద్దిష్టం, యదుక్తం భరతేనచ
తన్మార్గోహియయారీత్యా; యత్స్యాల్లోకానురంజనం
దేశేదేశే సంగీతం తద్దేశిత్యభిధీయతే”

(సంగీత దర్పణము)

2. “దేశేదేశే జనానామ్ యద్రుచ్యా హృదయరంజకమ్
గీతంచ వాదనం నృత్తం తద్దేశిత్యభిధీయతే”

(సంగీత రత్నాకరము)

3. “అద్యం భావాశ్రయం నృత్యం, నృత్తం తాళలయాశ్రితమ్
అద్యం పదార్థాభినయో మార్గో; దేశితథా పరమ్”

(దశరూపకము)

4. పింగళి లక్ష్మీకాంతం : ఆంధ్రసాహిత్య చరిత్ర - పు. 28-33

5. R. G. Moulton : Methods and Matrials of Literary Criticism - Pp. 13, 14.

6. రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ : సాహిత్యోపన్యాసములు - 3. క్షేత్రయ్య పదసాహిత్యము - పు. 12, 13.

7. Dr. V. Raghavan : The Great Imtegrators - Saint Singers of Inbia. పు. 19.

8. ధనకుధరం వరదాచార్యులు : ఆళ్వారులు - దివ్యప్రబంధములు- పు. 13, 14.

9, 10, 11. ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మ : తమిళ సాహిత్యము - దక్షిణ భారత సాహిత్యములు-పు. 24, 25.

12. పైదే, పు. 27.

13. పై 7 సూచికలోనిదే. పు. 21, 22.

14. డా॥ ఆర్వీయస్. సుందరం : కన్నడ సాహిత్య చరిత్ర - పు. 215-220
ii) ఎం. మరియప్పభట్ట : సంక్షిప్త కన్నడ సాహిత్య చరిత్రె
పు. 189 - 197

15. ఎం. చిదానందమూర్తి : ఉగాభోగగళు మత్తు వచనగళు :
ప్రబుద్ధ కర్ణాటక - సం. 46, క్రోధన, సం.
చైత్ర, సంచికే - 1, మైసూరు విశ్వవిద్యాలయ,
మైసూరు - 1964-65.

16. గడియారం రామకృష్ణశర్మ : కన్నడసాహిత్య చరిత్ర - దక్షిణభారత
సాహిత్య చరిత్ర పు. 92 - 94.

17. పై 7వ సూచికలోనిదే. పు. 25.

18. దక్షిణదేశ భాషాసారస్వతములు - దేశి. పు. 118-212.

19. ధనకుధరం వరదాచార్యులు : ఆళ్వారులు - దివ్యప్రబంధములు
పు. 194 - 203

20. నా ఈ వ్యాససంపుటిలోని "అన్నమాచార్యుల జోలపాట - జానపదాంశం"

21. ధనకుధరం వరదాచార్యులు : ఆళ్వారులు - దివ్యప్రబంధములు
పు. 212, 213.



## ముద్రిత గ్రంథాలు :

విమర్శ / పరిశోధనాత్మక గ్రంథాలు :

కోలాచలం శ్రీనివాసరావు-నాటక సాహిత్యసమాలోచనము-1977 (పి.హెచ్.డి. సిద్ధాంత గ్రంథం)

క్షేత్రయ్య పదసాహిత్యం 1974 (ఆం.ప్ర. సాహిత్య అకాడమీ అవార్డుపొందిన గ్రంథం)

తెలుగులో పదకవిత-1983 (ఆం.ప్ర. సాహిత్య అకాడమీఅవార్డు పొందినగ్రంథం)

వేయిపడగలు - విశ్లేషణాత్మక విమర్శ — 1987) (విశ్వనాథ సాహిత్యపీఠం అవార్డు పొందిన గ్రంథం)

అన్నమాచార్య, ప్రముఖ వాగ్గేయకారులు-తులనాత్మక అధ్యయనం - 1992 (1993 సం.నికి తెలుగు విశ్వవిద్యాలయం సాహితీ పురస్కారం పొందినగ్రంథం).

కోలాచలం శ్రీనివాసరావు - 1973 (ఆం.ప్ర. సంగీత నాటక అకాడమీ ప్రచురణ)

తెలుగుదేశపు జానపదగీతాలు - 1976 (ఆం.ప్ర. సమాచార, పౌరసంబంధాల శాఖ ప్రచురణ)

క్షేత్రయ్య - 1976 (ఆం.ప్ర. సమాచార, పౌరసంబంధాలశాఖ ప్రచురణ)

ప్రసంగ సాహితి (రేడియో ప్రసంగాలు) - 1978

సారంగపాణి పదసాహిత్యం - 1980

సాహిత్యోపన్యాసములు-17 ఉన్నవ లక్ష్మీనారాయణ శతజయంతి ప్రసంగం 1980.

సాహిత్య సుధ 1981 తెలుగు వాగ్గేయకారులు-1983 జానపదసాహిత్యం-1983

జాతికి ప్రతిబింబం - జానపదసాహిత్యం - 1984

జానపదగేయాలు (సేకరణ, లఘువివరణ) - 1985

తెలుగునాటకం - 1985

భాషావ్యాసాలు - 1985

వేమన భావన-1987

సిద్ధేంద్రయోగి-1978 పురందరదాసు, నాగార్జునుడు : తిరుమలతిరుపతి దేవస్థానం ప్రచురణలు

ఎర్రన-రసపోషణ - 1991

సాహిత్య సమాలోచన - 1991

సాహిత్యానుశీలన - 1993

పదసాహిత్య పరిమళం - 1991

పాఠ్య గ్రంథాలు :

8, 9,10 తరగతుల ఉపవాచకాలు - 1982, 1983, 1984.

కమ్మర్షియల్ ప్రాక్టీసు, సెక్రెటేరియల్ కోర్సు - ప్రథమ, ద్వితీయ భాగాలు - 1977, 1978 (ఇంటర్మీడియేట్ పాఠ్యగ్రంథాలు)

రాజరాజ ప్రశస్తి (చారిత్రిక నవల) నాగార్జున విశ్వవిద్యాలయం - బి.ఏ. డిగ్రీ; శ్రీసత్యసాయి ఇన్స్టిట్యూట్ ఆఫ్‌హయ్యర్ లర్నింగ్- బి.ఏ డిగ్రీ:+2CBSE–ఉపవాచకం) 1982, 1984

జానపదవీరగాథా వాఙ్మయం
తులనాత్మక సాహిత్యం -
జానపద వచన వాఙ్మయం.
} ఆంధ్ర విశ్వవిద్యాలయం కరెస్పాండెన్స్ కోర్సెస్.

బుర్రకథ - ఎం.ఏ. ఫైన్ ఆర్ట్స్ — పాఠ్యగ్రంథం. తెలుగు విశ్వవిద్యాలయం.

**కవితలు :**

బాలగేయాలు - 1981

నవోదయం - 1981

కథలు :

తీరిన భయం - 1985

నవలలు :

సుహాసినీహాసం (సాంఘికం) — 1967

రాజరాజ ప్రశస్తి. (చారిత్రికం) ప్ర ము. - 1982, ద్వి.ము. 1984

ఆత్మార్పణం (చారిత్రికం) 1988

నాటకం :

పదకవితా పితామహుడు-1986

ముద్రణలో :

జాతీయ ప్రసంగ సాహితి

అన్నమాచార్య సంకీర్తన సుధ

ముద్రణకు సిద్ధం :

పునర్యౌవనం - (ఇతర నాటికలు)

కడగండ్ల కడలిలో బ్రతుకుపడవ (ఇతర నాటకాలు).

విశ్వనాథ వారి నాటక స్వారస్యం

గురుపూజ (వయోజన విద్య)

కాటమరాజు విజయం (చారిత్రిక నవల)

జాతీయ అధ్యాపకులుగా అలీగడ్, బెనారస్, మద్రాసు, తెలుగు విశ్వవిద్యాలయాల్లో ఆంధ్ర, తెలుగు, ఉస్మానియా విశ్వవిద్యాలయాల్లో పునశ్చరణ . తరగతుల్లో

అవార్డులు : 1972-73 క్షేత్రయ్య పదసాహిత్యం- ఆం.ప్ర. సాహిత్య అకాడమీ అవార్డు .

1980-81 తెలుగులో పదకవిత- ఆం.ప్ర. సాహిత్య అకాడమీ అవార్డు.

1983-85 కేంద్ర ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాలశాఖ సీనియర్ ఫెలోషిప్పు

1984 : 'వేయిపడగలు' విమర్శకు విశ్వనాథ సాహిత్యపీఠం అవార్డు.

1989-91 యు. జి. సి. జాతీయ అధ్యాపకులు అవార్డు.

1991-92 ఉత్తమ అధ్యాపకులు ఆం. ప్ర. స్టేట్ అవార్డు.

1991-92 ఉత్తమ పరిశోధన: తిక్కవరపు రామిరెడ్డి స్మారకధర్మనిధి అవార్డు, తెలుగు విశ్వవిద్యాలయం.

1993. అన్నమాచార్య, ప్రముఖ వాగ్గేయకారులు: తులనాత్మక అధ్యయనం, తెలుగు విశ్వవిద్యాలయం సాహితీపురస్కారం.

పదవులు : సభ్యులు, పాఠ్యనిర్ణాయక సంఘం:అలీగడ్, బెనారస్, ఉస్మానియా, కాకతీయ, శ్రీ కృష్ణదేవరాయ, నాగార్జున విశ్వవిద్యాలయాలు: విజయవాడ ఆంధ్రలయోలా కళాశాల.

1993-96 అకడమిక్ సెనేట్ సభ్యులు: తెలుగు విశ్వవిద్యాలయం.

1994-96 అధ్యక్షులు: పాఠ్యనిర్ణాయక సంఘం, నాగార్జునవిశ్వవిద్యాలయం.

1994-97 అధ్యక్షులు: పాఠ్యనిర్ణాయక సంఘం; ఆం. ప్ర. బోర్డు ఆఫ్ ఇంటర్మీడియేట్ ఎడ్యుకేషన్, హైద్రాబాద్.



**Prof. S. GANGAPPA PADA SAHITYA PARIMALAM 50/-**

---

జననం : 8.11.1936 నల్లగొండ్రాయనిపల్లి, పెనుకొండ తా॥ అనంతపురం జిల్లా
జననీజనకులు: శ్రీమతి కృష్ణమ్మ, వెంకటప్ప.
విద్యాభ్యాసం: ప్రాథమికవిద్య: 1946-49 ప్రాథమిక పాఠశాల, సోమందేపల్లి.
ఉన్నతవిద్య: 1949-55 బోర్డు ఉన్నతపాఠశాల, పెనుకొండ.
ఇంటర్మీడియేట్: 1955-57 ప్రభుత్వ కళాశాల, అనంతపురం
బి.ఏ. ఆనర్సు, ఎం.ఏ : 1957-60 ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు.
పిహెచ్.డి ; 1972 శ్రీవేంకటేశ్వరవిశ్వవిద్యాలయం, తిరుపతి.
ఉద్యోగం : 1960-78 ఆంధ్రోపన్యాసకులు, శాఖాధ్యక్షులు : అనంతపురం, కాకినాడ, విశాఖ పట్నం, హైదరాబాద్, కర్నూలు సిల్వర్ జూబిలీ ప్రభుత్వ కళాశాలల్లో
నాగార్జున విశ్వ విద్యాలయంలో:
1978-83 ఆంధ్రోప న్యాసకులు : 1983-88 రీడర్,
1988 నుంచి తెలుగు ప్రొఫెసర్,
1989-91 అధ్యక్షులు : తెలుగు, ప్రాచ్యభాషావిభాగం
1994-96 అధ్యక్షులు : ఎం. ఏ. పాఠ్య నిర్ణాయక సంఘం
ముద్రితరచనలు ; 45 గ్రంథాలు : ముద్రణలో : 5 గ్రంథాలు : తెలుగు భాషా సాహిత్యాలు, పద, జానపద, నాటక సాహిత్యాల విమర్శక, పరిశోధనాత్మక, సృజనాత్మక రచనలు.
వ్యాసాలు : అనేక పత్రికల్లో వివిధ సాహిత్యాంశాలపై పలువ్యాసాలు
పర్యవేక్షణ : 17 పిహెచ్. డి. డిగ్రీలు : 16 ఎం. ఫిల్. డిగ్రీలు పరిశోధక విద్యార్థులు పొందారు.
ప్రసంగాలు : అనేక సాహిత్య సదస్సుల్లో గోష్ఠుల్లో, పత్రసమర్పణ
విజిటింగ్ ఫెలోగా కాకతీయ విశ్వవిద్యాలయంలో ప్రసంగాలు

(తరువాయి 3వ కవరు పేజీ)